# The Rice Sprout Song

by

EILEEN CHANG

Translated by

C. VENKATARAMIAH

Original Publishers : Scribner 1955

Printed at

SRI NILAYAM, MADRAS-17.

# ఏరువాకా సాగాలోయ్!

రచన:

ఎలీన్ ఛాంగ్

అనువాదం:

కొమ్మూరి వెంకటరామయ్య

విదేశీ సాహితీ గ్రంథమాల

సం|| నెం—17.

# పీఠిక

చైనాదేశంలో కమ్యూనిస్టు పాలనక్రింద వున్న షాంగాయ్ నగరంలో ఒకనాటి సాయంకాలం నేను పత్రికలు తిరగవేస్తూ కూచున్నాను. 'పీపుల్సు లిటలేచరు' అనే పత్రికలో ఒక యువక రచయిత వ్రాసిన వ్యాసం నన్నాకర్షించింది.

1900 సంll లో తూర్పు చైనాలో తీవ్రమైన క్షామం వచ్చినపుడు ఆ రచయిత ప్రభుత్వోద్యోగంలో ఉన్నాడుట. ఆ వూరిప్రజ ఆకలి మంటలకు తాళలేక ప్రభుత్వపు ధాన్యపు కొట్లమైనబడి దోచుకో ప్రారంభించారు. గుంపును చెదరగొట్టేందుకు స్థానిక మిలటరీ తుపాకులు కాల్చిందిగాని జనాన్ని ఆపలేకపోయింది. రోజంతా ప్రజలు దోచుకోవడమూ, మిలిటరీవారు తుపాకులు ప్రేల్చడం జరుగుతూనే వుంది.

ఆ వూరి పార్టీ నాయకుడికి అండగా నిలబడి ధాన్యపుకొట్లను కాపాడేందుకు ఆ రచయిత తన శక్తికొద్దీ పోరాడాడు. పార్టీ నాయకుడు గాయపడి అలిసిపోయి విస్మయంతో "ఎక్కడో ఏదో పొరపాటు జరిగింది. మనము తప్పటడుగులు వేశాము." అన్నాడు.

విప్లవం జయప్రదం కాదేమోనని అతని కళ్లు చెమ్మగిల్లాయి. ఈ సంఘటన యితివృత్తంగా తీసుకుని ఒక కథ అల్లితే బాగుంటుందన్న అభిప్రాయంతో అతను ఒక కథ వ్రాశాడు. ఆ సంఘటనలో తను ప్రాముఖ్యం కల్పించుకుని వుండడం మహాపరాధమని ఒప్పుకుంటూ తనను తనే కఠినంగా విమర్శించుకున్నాడతను.

అతను క్షమాపణ చెప్పుకుంటూ వ్రాసిన ఆ కథ నాలో చైతన్యం కలిగించింది. అందుకు ఫలితమే నా యీ పుస్తకం. ఇదే నేను మొదట యింగ్లీషు భాషలో వ్రాసిన పుస్తకం. నేను చదివిన విషయాలతో, నాకు తెలిసిన విషయాలు సరిపోల్చుకుని యీ పుస్తకం రచించాను.

హాంకాంగు పట్టణంలో వున్న రిచ్చర్డు మెకార్థి, న్యూయార్కు పట్టణంలో వున్న మేరీ ఎఫ్‌గ్రోడెల్ యీ పుస్తకం వ్రాయడంలో నాకు సహాయపడినందుకు వారికి నా కృతజ్ఞత తెలుపుతున్నాను.

ఈలెన్‌షాంగ్.

# మొదటి ప్రకరణము

ఆ ఊరి పొలిమేరలో అడుగుపెట్టగానే ఏడెనిమిది పూరియిళ్లు కనిపిస్తాయి. అవన్నీ ఒకేమాదిరిగా ఉంటాయి. వాటిలో మనుష్యులున్నట్లు సూచిస్తూ పొగగూళ్లలోంచి పొగ వస్తూవున్నా ఆ యిళ్లు నిర్మానుష్యంగా కనిపిస్తాయి. ఆ యిళ్లమీద మాగ ఎండ పడుతోంది.

ఆ యిళ్లు దాటివస్తే దుకాణాలు కనబడతాయి. దుకాణాల వెనక ఒక పెద్ద కొండ వుంది. ఆ కొండకు వెనక దూరంగా మసక మసకగా రెండు శిఖరాలు కనపడతాయి.

వీధికి ఒకవైపున గోడ కట్టబడ్డది. వీధి పొడుగునా వున్న ఆ గోడకు అవతల వైపు అగాధమైన లోయవుంది.

ఓ దుకాణంలోంచి ఒక స్త్రీ మురికి నీళ్లతో నిండిన ఎర్రని పింగాణీ గిన్నె తీసుకుని బయటకు వచ్చింది. గుమ్మందాటి గోడదగ్గరకు వెళ్లి ఆ గిన్నెలోని నీళ్లు గోడకవతల వున్న లోయలో పారబోసింది. ఆ గోడ ప్రపంచానికే ప్రాకారపు గోడా అన్న భ్రమ కలిగించింది ఆ దృశ్యం.

దాదాపు అన్ని దుకాణాలను స్త్రీలే నడుపుతున్నారు ఆ వూళ్లో. భుజాలవరకూ పడుతున్న సాఫీ కట్టూ, తలమీద ఆకుపచ్చ ఊలుటోపీలూ, ఎడమ చెవికి నెమలి ఆకారంలో వున్న నీలిరంగు పోగులూ వాళ్ళ అలంకారాలు. సన్నగా, నిమ్మపండు రంగులో వున్నారా స్త్రీలు. వాళ్ళ చూపులు వాడిగా వున్నాయి. ఆ అలంకారాలు ఎవరిని చూసి వాళ్లు అనుకరించినదీ చెప్పడం కష్టం. చైనాదేశపు నాటకాలలో బందిపోటు దొంగ వేషధారులు తలలకు ఆ మాదిరి టోపీలే పెట్టుకునేవారు.

ఒక దుకాణంలో నువ్వుల రొట్టెలు, రాయిలా గట్టిగా వున్న నువ్వుల జీడీలు అమ్మబడుతున్నాయి. ఇవిగాక దొంతరలుగా పెట్టిన రెండు తెల్ల కాగితం పొట్లాల వరసలు కూడా అమ్మకానికి వున్నాయి. ఓ మనిషి వచ్చి ఒక పొట్లం కొనుక్కుని అక్కడే తినటం ప్రారంభించాడు. అందులో అయిదు చిన్న నువ్వుల రొట్టెలు వున్నాయి. రెండో దొంతరలోని పొట్లాలలో నువ్వుల జీడీలూ, నువ్వుల రొట్టెలూ వుండి ఉంటాయి.

ఇంకో దుకాణంలో అద్దాల అల్మారులలో పసుపు పచ్చని కాగితపు దొంతరలు, టూత్ పేస్టు గొట్టాలు, పళ్ళపొడుం, సబ్బులు అమ్మకానికి

వున్నాయి. ఆ సంచీలపైన చైనా సినిమాతారల ఫోటోలు విలాసంగా నవ్వుతున్నట్లు వున్నాయి. అందమైన ఆ ముఖాలు ఫోటోలు మాత్రమే కావడంవల్ల ఆ వీధి మరింత నిర్మానుష్యంగా కనపడ్డది.

వీధిలో పడివున్న తెల్లని గులకరాళ్లమీద నడుస్తూ కోళ్లు వీధిలోకి వచ్చాయి. భుజంమీద కావడి వేసుకుని రెండు తట్టల్లోనూ నువ్వుల జీడీలు అమ్ముకుంటూ ఒక మనిషి వీధిలోకి వచ్చాడు.

ఇంకో దుకాణంలో లాంతర్లు, కొవ్వొత్తులూ అమ్ముతున్నారు. సన్నని ఎర్రరంగు కొవ్వొత్తుల గుత్తులు తీగెలనుండి వేలాడుతున్నాయి. ఆ దుకాణానికి పక్కన వున్న దుకాణంలో ఒక చిన్న పిల్లమాత్రం కూర్చునుంది. ఆ పిల్ల పచ్చని కిరసనాయిలు డబ్బా మూతతీసి అందులోంచి చేత్తో చుట్టిన సిగరెట్లను తీసి బయట పెడుతోంది. ఆ వీధిలో పోతున్న ఒక ముసలావిడ కాళ్ళకు చెప్పులకు బదులు గుడ్డలు చుట్టుకుంది. కావిడి మనిషిని ఆపి జీడీలు బేరంచేసింది. ఆమె అతని ముఖంలోకి పరీక్షగా చూసి "అరే! నువ్వా! నీ పేరు లోటస్‌బారన్ కదూ! మీ నాన్నా, అమ్మా బావున్నారా! మీ వాళ్ళంతా కులాసాయేనా? మీ నాలుగో పినతల్లి కుశలంగా వుందా?" అని అడిగింది.

మొదట్లో ఆ మనిషి తెల్లబోయి చూశాడు. అంతలో ఆమె తన నాలుగో పినతల్లి చుట్టమనీ, తన తాత దివసానికి ఆమె వచ్చినపుడు ఆమెను చూసిన సంగతీ అతనికి జ్ఞాపకం వచ్చింది. ఆమె పొట్టిగా, ఎర్రగా వుంది. వృద్ధాప్యంవల్ల ఆమె ముఖం వరుగులా ఎండిపోయి ముడతలు పడ్డది. తలకు టోపీబదులు నల్లటి గుడ్డపీలిక కట్టుకుంది. ఎండను చూడడం బాధగా వున్నట్లు మాటిమాటికీ కళ్లు ఆర్పుతోంది. పొలం గట్టునుంచి అరుస్తున్నట్లు గొంతు చించుకు మాట్లాడుతుందామె.

"అత్తా! ఇవాళ యిక్కడికెందుకు వొచ్చావు? ఏమిటి విశేషం?" అడిగాడతను.

"నా మేనకోడలితో వచ్చాను. చావూరిలో వున్న చాన కుటుంబం లోని కుర్రాణ్ణి అది పెళ్ళి చేసుకోబోతోంది. జిల్లా పబ్లిక్ ఆఫీసులో యివాళ వాళ్ళ పెళ్లి జరుగుతుంది. పాపం దానికి తల్లీ, తండ్రీ లేరు. వున్నదల్లా అన్న ఒకడే. దాని వదిన పట్నంలో పనిచూసుకుని అక్కడికి వెళ్లింది. పెళ్లికి వొచ్చేందుకు ఆ అన్న తప్ప దానికి బంధువులెవరూ

లేరు. మాస్ కుటుంబం చాలా పెద్దదని నీకు తెలుసుగా! వాళ్లంతా పెళ్లికి తరలి వస్తున్నారు. దానివేపు బంధువులెవ్వరూ లేక పోతే వెలితిగా వుంటుంది. అందుకని నేను వొచ్చాను" అంది ఆమె.

ఒక నిమిషం పూరుషుని కళ్లు చిట్లించి నవ్వుతూ అతన్ని చూసి "అను కోకుండా నిన్ను యిట్లా కలుసుకోవడం ఎంత చిత్రంగా వుంది! మేము యిప్పుడే యీ వూరికి వొచ్చి ఆ రోడ్డుపక్కన వున్న సత్రంలో దిగాము. 'మీరిక్కడే వుండండి. మాస్ కుటుంబంవారు వచ్చారో లేదో చూసి వస్తాను' అని వాళ్ళతో చెప్పి బయలుదేరాను. వాళ్ళకంటే ముందు మేము జిల్లా ఆఫీసుకు వెళ్ళడం బాగుండదు కదూ! అట్లా వెళ్లితే పెళ్లికూతురివేపు వాళ్లు ఆత్రంగా ఉన్నట్లు కనపడుతుంది" అన్నదామె.

"పెళ్లి కొడుకు తల్లి వచ్చాడా?" అడిగాడా మనిషి.

'ఆఁ వచ్చాడు. కొంతమంది మాస్ జిల్లా ఆఫీసుముందు కూర్చుని వుండడం నేను చూశాను. నేను పోయి పెళ్లికూతుర్ని పలుచుకు వెళ్ళాలి. వాళ్లను ఎక్కువసేపు కాచుకు కూర్చోబెట్టడం బాగుండదు. నువ్వు కూడా నీపని మానుకోకుండా నాతో మాట్లాడుతూ నిలబడకూడదు. నీ వ్యాపారం బాగా సాగుతోందా? అన్నట్లు ఆ జీళ్లు ఎంతని చెప్పావు!" అని అడిగిందామె.

అతను వాటిఖరీదు చెప్పకుండా రెండు జీళ్లు తీసి ఆమె చేతిలో పెట్టి "అత్తా! వీటిని తీసుకో!" అన్నాడు.

ఆమె అతని చేతిని కొంచెం కోపంతో తోసి వేస్తూ "వద్దు. వద్దు. ఏమిటిది! ఎన్ని ఏళ్ళ తర్వాతో నిన్ను మళ్ళీ యిప్పుడు చూస్తున్నాను. నీ దగ్గరనించి వూరికే యివి నేను తీసుకుంటానా?" అంది.

"ఇదేమిటి అత్తా! ఇవేం మహాభాగ్యమూ!" అన్నాడతను.

"వద్దు. వద్దు. అక్కర్లేదు. అదీగాక నాకు పళ్లు లేవు. ఈ జీళ్లు ఎలాగూ నేను తినలేను."

"పోనీ యింటికి తీసుకువెళ్లి పిల్లలకు యియ్యి."

ఆ జీళ్లు ఒకళ్ల చేతుల్లోంచి యింకోళ్ళ చేతుల్లోకి మారుతూ కరిగి పోవడం మొదలుపెట్టాయి. పాకం చేతులకు అంటుకోవడం వల్ల చిరాకు కలిగి అతని ముఖంలోని మందహాసం మాయమైంది. ఎట్లా అయినా అవి ఆమెకు యిచ్చి తన విధి నెరవేర్చుకోవాలనుకున్నాడతను.

అతను ఆమె పట్ల చూపుతున్న అనురాగానికీ, మర్యాదకీ ఆ ముసలామె లొంగిపోయి జీళ్లు తీసుకుని బయలుదేరింది. ఆమె వెనక్కి తిరగగానే అతని ముఖంపైన వున్న చిరునవ్వు మాయమై ఆ చిరునవ్వు యీామె ముఖంమీద వెలిగింది. అతను కావడి బుజాన వేసుకుని ముఖం చిట్లించుకుంటూ వెళ్లిపోయాడు. ఆమె తనలో తను నవ్వుకుంటూ తన దారిన తను నడిచింది.

దుకాణాలూ, పూరియిళ్లూ దాటి వూరి చివర వున్న సత్రం దగ్గరికి వెళ్లి "నేను ఎవరిని కలుసుకున్నానో చెప్పుకోండి." అని దూరంనించే అరిచిందామె. "పీచ్ క్రీక్ పల్లెలో వివాహం చేసుకున్న నా మేనత్త కూతురు మీకు తెలుసు! ఆ మేనత్త కూతురి మేనల్లుడు యివాళ నాకు కనిపించాడు. జీళ్లు అమ్ముకుంటూ వీధిలో వెళుతున్నాడు. నేను అతన్ని చూసి చాలా కాలమైంది. పలకరిద్దామా వద్దా అని కాసేపు తటపటాయించాను కూడా." అన్నదామె.

"సరేలే! వాళ్లు ఆ చాస్ వచ్చారా యింతకీ?" అని కొంచెం చిరాకుతో ఆమె మేనల్లుడు గోల్డురూట్ అడిగాడు. చాలా సేపటినుంచి అతను అత్త రాకకు ఎదురుచూస్తున్నాడు. తెల్లగా, భారీగా, పొడుగ్గా అందంగా వుంటాడా యువకుడు. బాగా పాతబడి, వెలిసి, చిరిగిపోయిన నీలిరంగు చొక్కాలోంచి అతని భుజాలు పొడుచుకు వస్తున్నాయి.

"వచ్చారు. వాళ్లు వచ్చారు, నేను చూశాను వాళ్ళని" అన్నదతని అత్త.

"అయితే మనం యిక వెళదామా!" అన్నాడు గోల్డురూట్ తన చెల్లెలు గోల్డు ఫ్లవర్ వేపు తిరిగి.

పెళ్లికూతురు గోల్డు ఫ్లవర్ ఆ మాటలు వినిపించుకున్నట్లు లేదు. తన జేబులో రుమాలును ఎంగిలితో తడిపి గోల్డురూట్ మాసిన చేతులు తుడుస్తోంది.

సత్రంలో వూరికే కూర్చోవడంవల్ల తోచక ఆపిల్ల బల్ల యెక్కి, కిటికీ అందుకుని, అక్కడ వున్న దుమ్మంతా చేతులకు పట్టించుకుంది. కొంచెం సేపుంటే తన అత్త తొడుక్కున్న ఎర్రటి కొత్తగౌనుకు చేతుల మురికంతా పులిమేదే! మర్నాడు శాస్త్రీయంగా జరగబోయే పెళ్లప్పుడు కూడా గోల్డు ఫ్లవర్ ఆ గౌనే తొడుక్కోవాలి.

తను అడిగిన ప్రశ్నకు చెల్లెలు జవాబు చెప్పనందువల్ల ఏమి చెయ్యాలో తోచక నడుంమీద చేతులు పెట్టుకుని నిలుచున్నాడు గోల్డు రూట్.

అంతలో వాళ్ళ అత్త "ఏమిటి యింకా బయలుదేరరేం!" అని అరిచింది.

"రా! పోదాం పద. వెళ్ళకపోవడం చాదస్తంగా ఉంటుంది." అన్నాడు గోల్డురూట్.

"ఎవరికి చాదస్తం! అత్తను ఒక నిముషం కూర్చుని ఆయాసం తీర్చుకోనీ! అంత దూరం వెళ్లి వొచ్చింది. పాపం అలిసిపోయి వుంటుంది." అన్నది పెళ్లికూతురు.

"లేవండి. వెళదాం. సిగ్గుపడకూడదు. ఈ రోజుల్లో పెళ్లికూతుళ్లు సిగ్గుపడరు." అంది అత్త.

"సిగ్గెవరికి?" అంటూ గోల్డుఫ్లవర్ కొంచెం కోపంగా లేచి నిలబడి పట్నంవేపు దారి తీసింది. అందంగానూ, అమాయికంగానూ వున్న ఆ ముఖం చూస్తే పధ్ధెనిమిదేళ్ళ ప్రాయం గల యువతిలా కనపడదామె. ఒక పన్ను కొంచెం యెత్తుగా వుండడం వల్ల పెదిమలు కొద్దిగా విప్పారి ఉంటాయి. అందువల్ల ఆమె ముఖ సౌందర్యమేమీ చెడిపోలేదు. జుట్టు పైకి దువ్వి నడినెత్తిన ముడివేసింది. ఏదో బాధపడుతున్నట్లు ఆమె మాటి మాటికీ కళ్లార్పుతుంది. అందుకు కారణం జుట్టు పైకిదువ్వి బిగించి ముడి వేయడమే అయివుండవచ్చు.

పెళ్లికూతురు ముందూ, మిగతా వాళ్లు ఆమె వెనకా నడుస్తున్నారు. ఏ నిముషాన్నయినా వెనక్కి తిరిగి పారిపోతుందేమో నని భయపడుతున్నట్లు గోల్డుఫ్లవరును వెంటాడుతూ నడిచిందామె అత్త. గోల్డురూట్ కూతురిని ఎత్తుకుని కొంచెం వెనకాలే వస్తున్నాడు. జిల్లా పబ్లిక్ ఆఫీసు సమీపించగానే ఆ ముసలావిడ తన మేనకోడలు దగ్గరకు వెళ్లి, మోచెయ్యి పట్టుకుని గుఱ్ఱాన్ని నడిపించినట్లు జాగ్రత్తగా ముందుకు నడిపించింది.

"ఆహా! దానంతట అది నడవగలదులే! జమీందారిణీ కాదుగా!" అన్నాడు గోల్డురూటు.

"జమీందారు! జమీందారిణి! మా రోజుల్లో పూర్వం నే చెప్పినా యిటువంటి మాటలు వినలేదు." అంది ఆ ముసలావిడ.

జిల్లా ఆఫీసు ముందు కూర్చున్న పెళ్లి వాళ్ళల్లో కొంతమంది తలలు పైకెత్తి "వచ్చారు. వాళ్లు వచ్చారు. అదుగో పెళ్లికూతురు" అని చెప్పుకోవడం మొదలు పెట్టారు. చాస్ కొంతమంది ముందుకు వచ్చి గోల్డు రూట్‌ను ఆహ్వానించారు.

ముసలి అత్త చేతులు రెండూ పెళ్లికొడుకు తల్లి పట్టుకుని "అంత దూరంనించి నడిచి వచ్చారా!" అంది. ఆమెకు యాభై ఏళ్లుంటాయి. పొడుగాటి మనిషి. చురుకైన స్వభావం. పెళ్లికొడుకు కొంచెం దూరంగా నిలబడి వున్నాడు. అతని ముఖంమీద చిరునవ్వు వెలుగుతోంది. ఎవరూ పెళ్లికూతురిని సూటిగా చూడలేదు గాని అందరి దృష్టి ఆమె మీందే వుంది. గోల్డుఫ్లవర్ తలెత్తి మందహాసంతో అందరినీ చూసింది.

ఆహ్వానాలు పూర్తయినాక అందరూ లోపలికి వెళ్లారు. ఎవరు రిజిస్ట్రారు దగ్గిరికి వెళ్లి తాము వచ్చినపని ఆయనకు చెప్పాలి -అన్న విషయంమీద వాళ్లల్లో వాళ్లకు కొంచెం వాగ్వివాదం జరిగింది. నిజానికి పెళ్లికొడుకు తరఫు వారిది పైచెయ్యి. అక్కడ వున్న వారిలో కల్లా పెళ్లికొడుకు తల్లి వయస్సులో పెద్దది కావడంవల్ల రిజిస్ట్రారు దగ్గిరకు ఆమే వెళ్ళాలి. కాని ఆపని చేయవలసింది ఆడది కాదనీ, గోల్డురూట్ రిజిస్ట్రారు దగ్గిరకు వెళ్లాలనీ ఆమె పట్టుబట్టింది. గోల్డురూటు ఒప్పుకోలేదు. చివరకు పెళ్ళికొడుకు అన్న రిజిస్ట్రారు దగ్గరకు వెళ్ళాడు. అందరూ రిజిస్ట్రారు బల్ల చుట్టూ గుమికూడారు. పెళ్లికొడుకు అన్న రిజిస్ట్రారుకు తాము వచ్చినపని చెప్పాడు. రిజిస్ట్రారు అచ్చుకాయితాలు బయటకు తీశాడు. పెళ్లికొడుకూ, పెళ్లికూతురూ రిజిస్ట్రారు బల్లముందు నిలబడ్డారు.

"నీ పేరేమిటి?" అడిగాడు రిజిస్ట్రారు.

"ప్లెంటీ ఓన్‌చా."

"మీదేవూరు?"

"చాపల్లె."

"నువ్వు ఎవరిని వివాహం చేసుకోదలచావు?"

"గోల్డుఫ్లవర్‌ని."

"ఎందుకామెని వివాహం చేసుకుంటున్నావు?"

"ఆమె పనిచేయగలదు గనుక."

అవే ప్రశ్నలు పెళ్లికూతురిని కూడా అడిగాడు రిజిస్ట్రారు. "నువ్వు అతన్ని ఎందుకు వివాహం చేసుకుంటున్నావు?" అన్న ప్రశ్నకు మామూలు సమాధానం "అతను పని చెయ్యగలడు గనుక" అని చెప్పింది పెళ్లికూతురు చిలక పలికినట్టు.—ఇంకేదైనా సమాధానం చెబుతే యింకా ప్రశ్నలడిగి యిబ్బంది పెడతాడు రిజిస్ట్రారు.

పెళ్లికొడుకూ, పెళ్లికూతురూ అచ్చు కాగితాలమీద వేలిముద్రలు వేయటంతో వాళ్లిద్దరికీ న్యాయసమ్మతమైన వివాహం జరిగినట్లు ప్రకటించాడు రిజిస్ట్రారు. చైనావారి పూర్వాచారం ప్రకారం వివాహం అంతటితో పూర్తి కాదు. శాస్త్రరీత్యా కూడా వివాహం జరగాలి. అది జరిగేవరకూ పెళ్లికూతురు పుట్టింట్లోనే వుంటుంది. కనుక రిజిస్ట్రారాఫీసు నుంచి బయటకు వచ్చి రెండువైపుల పెళ్లివాళ్ళూ ఒకరివద్ద ఒకరు సెలవు తీసుకుని ఎవరి బసలకు వాళ్లు బయలుదేరారు.

"అత్తా! రేపు భోజనానికి పెందరాళే రావడం మర్చిపోకుసుమా!" అంది పెళ్లికుమారుడి తల్లి పెళ్లికూతురి అత్తతో.

"సరేలే! త్వరగా యింటికి వెళ్లి విశ్రాంతి తీసుకో! రేపు మళ్లీ కావలసినంత పని!" అని జవాబు చెప్పింది పెళ్లికూతురి అత్త.

పెళ్లివారిని సాగనంపి పెళ్లికూతురూ, ఆమె అన్నా, మేనకోడలూ, అత్తా వూళ్లో అవీయివీ చూస్తూ నెమ్మదిగా నడవడం ప్రారంభించారు. గోల్డుఫ్లవర్ తన మేనకోడలు చెయ్యిపట్టుకుని మాట్లాడకుండా నెమ్మదిగా నడుస్తోంది.

ఆ వూళ్ళో ఒకచోట ఒక హోటలుంది. ఆ హోటలంతా బట్టబయలుగా వీధిలోకి కనిపించే కొయ్యతో కట్టిన ఒక పెద్ద హాలు. కొయ్యలకు రంగు వెయ్యకపోవడం వల్ల చెక్కలు పసుపు పచ్చగా కనిపిస్తున్నాయి. హాలు లోపల వెలుతురంతగా లేదు. మసక మసకగా చీకటి ఆవరించి వుంది. దుమ్ముకొట్టుకున్న గొర్రెపోతు మాంసం, కొత్తగా వచ్చిన పంది మాంసం ముక్కలూ, ఎండిన చాపలూ, ఫలహారాలు తినేవాళ్ల తలలపైన దూలాలకు వేళ్లాడుతున్నాయి. హాలు గుమ్మందగ్గిరే వున్న మట్టిపొయ్యి దగ్గిర వంటవాడు నిలబడి వున్నాడు. పొయ్యిమీద పెనంలో మసాలా సామగ్రి, కొయ్యలూ వేసి వేయిస్తున్నాడతను. నూనెలో అవి వేగుతున్నప్పుడు సముద్రం నురగలా నుసుగు పొంగుతోంది. తపాలా జవాను వేసుకునేలాటి

ఆకుపచ్చని లాగు తొడుక్కుని ఒక అమ్మాయి పొయ్యి పక్కన కూర్చుని పొయ్యిలో చితుకులు వేసి మండిస్తోంది. ఆ హోటలులోని సందడి హడావిడీ వీధిలోకి వినిపిస్తున్నాయి.

గోల్డురూట్ కుమార్తె ఆ హోటలు ముందు ఆగిపోయింది. గోల్డు ఫ్లవర్ ఆ పిల్లను అక్కడనించి లాక్కుపోవడానికి ప్రయత్నించగా ఆ పిల్ల ఏడుస్తూ నేలమీద చదికిలబడ్డది.

"ఎందుకే ఏడుస్తావు! రేపు మీ అత్త పెళ్ళే! పెళ్ళి భోజనాల్లో నీకు కావలసినవన్నీ కడుపునిండా తినవొచ్చు. పంది మాంసం, చాపలు బోలెడన్ని పెడతారు. ఏడవడం మాని రాకపోతే నిన్ను రేపు పెళ్ళి విందుకు తీసుకువెళ్ళం తెలుసా!" అంది ముసలామె.

ఆ మాటలు పెడచెవిన పెట్టిందాపిల్ల. పొయ్యి దగ్గర నిలుచున్న వంటవాడూ, పొయ్యిలో చితుకులు వేస్తున్న అమ్మాయీ వీళ్ళను ఎగాదిగా చూడసాగారు. వీళ్ళకు సిగ్గువేసింది.

గోల్డురూట్ బలవంతాన కూతురిని ఎత్తుకున్నాడు. ఆ పిల్ల ఏడుపు మానలేదు. కాళ్ళు తన్నుకుంటూ గింజుకుంది. అతను పిల్లను గట్టిగా పట్టుకుని త్వరత్వరగా నడిచాడు. ఆ పిల్ల కడుపు ఉబ్బేటట్లు ఏడుస్తోంది.

"ఏడవక. రేపు మీ అమ్మ వస్తుంది. తినడానికి నీకు మంచి మిఠాయి తెచ్చిపెట్టుతుంది. అమ్మ నీకు జ్ఞాపకం వుందికదూ!" అంటూ కూతుర్ని సముదాయించాడు గోల్డురూట్.

ఆ పిల్ల తల్లి షాంగాయ్ పట్నంలో ఒకరి యింట్లో దాదిగా పని చేస్తోంది. ఉద్యోగం మానివేసి వచ్చి భర్తతోపాటు పొలం పని చూసుకుంటానని గోల్డురూట్‌కి కొన్ని నెలల క్రిందట రాసిందామె. భూసంస్కరణల ఫలితంగా గోల్డురూట్‌కి కొంత భూమి ప్రాప్తించింది. భూమిమీద వచ్చే ఆదాయం చాలనందువల్ల అతని భార్య పట్నంలో ఉద్యోగంచేసి డబ్బు కూడబెట్టుతోంది. గోల్డురూట్ కుమార్తెతో అమ్మ రేపు వస్తుందని చెప్పాడేగాని ఉగాదిలోగా ఆమె వస్తుందని అతనికి నమ్మకం లేదు.

కూతురికి 'వా! ఛాయో!' అని పేరు పెట్టారా దంపతులు. ఆ పిల్లను 'తమ్ముడూ!' అని కూడా పిలుస్తారు. అలా పిలుస్తే యింకోసారి మొగపిల్లవాడు పుట్టుతాడని వాళ్ళ ఆశ. భార్య పరాయి వూళ్ళో వుండటం వల్ల ఆ ఆశ యింతవరకూ ఫలించలేదు.

తండ్రి చేతుల్లో ఆ పిల్ల ఏడుస్తూనే వుంది. "ఏడవకమ్మా! రేపు మీ అమ్మ వస్తుంది. తినడానికి నీకు మంచి మంచివి తెచ్చిపెడుతుంది." అంటూ గోల్డురూట్ కూతురిని ఓదారుస్తున్నాడు.

తండ్రి మాటలు ఆ పిల్ల నమ్మినట్లు లేదు. ఆ రోజు సాయంత్రం అత్తతో ఆ పిల్ల "అత్తా! అమ్మ ఎప్పుడు వస్తుంది? రేపు వస్తుందని నాన్న చెప్పాడు." అని అడగటం గోల్డురూట్ విన్నాడు.

రాత్రి భోజనమయ్యాక గుమ్మంలో నిలబడి అతను చుట్ట తాగుతున్నపుడు గోల్డుస్లవర్ "అవును. మీ అమ్మ వస్తుంది. ఆమె వొచ్చాక నన్ను మరిచిపోవు కదూ!" అని తన కూతురితో దిగులుగా అనడం విని భార్యకోసరం తను తపించిపోతున్నట్లు తన చెల్లెలు గ్రహించిందేమోనని సిగ్గుపడ్డాడు.

గోల్డ్ రూట్ వెళ్లి పడుకున్నాడు. అతని చెల్లెలి గదిలో యింకా దీపం వెలుగుతోనే వుంది.

"చెల్లీ! త్వరగా నిద్దరపో! రేపు మళ్లీ పది మైళ్ళు నడవాలి!" అని కేక వేశాడు గోల్డ్ రూట్.

"నువ్వింకా నిద్రపోలేదూ! వెనక్కి తిరిగి రావడానికి నువ్వు యిరవై మైళ్ళు నడవాలి తెలుసా!" అంది అతని చెల్లెలు.

చెల్లెలు పడుకునే గదిలో దీపం వెలుగుతూనే వుంది. గదిలో ఆమె అటూ యిటూ తిరుగుతున్న చప్పుడు విని గోల్డ్ రూట్ దిగాలుపడ్డాడు.

# రెండో ప్రకరణము

మర్నాడు వుదయం పెళ్లికూతుర్ని చూసేందుకు గోల్డురూట్ యింటికి జనం గుంపులు గుంపులుగా వొచ్చారు. గోల్డుస్లవర్ పెళ్లికూతురి దగ్గరలో కూర్చునుంది. ముసలి స్త్రీ ఒకామె తలదువ్వి ఆమెకు అలంకారం చేస్తోంది. కురులు పొట్టిగా కత్తిరించుకోవడం ఆ రోజుల్లో నాగరికతకు చిహ్నం కావడంవల్ల భుజాలవరకు పడుతున్న ఆమె జుట్టు దువ్వడం అట్టేసేపు పట్టలేదు. ముఖానికి పౌడరు, పెదిమలకు రంగు అదివరకే వేసుకుంది. ముసలావిడ వాటని కొంచెం సరిదిద్దింది. అంతే. కొడుకులనూ, మనమలనూ ఎత్తా

కున్న ముసలి అవ్వ పెళ్ళికూతుర్ని అలంకరించి, దీవించడం ఆచారం. పెళ్ళి కూతురి అత్తకు ఆ అర్హత లేదు. ఆవిడ ఒక్క కొడుకూ యుద్ధంలో మాయమైనాడు. అతన్ని శత్రుసేనలు ఎత్తుకు పోయాయి. తరవాత అతను ఏమైందీ అతీ గతీ లేదు.

అత్తవారి వూరు పదిమైళ్ళ దూరం ఉంది. వర్షం లేకుండా చూసు కుని పెళ్లికూతురు కాలినడక బయలుదేరింది. పెళ్లికూతురు వెళుతూ వుంటే ఆమె బంధువుల కుర్రాడొకడు పెద్దడప్పు వాయించుకుంటూ పెళ్లికూతురు రాక ప్రకటించాడు. ఆమె వెనకాల గోల్డురూట్ ఒక చేత్తో కూతురని ఎత్తుకుని, యింకో చేత్తో వెలిగించని లాంతరు పట్టుకుని నడుస్తున్నాడు. అతను తిరిగి వచ్చేటప్పటికి రాత్రవుతుంది. అందుకే లాంతరు తీసుకు వెళు తున్నాడతను. అన్న చేతులు పూరికే లేనందువల్ల పెళ్లికూతురే తన మూట మోస్తోంది. ఆమె తొడుక్కున్న గౌను పొడుగ్గా వుంది. గుడ్డ ముందంగా వుండడంవల్ల ఆమె బొద్దుగా కనిపిస్తోంది. గౌనుకు పువ్వొకటి రొమ్ము దగ్గర ఎర్రదారంతో కుట్టబడ్డది. కొరియా యుద్ధానికి సైన్యంలో చేర్చ బడే కొత్త సైనికులూ, కార్మిక వీరులూ యిటువంటి పువ్వులే ధరిస్తారు.

ఆ చిన్న ఊరేగింపు పల్లెలోంచి సాగిపోతూవుంటే ఆడవాళ్ళూ, పిల్లలూ "రండి! పెళ్ళికూతుర్ని చూద్దాం రండి!" అంటూ ఊరేగింపు వేపు పరిగెత్తారు. వూరేగింపు గుంపుగా చేరి వాళ్ళని సాగనంపింది. వాళ్ళ అత్త గుంపు ముందర నిలబడి పెళ్లికూతురిని దీవించింది. ఆమె తన భర్తతో తరవాత పెళ్లి విందుకు వెళ్లుతుంది.

"ఏడీ! మా ముసలాయన ఏడీ! పెళ్ళికూతుర్ని సాగనంపటానికి రానేలేదే!" అంటూ అత్త గుంపును కలయ చూసింది. ఆ ముసలాయన రోడ్డుపక్కన వున్న ఒక రాయిమీద కూర్చునున్నాడు. నోట్లో పైపు పెట్టుకుని, సూర్యుడి వెచ్చని కిరణాలవేపు తన వీపు తిప్పి, చిరునవ్వుతో తల వూయిస్తూ ఆయన వూరేగింపును చూస్తున్నాడు.

"మామా! విందుకు త్వరగా బయలుదేరిరా! మరిచి పోకేం!" అని గోల్డురూట్ కేక వేశాడు.

"ఆఁ వస్తాను. తప్పకుండా వస్తాను." అని ఆ ముసలాయన బదులు చెప్పాడు.

సన్నగా గీసిన గెడ్డం, నాజూకైన కోల ముఖం, బనీను పైన వేసుకున్న నీలిరంగు చొక్కా వీటివల్ల అతనిలో ఆడపోలికలు ఎక్కువగా కనిపిస్తాయి. కళ్ళ జబ్బువల్ల అతని నేత్రాలు తెల్లగా వున్నాయి. చూపు ఆనక తల అటూ యిటూ తిప్పుతున్నాడతను.

ముసలి మామ భార్యను వెంటబెట్టుకుని పొద్దు కూకకముందే చాస్ గ్రామం చేరుకున్నాడు. వాళ్ళ వెంబడి మనమలనూ, మనమరాండ్రనూ కూడా తీసుకువచ్చారు. వాళ్ళ కోడలు యింటి దగ్గరే వుండిపోయింది. అతిథులు విందు భోజనాలకు కూర్చున్నారు. మధ్య బల్లముందర వధువూ, వరుడూ ఒకరిపక్కన ఒకరు కూర్చున్నారు. ఎర్రటి పువ్వులు వాళ్ళ ఛాతీలమీద గుచ్చారు. అస్తమిస్తున్న సూర్యుడి కిరణాలు గదిలో పడుతున్నాయి. కిరణాల వెలుగులో పెళ్లికూతురు తెల్లగా, గులాబీ రంగులో మట్టిబొమ్మలా కనిపించింది. సామాన్య స్త్రీలా గాక, చెక్కిన బొమ్మలా వుందామె.

గోల్డురూట్ యింట్లో బల్లముందు కూర్చున్నాడు. కొత్తగా బంధుత్వం కలియడంవల్ల అతన్ని గౌరవ మర్యాదలతో సత్కరించారు. ముసలి అత్తా, ఆమె భర్తా మగో బల్ల ముందు కూర్చున్నారు. వాళ్లు వొద్దంటున్నా వాళ్లిద్దరినీ కూడా గౌరవస్థానాల్లోనే కూర్చోబెట్టారు. నలుగురు స్త్రీలు వడ్డన ప్రారంభించారు. బహుశా వాళ్లు ఆ యింటి కోడళ్లు అయివుంటారు. తన ముందు వున్న అన్నం పళ్లెంపైపు హుందాగా చూస్తూ ముసలాయన నెమ్మదిగా తింటున్నాడు.

వంటకాలు పెళ్లి భోజనాలకి వుండవలసినంత గొప్పగా లేకపోయినా, పెళ్లికొడుకు తల్లి మంచి నేర్పరి కనుక అందర్నీ కనుక్కుంటూ అతిథుల మధ్య హడావిడిగా తిరిగింది. ఆమె పాదాలు గుడ్డలతో బిగింపబడి వున్నాయి. ఆ ముసలావిడ చిన్న పిల్లలాగా వుత్సాహంతో సంచరించింది. ముసలాయన అట్టే ఏం తినకపోవడం చూసి ఆమె అతని పక్కన చేరి "వంట బాగుండలేదా? పెళ్లి పిండివంటలు చేయడం చేతకానందుకు సిగ్గుపడుతున్నా. పోనీ వుత్త అన్నమయినా కడుపునిండా తిను. ఖాళీ కడుపుతో యింటికి వెళ్ళకూడదు." అంది.

పందిమాంసం, వెనురు మొక్కలు వేసి చేసిన కూర బల్లమీద గిన్నెలో వుంది. గిన్నె తీసి మాంసం అతని పళ్లెంలో గుమ్మరించింది ముసలావిడ.

ముసలాయన తెల్లబోయి చూశాడు. అతను అదంతా ఎట్లా తినగలడు; కోపంతో లేచి నిలబడి "ఇదంతా నేను ఎట్లా తినగలను! అన్నంమీదంతా కూర బోర్లించావే! నేను యిదంతా తినగలనా?" అని అరిచాడు. తరవాత నెమ్మదిగా శాంతించి కూర అడుగున వున్న అన్నం తిన ప్రారంభించాడతను.

భోజనాలు సాగుతుండగా ఆ ఊరి పెద్ద వొచ్చాడు. అతని పేరు కామ్రేడ్ షై. బూరె బుగ్గలు-ఎర్రని దేహచ్ఛాయ. ముఖం గుండ్రంగానూ తీక్షణంగానూ వుంది. గోల్డురూట్ ఊళ్లో వుండే కామ్రేడ్ వోంగ్ లాగా యితనూ దుమ్ము కొట్టుకుపోయిన దుస్తులు వేసుకున్నాడు. కామ్రేడ్ వోంగ్‌ని అతని ఊళ్ళో అందరూ చాలా గౌరవిస్తారు. ప్రజాసేవలో నిమగ్నులై తమ విషయమూ, తమ దుస్తుల విషయమూ యీ కామ్రేడ్లు పట్టించుకోరని అందరూ అనుకోవాలి కాబోలు; అతని మెడపట్టీ చుట్టూ జిడ్డు మురికిగా కారుతోంది. నడుముకున్న పట్టీకి ఒక తువ్వాలా వేళ్లాడుతోంది. వెనకటి కమ్యూనిస్టు ప్రచారకుల మల్లే అతను ఆ తువ్వాలుతో ముఖంమీది చెమట తుడుచుకున్నాడు. అతన్ని చూస్తే యుద్ధంనాటి కాల్లోని జపాను సైనికుడు జ్ఞాపకం వొస్తాడు.

గోల్డురూట్ కూడా వాళ్ళలాగే నడుం పట్టీకి ఒక తువ్వాలు వెళ్లాడ వేసుకున్నాడు. అతని చొక్కాకింద తెల్లని తువ్వాలు అంచులు కనిపిస్తాయి. షాంగాయ్ పట్నంలో వున్న అతని భార్య ఆ తువ్వాలు భర్తకు పంపింది. దానిని ఎప్పుడూ బయటకు తీయకపోవడంవల్ల అది కొత్తగా, తెల్లగా వుంది. ఆ తువ్వాల మీద "శుభోదయం" అన్నమాట ఎర్ర పూలుతో అల్లబడ్డది.

కామ్రేడ్ షై రాగానే అందరూ గౌరవ సూచకంగా లేచి నిలబడి అతనికి దోవ యిచ్చారు. ఆయన ఎక్కడ కూర్చోవాలన్న విషయం మీద కొంత వాదన జరిగిన తరవాత చివరకి ముసలి అత్త యువతులకు జరిగి, ఆమె భర్త పక్కన ఆయనకు స్థలం యిచ్చింది. జన సమర్దం వల్ల గదిలో కలిగిన వేడివల్లా, సుష్టిగా తినడం వల్లా ద్రాక్షరసం తాగక పోయినా అతిథులంతా కొంచెం మత్తులో వున్నారు.

కామ్రేడ్ షై అందరినీ స్నేహ పూర్వకంగా పలకరించాడు. పంటలు బాగా పండాయా అనీ, ఎన్ని పుట్ల ధాన్యం పండిందనీ, ఎన్ని బళ్ల

గడ్డి సామి వేసుకున్నారనీ ఒక్కొక్కరినే అడిగాడతను. గోల్డురూట్ పొలం బాగా సాగుచేసి అందరికంటే ఎక్కువ పంట పండించినందుకు అతను ఆదర్శరైతుగా మన్నింపబడ్డాడు. అతని అత్త ఆ విషయం జ్ఞాపకం చేసుకుని చాలా గర్వించేది. ఆమె అతిథులందరినీ చాలా చనువుగా, కులాసాగా పలకరించింది. కామ్రేడ్ షైతో విందు భోజనానికి సంబంధించని విషయాలు, వెనకటి కమ్యూనిస్టు పార్టీ విషయాలు చాలా ఆమె మాట్లాడింది.

"ఇప్పుడంతా చక్కబడ్డది. బీదవాళ్లు బాగుపడ్డారు. ఇప్పటి స్థితి గతులు మునపటిలాగా అధోగతిలో లేవు. అధ్యక్షుడు మేయో పూనుకోకపోతే మనం యీ మంచిరోజులు చూసేవాళ్లమే కాము. కొమింటాంగ్ కమ్యూనిస్టులు వచ్చి మనల్ని వుద్ధరించి వుండకపోతే మనం యింకా ఎంత కాలం దరిద్రంలో బాధపడుతూ వుండేవాళ్లమో!" అందామె.

ఈ ముసలి అత్తకు కుంచం టాంగ్ కమ్యూనిస్టులకూ, కొమింటాంగ్ విప్లవకారులకూ ఉన్న భేదం తెలియక వారినీ వీరినీ కలగాపులగం చేసి మాట్లాడుతుంది. ముసలి అత్త చిన్నతనంలో కొమింటాంగ్ విప్లవకారులు మాంచూ రాజ్యాంగాన్ని కూలదోశారు. ముసలి అత్త అమాయకంగా కమ్యూనిస్టులనూ, కొమింటాంగ్ విప్లవకారులనూ కలిపి ఒకటిగా మాట్లాడుతుంది. ఈ కొమింటాంగ్ విప్లవకారులే ఫార్మోజా ద్వీపానికి తరమబడ్డ శేషనలిష్టులని ఆమెకు తెలియదు. ఆమె ఆ రోజుల్లో సరిగా అవగాహన చేసుకోకపోవడానికి ఆమె ముసలితనమే కారణం. మొత్తంమీద ఆమె అభ్యుదయ దృక్పథం గల ముసలావిడలాగే కామ్రేడ్ షైకి కనిపించింది.

"అందరినీ కనుక్కోవడంతోనే సరిపోయింది నీకు. నువ్వు యింత వరకూ ఏమీ తినలేదు. భోజనానికి కూర్చో" అంటూ పెళ్లికొడుకు తల్లిని ముసలిఅత్తబలవంతం పెట్టింది. గోల్డురూట్ కూతురిపళ్లెంనిండా పెళ్లికొడుకు తల్లి భోజన పదార్థాలను వడ్డించింది. అది చూసి "చూడు! నువ్వంటే యీ విడకు ఎంత యిష్టమో! ఈ రాత్రికి నువ్వు యిక్కడే ఉండు. మీ అత్త యిక్కడే ఉంటుంది. అత్త పెళ్లికూడదనీ అత్తదగ్గరే ఉంటాననీ నిన్న ఏడ్చావు కదూ!" అంది ముసలామె ఆ పిల్లలతో.

ఆపిల్ల అటూయిటూ చూడకుండా భోజనం చేస్తోంది.

"మేము నిన్ను యిక్కడే వదిలిపెట్టి వెళ్ళిపోతాము. మీ నాన్నతో నువ్వు యింటికి రావడంలేదు తెలుసా! కడుపునిండా తిని మూతి తుడుచుకుని వెళ్ళిపోవడం కాదు. నిన్ను వీళ్ళకు అమ్మేశాం" అని ఆ పిల్లను బెదిరించ చూసింది ముసలి అత్త.

ఆ మాటలకి అందరూ నవ్వారు. పెళ్లికొడుకు తల్లి "అవును. నువ్వు యిక్కడే ఉండిపోవాలి. మీ యింటికి వెళ్ళడానికి వీలులేదు." అంది.

ఆ పిల్ల మాట్లాడకుండా ఊరుకుంది. తనను అక్కడే వదిలి వెళ్లిపోతారేమోనని భయపడ్డట్లు పైకి కనిపించలేదు గాని భోజనం ముగియగానే తండ్రి దగ్గరకు వెళ్లి అతని వెంట వెంటనే తిరగడం ప్రారంభించింది.

విందు అయిన తరవాత పెళ్లికుమారుడు, పెళ్లికుమార్తె శోభనపు గదిలోకి వెళ్లారు. అసలు వేడుకలు అప్పుడు ప్రారంభమయినాయి. బంధువులంతా శోభనపుగదిలో గుమికూడి పెళ్లికుమార్తెను ఎగతాళి చేశారు. వెనకటి రోజుల్లో తమ కుటుంబంలోకి వచ్చిన కొత్తకోడల్ని ఎగతాళిచేస్తూ, మామలూ, తాతలూ శోభనం గది ప్రవేశించి బంధు మర్యాదలు అతిక్రమించి అల్లరిచేసేవారు. అంతులేని ఆ వేడుకలు ఆర్భాటంగా ఉండేవి. 'పెద్దా పిన్నా అనే తారతమ్యం లేని మూడురోజుల ముచ్చట' అన్న సామెత అక్షరాలా నిజమనిపించేది. నాలుగో రోజున అందరూ మామూలుగా ఎవరి అంతస్థులో వారు మర్యాదగా ఉండేవారు.

ఆ రోజున ఊరిపెద్ద తమ మధ్య ఉండడంవల్ల బంధువులు అల్లరిచిల్లరిగా ప్రవర్తించడానికి సంకోచించారు. కాని కామ్రేడ్ స్త్రై వేడుకలు యథాతథంగా జరగాలన్న ఉద్దేశంతో తనే ముందుగా వేడుకలు ప్రారంభించాడు. మిగతా బంధువులందరికీ ఉత్సాహం కలిగి అతన్ని అనుసరించారు.

"పెళ్లికొడుకూ, పెళ్లికూతురూ ఒకరి చెయ్యి ఒకరు పట్టుకోవాలి." అని ఒకరు కేకపెట్టారు. ముసలి అత్త పెళ్లికూతుర్ని వెనకేసుకొచ్చింది. బంధువులలో వాగ్వివాదాలు పెచ్చుపెరిగాయి. చివరకు వరుడూ, వధువూ చేతులు పట్టుకోక తప్పదని నిశ్చయించారు. కాని వాళ్లు కదల లేదు. అది చూసి ముసలి అత్త ముందుకు వచ్చి వాళ్ళ చేతులను కలిపింది.

అంతలో ఒకరు "పెళ్లికూతురు పెళ్లికొడుకు వొళ్ళో కూర్చుని పెద్ద అన్నయ్యా అని పిలవాలి" అని అన్నారు.

అందరూ "అవును. అవును. తప్పదు." అని అరిచారు. పెళ్లికొడుకు గదిలోంచి పారిపోవడానికి ప్రయత్నించాడు. నలుగురూ అతన్ని పట్టుకు లాక్కొచ్చి పెళ్లికూతురి పక్కన మంచంమీద కూర్చోబెట్టారు. బంధువు లంతా చాలా సేపు ఆ విషయం మాట్లాడుకున్నారు.

"చూడండి! పెళ్లికూతురు నా వేపు చూడనైనా చూడటం లేదు" అన్నాడు ఒక ముఖ్యబంధువు.

"కోప్పడకు మామా! పెళ్లికూతురి చేత నీకు ఒక కప్పు టీ యిప్పిస్తాంలే" అంది ముసలి అత్త.

"టీ ఎవరికి కావాలి!" అన్నాడతను.

పెళ్లికూతురు మూతి ముడుచుకుని మెదలకుండా ఊరుకుంది. రాజీ కింద పెళ్లికూతురు ఒక పాట పాడాలని కామ్రేడ్ షై అనడంతో మళ్లీ సంచలనం ఏర్పడింది.

"అవును. అవును. పాడాలి" అని అందరూ అరిచారు.

ముసలి అత్త "ఒక్కటే ఒక పాట పాడుతుంది. అంతకన్నా పాడదు." అని చెప్పి పెళ్లికూతుర్ని సమాధానపరిచింది.

గోల్డ్‌ఫవర్ గోడవేపు తిరిగి బల్లదగ్గిర నిలబడి ఆంగ్ల సైనికులు సైనిక విన్యాసాలు చేసేటప్పుడు పాడే "పాలూ" అనే ప్రసిద్ధికెక్కిన పాట పాడింది. కమ్యూనిస్టు సైనికులకు యీ పాట అంటే అమితమైన అభిమానం.

కామ్రేడ్ షై చప్పట్లు కొట్టుతూ "ఇంకో పాట! ఇంకో పాట పాడాలి." అన్నాడు.

బంధువులందరూ అతన్ని బలపరిచారు.

"సరే! ఇంకొకటి పాడుతుంది. మళ్ళీ అడగకూడదు. పెళ్లికూతురికి విశ్రాంతి యివ్వాలి. అదీగాక యిప్పటికే ఆలస్యమైంది. మనం యిళ్లకు వెళ్లవద్దూ!" అంది ముసలి అత్త.

అతిథులు ఏమీ బదులు చెప్పలేదు. చివరికి పెళ్లికూతురు తను ఇటీవల వింటర్ స్కూల్లో నేర్చుకున్న పాట ఒకటి పాడింది.

"హీం ల ల లా
హీం ల ల లా
ఆకాశంలో ఎర్రని మబ్బులు
మనదేశంలో ఎర్రని పువ్వులు."

కార్మేడ్ షై వచ్చి ఆమె చేతిదండ పట్టుకుని జనంవేపు తిరిగి పాడమన్నాడు.

ఆమె అతనిపట్టు వదిలించుకునేందుకు పక్కకు ఒక గెంతేసింది గాని అతను ఆమెను మళ్ళీ పట్టుకుని పెద్దగా నవ్వాడు. ఆమె అతని పట్టు విడిపించుకునే ప్రయత్నంలో అతన్ని బల్లమీదకు తోసింది. బల్లమీద ఉన్న టీ కప్పు కిందపడి ముక్కలయి పోయింది.

“పింగాణి పగిలింది. ప్రతి సంవత్సరమూ సుఖప్రదంగానూ, మనోజ్ఞంగానూ వుండాలి” అంది ముసలి అత్త పగిలిపోయిందన్న శబ్దం ఒత్తి పలుకుతూ.

కార్మేడ్ షై ఏమనడానికీ తోచక నిలబడ్డాడు. అతనికి కోపం రాకుండా ముసలి అత్త “పెళ్ళికూతురు ఎందుకంత కోపంగా వుంది! ఇదంతా వేడుకేకదూ! పెళ్ళిరోజున బంధువులు ఎంత అల్లరిచేస్తే పెళ్ళి కూతురికి అంత అదృష్టం పట్టుతుందంటారు. కార్మేడ్ షై నీలాటివాడు కాదు కనుక సరిపోయింది. లేకపోతే నువ్వు చేసినపనికి అతనికి చాలా కోపమొచ్చేది.” అంది.

పెళ్ళికొడుకు తల్లివేపు తిరిగి “అక్కా! కోపం తెచ్చుకోక. మా పిల్లకు తల్లి తండ్రులు చిన్నప్పుడే పోయారు. నలుగురిలో సభ్యతగా ఉండడం దానికి ఎవరూ నేర్పలేదు. ఇకనించి మా పిల్లను సరైన దారిలో పెట్టడం నీవంతు. ఈసారికి పోనియ్యి. నా మాట విను. దయావుంచి కోప్పడక. కార్మేడ్ షైలాగా నువ్వూ క్షమించి ఊరుకో” అంది ముసలి అత్త.

తలమీద టోపీ సర్దుకుంటూ “పెళ్ళికూతురు కోపధారి. పెళ్ళికొడుకు జాగ్రత పడకపోతే జుట్టుపట్టి లొంగదీస్తుంది” అంటూ నవ్వాడు షై.

అంతటితో అందరూ ఆ విషయం వదిలిపెట్టారు కాని పెళ్ళికొడుకు తల్లి ముఖంలో కోపం కనిపిస్తోంది. అతిథులముందు తన కుటుంబాన్ని పెళ్ళికూతురు చిన్నబుచ్చింది. బాహాటంగా పెళ్ళికూతుర్ని నిందించక పోయినా యీ అల్లరికి ఆమే కారకురాలు గనక గ్రామపెద్ద ఈ కోపం మనస్సులో పెట్టుకుని ముందెప్పుడైనా తనకు హాని చెయ్యవచ్చు అనుకుంది. పెళ్ళికూతురు యింటికి వచ్చిన మొదటిరోజు కావడంవల్ల ఆమె అత్త ఏమీ అనకుండా ఊరుకుంది. కాని మొత్తానికి పరిస్థితి కొంచెం విరసంగానే కనిపించింది.

పెళ్లి వాళ్ళంతా ఎవరి యిళ్లకు వాళ్లు వెళ్లిపోయారు. కూతురిని ఎత్తుకుని గోల్డ్‌రూట్, మనమలను వెంటబెట్టుకుని ముసలి అత్తా, ముసలి మామా యింటికి బయలుదేరారు. వెన్నెల కాస్తూ వుండటంవల్ల లాంతరు వెలిగించవలసిన అవసరం లేకపోయింది. చాగ్రామం దాటి, ఊరికి దూరంగా ఉన్న పొలాల్లో వాళ్లు నిశ్శబ్దంగా నడిచి పోతున్నప్పుడు మామతో గోల్డ్‌రూట్ "క్రామేడ్ షై మంచివాడు కాదు మామా!" అన్నాడు.

"అవును. మనుషులంతా మంచివాళ్లుగా వుంటారా! మంచివాళ్లూ ఉంటారు, చెడ్డవాళ్లూ వుంటారు." అన్నాడు మామ నిట్టూరుస్తూ.

"అతను ఒంటరిగాడు. ఇల్లూ వాకిలీ లేవు. గోల్డ్‌స్మిత్ గారు మంచి సమర్థులు. కొంచెం ముక్కోపిగా కనబడుతుంది. అంతే." అంది ముసలి అత్త.

"ముక్కోపి అయితే మునిగిపోయిందేమీ లేదు. మహిళా సంఘాలు ఉన్నాయిగా యీ రోజుల్లో" అన్నాడు గోల్డ్‌రూట్.

"అవును, మహిళా సంఘాలున్నాయిగా! అదీగాక కోడళ్ళ సంఘం కూడా ఒకటి పెట్టబోతున్నారని విన్నాను. ఈ రోజుల్లో కోడండ్రికం పెట్టడం అంత సులభం కాదు" అంది అత్త తనూ ఒక అత్తననే విషయం మరిచిపోయి.

"గ్రామ నాయకుడైన క్రామేడ్ షై చేతిలో వుంటుంది ఈ సంఘాల భవిష్యత్తంతా" అన్నాడు గోల్డ్‌రూట్ ఆలోచిస్తూ.

ముసలి వాళ్లిద్దరూ ఏమీ జవాబు చెప్పలేదు. పీచ్‌గ్రీన్ గ్రామంలో ఒకామె తనను అత్త మామలు పెడుతున్న బాధలు సహించలేక భర్త నుండి విడాకులు కోరడం వాళ్ళకు జ్ఞాపకం వచ్చింది. పూర్వాచార పరుడైన ఆ ఊరి పెద్ద కొత్తగా అమలులోకి వచ్చిన వివాహ చట్టం లెఖ్ఖ పెట్టకుండా ఆ స్త్రీని చెట్టుకు కట్టి కర్రతో కొట్టాడుట. కమ్యూనిస్టులు అధికారంలోకి వస్తే ఒక భార్యకు ఒక భర్త అంటూ వుండదనీ, నీతి నియమాలంటూ ఏమీ ఉండవనీ, విడాకులకు అంతంటూ ఉండదనీ ప్రజలను బయపెట్టుతూ వెనకటి పరిపాలకులు చేసిన ప్రచారంవల్ల ప్రజలు భయభ్రాంతులైనారు. అందువల్ల ఊరిపెద్ద నీతి నియమాలను కాపాడేందుకు తీసుకున్న తీవ్రచర్యను ఆ ఊరి ప్రజలు ఆమోదించి ఊరుకున్నారు.

విడాకులు కోరడం మంచిది కాకపోవచ్చు. కాని ఊరి పెద్ద ఆ స్త్రీని యింటికి పంపివేసిన తరవాత ఆమెను కట్టివేసి ఆమె అత్త మామలు ఒకరి తరవాత ఒకరు గొడ్డును బాదినట్లు మూడు కర్రలు విరిగిపోయే వరకూ బాదడం మాత్రం అన్యాయమని అన్నారు ఆ ఊరి ప్రజంతా. కొట్టవలసి వస్తే ఒక్క కర్ర విరిగేవరకూ కొట్టితే చాలునని వాళ్ల అభిప్రాయము.

వెన్నెల రాత్రిలో వాళ్లు నడుస్తూ పోతుండగా ఒక పిల్లవాడు కాలు జారి గట్టుమీదనించి పడ్డాడు. ముసలివాళ్లిద్దరూ ఆ పిల్లవాణ్ణి లేవదీసి కాలుకు కట్టు కడుతూండగా గోల్డురూట్ ముందుకు నడిచి వెళ్లిపోయాడు. జేకన్ అతని భుజంమీద నిద్రపోయింది. ఆకాశంమీద మబ్బులు లేవు. చంద్రుడు నిర్మలంగా ప్రకాశిస్తున్నాడు. ఎటు చూసినా నీలాకాశం పరుచుకునుంది. ఆ వెన్నెలా, ఆ ఆకాశం, ఆ చల్లనిగాలీ, మంచూ గోల్డు రూటుకు ఒంటరితనం జ్ఞాపకం చేశాయి. అతను కలత చెందాడు. దోవ వంకరలు తిరిగి కనపడీ కనపడకుండా ఉంది. గట్టు పక్కన పొలాల్లో పాతిపెట్టబడని శవపేటికలపైన నిర్మించబడిన పూరిపాకలు కనబడు తున్నాయి. చచ్చిపోయిన తమ బంధువులను శవపేటికలలో పెట్టి భూస్థాపితం చేసేందుకు శక్తిలేని బీదవాళ్లు, తెల్లటి గోడలు, నల్లటి పెంకుల కప్పులుగల చిన్న చిన్న యిళ్ళను నిర్మించారు. పొలాల్లో బొమ్మరిళ్లకంటే కొంచెం పెద్దవిగా ఉన్న ఆ చిన్న యిళ్లు కుక్కలకోసం కట్టబడే యిళ్లలాగున్నాయి.

ఇంకా సగందూరం వెళ్లకముందే తిన్న అన్నం అరిగిపోయి గోల్డు రూటుకి ఆకలెయ్యడం మొదలు పెట్టింది. కడుపు ఖాళీగా ఉండీ, దేహం తేలికపడటంవల్ల అప్పుడతనికి భూప్రదక్షిణం చేయగల శక్తి వచ్చి నట్లనిపించింది. సంవత్సరం పొడుగునా కష్టించి, సంపాదించి ఎప్పటి కప్పుడు నింపుతున్నా ఎప్పుడూ ఖాళీగా వుండే పొట్ట అడుగులేని బావి లాగుందనిపించిం దతనికి.

ఉన్నట్టుండి అతని కుమార్తె జేకను "ఇంటికొచ్చామా నాన్నా ?" అని అడిగింది.

చీకటిగాను, నిశ్శబ్దంగాను వున్న యింటిని అతను సమీపిస్తున్నప్పుడు భార్యలేని కొరత బాగా తెలిసివచ్చిందతనికి. పాత యింట్లో తన చెల్లె లిని సరసాలాడి ఏడిపించడం తన పెళ్లిలో తన భార్యను బంధువులు ఎట్లా

సరసాలాడి తిప్పలు పెట్టారో జ్ఞాపకం చేసింది. ఆ రోజున అతిథులు మామూలుకంటే యెక్కువగా తన భార్యను వేధించారు. తన భార్య చాలా అందకత్తె కావడంవల్ల వాళ్లు అట్లా చేసి ఉండవొచ్చు. గది తలుపు బిగించి అందరూ వెళ్లిపోయిన తరవాత కూడా కొందరు కిటికీలకు చెవు లానించి తాము ఏమి మాట్లాడుకుంటున్నదీ వినడమూ, టపాకాయలు పేల్చి తమను భయపెట్టచూడడం అతనికి జ్ఞాపకం వచ్చాయి.

ఆ చుట్టుపక్కల వున్న స్త్రీలందరిలోకి తన భార్య అందగత్తె అని అందరూ అనేవారు. షాంగాయ్ పట్నంలో యింత కాలం ఆమె ఒంటిగా ఉండడం తన కాదుద్దాగా వున్నదనికూడా వాళ్లు అనుకుంటూ ఉండ వొచ్చు. పట్నాల్లో పనిచేస్తున్న స్త్రీలు చాలామంది భర్తలకు డబ్బిచ్చి వాళ్ళనుండి విడాకులు పుచ్చుకోడం జరుగుతోంది. తన భార్య కూడా అలా చేస్తుందేమోనన్న ఆలోచన అతనికెప్పుడూ రాలేదు. ఆమెలో అతనికున్న విశ్వాసంవల్లో, ఆ విషయం తలుచుకుంటేనే అతనికి భయం కలగడంవల్లో అతనా ఆలోచనే మనస్సులోకి రానిచ్చేవాడు కాదు.

కాని అతనికి తెలియకుండానే అతన్ని ఏదో భయం బాధిస్తోంది కాబోలు! భార్య వస్తున్నానని వ్రాసినా అతనికి ఆమె వస్తుందని పూర్తి నమ్మకం కుదరలేదు. ఆమె వెళ్లిపోయినప్పటినుండీ, ఆమెను పంపినందుకు తనమీద తనకే అసహ్యమేసేది. ఆమె సంపాదించే కొంచెం డబ్బుకోసం ఆమెనించి ఎడబాటు కావడానికి అతను ఒప్పుకున్నాడు. రాత్రిళ్లు నిద్ర పట్టనపుడు తన భార్యకూడా ఎడబాటు కలిగినందుకు తనను ఎంత తిట్టు కుంటోందోననీ, మళ్ళీ తామిద్దరూ కలిసి ఉండడం సంభవించినా మునపటి లాగు అన్యోన్యంగా ఉండలేమనీ అనుకునేవాడతను.

భార్యను గురించిన ఆలోచన అతని హృదయంలో ఆవేదన కలి గించింది. గాలికి ఆరిపోకుండా చేతులు అడ్డంపెట్టగా అగ్గిపుల్ల చేతులనే కాల్చినట్లు, హృదయంలో రగిలిన ఆవేదన అతని హృదయాన్నే కాల్చి వేసింది. ఆఖరిసారి తను ఆమెను ఎప్పుడు చూసిందీ కూడా జ్ఞాపకం చేసుకునే ధైర్యం లేదతనికి. సిపాయీలు విచ్చలవిడిగా తిరుగుతూ కనపడ్డ యువకుణ్ణల్లా యుద్ధంలో చేరుస్తున్న రోజులవి. ఆ రోజుల్లో యువకులు పల్లెలలో సురక్షితంగా వుండే అవకాశం ఉండేది కాదు. అందుకే అతను ఏదైనా పనిసంపాదించుకునే ఉద్దేశంతో షాంగాయ్ పట్నం వెళ్లి అతని

భార్యను కలుసుకున్నాడు. అంతకు ముందెన్నడూ అతను పట్నం వెళ్ళ లేదు. కొండలలాగు ఎత్తుగా ఉన్న భవనాలు, సింహగర్జన చేసుకుంటూ పరిగెత్తే మోటారుబండ్లు చూస్తే అతనికి అంతా అయోమయంగాను, భయభయంగాను ఉంది. అందరూ తనను చూసి యికిలిస్తున్నట్లూ, ఎక్కిరిస్తున్నట్లూ అనిపించిందతనికి. చాలీ చాలని తన దుస్తులూ, బోడి తలా తలుచుకుని సిగ్గుపడ్డాడు. ఒక సందులో కావలివాడి పనిలో వున్న ఒక బంధువు యింట్లో అతను బసచేశాడు. సాయంకాలం వెళ్ళి తన భార్య మూన్ సెంటును కలుసుకున్నాడతను. యజమానుల యింట్లో ఆమె ఏదో పనితొందరలో వుంది. సమయం చూసుకుని వంటింట్లోకి వచ్చి జిడ్డోడుతున్న బల్లకు రెండోవైపున తనకెదురుగా ఆమె కూర్చున్నది. ఆమె తమ ఊరిలో వాళ్ళందరి క్షేమసమాచారాలూ, ఆ చుట్టుపక్కలనున్న చుట్టాల బాగోగులూ అడిగింది. కొంచెంగా నవ్వుతూ, పైకి చూస్తూ, ముందుకు వంగి, కాళ్ళూ చేతులూ ఎడంగా పెట్టుకుని ఆమె ప్రశ్నలకు అతను జవాబులు చెప్పాడు. ఏమీ మాట్లాడకుండా కూర్చుంటే చూసేవాళ్ళకు విడ్డూరంగా కనపడుతుంది కనుక అవీ యివీ ఏవేవో మాట్లాడారు వాళ్లిద్దరూ. అతనిది అన్నే మాట్లాడే స్వభావం కాదసలు. ఆ గంట మాట్లాడినంతగా తను ఎప్పుడూ మాట్లాడ లేదనిపించిందతనికి.

వంటింటి నేల సిమెంటుతో గచ్చుచేయబడ్డది. ఆ గది తలుపు వీధ లోకి తెరుచుకుంటుంది. అతను షాంగాయ్ పట్నంలో ఉన్నంతసేపూ వాన కురుస్తోనే ఉంది. నీళ్లు కారుతున్న అతని గొడుగును తెరిచి మూన్ సెంటు ఎర్రని రంగు వేసిన తలుపులకు పైనవున్న కడ్డీకి తగిలించింది. అస్తమిస్తున్న సూర్యుడి కాంతి ఆ గొడుగుకువున్న నారింజరంగు గుడ్డపైన పడటంవల్ల చీకటిగా వున్న ఆ గదిలో గొడుగు ప్రకాశవంతంగానూ, పెద్దదిగానూ కనపడ్డది. మధ్య మధ్య వంటింట్లోకి వచ్చిపోయే పనివాళ్ళను చూసి మూన్ సెంటు దీనంగానూ, ఆప్యాయంగానూ నవ్వింది. ఆమె అప్పుడప్పుడు లేచి గొడుగును దోవకు అడ్డం లేకుండా చేసింది. వాకిలి తలుపు ఎప్పుడూ తాళం వేయబడి వుండడంవల్ల అందరూ యింటికి వెనక భాగంలో వున్న తలుపునే వాడేవారు. ఆ సందులో ఉన్న అన్ని యిళ్ళల్లోనూ యింతేనని చెప్పింది మూన్ సెంటు. ఒంటినిండా మెరిసిపోతున్న నగలు పెట్టుకుని, తళతళలాడే పట్టుగౌనులు తొడుగుకుని, ఎత్తు మడమల

బంగారు రంగు చెప్పులు వేసుకొని పార్టీలకు వెళ్ళే స్త్రీలు ఆ చీకటి వంటింటి ముందునించే నడిచివెళ్ళేవాళ్ళు. చేతులలో పిల్లలను ఎత్తుకుని దాదులు ఆ సందులోనే అటూ యిటూ తిరిగేవారు.

అక్కడ ఉన్న రోజుల్లో గోల్డురూట్ తరుచూ ఆ వంటింటిలోనే భోజనం చేసేవాడు. ఒకొక్కప్పుడు అతను భోజనానికి ఆలస్యంగా వచ్చినపుడు మూన్ సెంటు ధైర్యంగా పెనంలో నూనె పోసి చల్లారిన అన్నం వేయించి అతనికి పెట్టేది. తన యజమానురాలు ప్రతిరోజూ బియ్యమూ, బొగ్గులూ ఎంత తరిగిపోయిందీ తనిఖీచేస్తున్న విషయమూ, అవి మాయమైపోతున్నవని ఆమె అంటున్న సంగతీ మూన్ సెంటు భర్తకి చెప్పలేదు. దాదుల బంధువులొచ్చి వంటింట్లో కూర్చుని తినిపోవడం యజమానులకు ఎప్పుడూ సరిపడదు. ఆ వొచ్చేది దాదుల భర్తలయితే యజమానులకు మరీ కోపం వస్తుంది. ఒకదాది తన భర్తతో ఓ రాత్రి హోటలులో వుండడం చెప్పుకుని ఆ యింట్లో అందరూ నవ్వడం మూన్ సెంట్ కు బాగా జ్ఞాపకముంది.

ఈ విషయాలేవీ మూన్ సెంటు ఆమె భర్తకు చెప్పలేదు. అయినా తను రావడంవల్ల ఆమెకు యిబ్బంది కలుగుతోందనీ, ఆమె తనకోసం అవస్థ పడుతోందనీ గోల్డురూట్ గ్రహించక పోలేదు. ఒక పక్షం రోజులు గడిచినా అతనికి ఎక్కడా పని దొరకనందువల్ల తిరిగి యింటికి వెళ్ళి పోదలిచాడు గోల్డురూట్. అతని భార్య యిచ్చిన డబ్బుతో రైలు టిక్కెట్టు కొనుక్కోవడానికి వెళ్ళాడతను. తను వృధాగా పట్నం వొచ్చాడు. తన భార్య కష్టపడి దాచుకున్న డబ్బు ఖర్చుపెట్టించాడు. ఆ విసుగుతో మిగిలిన చిల్లరకు ఒక సిగిరెట్టు పెట్టె కొనుక్కున్నాడతను.

రైలుకు వెళ్ళేముందర భార్యతో చెప్పడానికి వెళ్ళాడు గోల్డ్ రూట్. ఆ రోజు ఆ యింటికి భోజనాలకు అతిధులు రాబోతున్నారు. మూన్ సెంటు బాతు కాళ్ళతో పులుసు తయారుచేస్తోంది. గోల్డ్ రూట్ వెళ్ళేటప్పటికి ఆమె ఒక పాత పళ్ళసుంచితో పొడుగాటి వేస్తూ, నారింజ రంగులో వున్న బాతు కాళ్ళను శుభ్రం చేస్తోంది. చేతిలో మూట బల్లమీద పెట్టి సిగరెట్ వెలిగించి కూర్చున్నాడు గోల్డ్ రూట్. పదిహేను రోజుల్లోనూ అన్ని సంగతులూ మాట్లాడేశారు వాళ్ళు. ఇప్పుడు మాట్లాడేందుకు కొత్త

విషయాలేవీ కనపడలేదు. మురికినీటి కుండుదగ్గర ఒక చెత్త డబ్బాలో ఏదో గిలగిల కొట్టుకుంటున్న చప్పుడు వినిపించిందతనికి.

"ఏమిటది !" అడిగాడతను.

"కూర వండడానికి సిద్ధంగా ఉంచబడిన కోడిపెట్ట అది. దాని రెండు కాళ్లూ తాడుతో కట్టివెయ్యబడ్డాయి." అంది మూన్ సెంటు.

రైలు రావడానికి యింకా చాలా వ్యవధి వుంది. ఈలోపల గోల్డ్ రూట్ చెయ్యవలసిన పనేమీ లేదు. అక్కడే కూర్చుని కొంతకాలం గడపాలి. మాట్లాడడానికి విషయాలేమీ లేనందువల్ల మూన్ సెంట్ అందరినీ అడిగానని చెప్పమంటూ చెప్పిన పేర్లే మళ్లీ మళ్లీ చెప్పింది. బాతుకాళ్లు శుభ్రం చేయడం పూర్తయినాక బీన్సు కాయలు వొలవడం మొదలు పెట్టిందామె. పరధ్యాన్నంగా గింజలన్నీ కింద పారేసి, తొక్కలన్నీ గిన్నెలో వేస్తూ ఉండడం తెలుసుకుని సిగ్గుపడి కిందకువంగి త్వర త్వరగా గింజలన్నీ ఏరింది. ఆ చుట్టు పక్కల ఎవరూ లేకపోవడం అదృష్టం. గోల్డ్ రూటు కూడా అది చూడలేదు.

బీన్సు కాయలన్నీ వలిచి, కూర తరిగి, నేల ఊడ్చి చెత్తను నీళ్లకుండు దగ్గరవున్న డబ్బాలో పారబోసిందామె. అక్కడవున్న కోడి భయపడి గిలగిల్లాడింది.

గోల్డ్ రూటు వెళ్లిపోవడానికి బయలుదేరాడు. అతని భార్య చేతులు గుడ్డలకు తుడుచుకుంటూ, అర్థంలేని చిరునవ్వు నవ్వుతూ అతనిని సాగనంపింది. బయట వాన కురుస్తోంది. గొడుగు తెరిచి నెమ్మదిగా సిమెంటు బాటమీద నడవసాగాడు గోల్డ్ రూటు. అతను చాలా దిగులుగా ఉన్నాడు. పట్నం ఎందుకొచ్చానా అనుకున్నాడు.

# మూడో ప్రకరణము

గోల్డురూట్ కూతురిని పక్కమీద పడుకోబెట్టే ముందు ఊచ్చి పోయించి మరీ పడుకోబెట్టాడు. చెల్లెలు అత్తగారింటికి వెళ్లిపోవడంవల్ల కూతురి సంరక్షణ గోల్డురూట్ పాలబడ్డది. ఇంతకు ముందతనికి ఆ గొడవ తెలియదు.

బయట ముక్కలు బించుకు పోయేట్లు చలిగాలి వీస్తోంది. చంద్ర కిరణాలతో ఆకాశం తెల్లగా, కాంతిగా వుంది. దూరాన ఉన్న కొండ నల్లని మొగ్గిలా కనిపిస్తోం దా వెలుగులో. గోల్డురూట్ కూతురిని చేతుల మీద పడుకోబెట్టుకుని ఊపుతూ జోకొడుతున్నాడు. ఆ పిల్ల నిద్రపోలేదు. నిద్రపొమ్మని కూతుర్ని బుజ్జగించాడతను. కింద పడుకుని తనంటట తను నిద్ర పోయే వయస్సుంది ఆ పిల్లకు. కాని కింద పడుకుంటే జలుబు చేస్తుందని గోల్డురూట్ భయము.

బయట కుక్కలు ఒకటే మొరుగుతున్నాయి. కుక్కల అరుపులు వినపడ్డప్పుడల్లా తన భార్య వస్తూందేమోనని గోల్డురూట్ ఆశపడేవాడు. కూతురిని చేతుల్లో ఊపుతూ రోడ్డువేపు చూశాడతను. రోడ్డు మలుపులో ఎర్రని దీపం ఊగుతూ వుండడం అతనికి కనిపించింది. ఆ లాంతరుమీద ఎర్రగా ప్రకాశిస్తున్న అక్షరాలు అతనికి బాగా జ్ఞాపకమున్నాయి. అది "చా" అనే మాట. చా పల్లెనుండి ఎవరో వస్తున్నారని అతను గ్రహించాడు. ఇటీవలే పుట్టింటికి వచ్చి వెళ్లింది గనుక ఆ వచ్చేది తన చెల్లెలు అయి ఉండదు. అదీగాక తన చెల్లెలు అంతరాత్రి వేళ రాదు.

లాంతరు వెలుతురులో వస్తున్నది ఒక స్త్రీ అని గ్రహించాడు గోల్డురూట్. ఆమె చేతిలో తెల్లని గుడ్డలమూట కూడా ఉంది. దీపం వెలుతురు ఆ వచ్చే స్త్రీ ముఖంమీద పడ్డప్పుడు అతను ఆమెను గుర్తుపట్టి చప్పున ఆ వచ్చేమనిషి వేపు తిరిగాడు. చేతులలో వున్న కూతురు పోసిన ఉచ్చ అతని పాదాలమీద పడ్డది. ఆ పిల్లను కింద పడుకోబెట్టి దీపం వెలుగులో కనబడుతున్న తన భార్యవైపు ఒక పరుగు తీశాడతను.

ఆమె ముఖం బాగా స్పష్టంగా కనబడగానే పరిగెత్తడం మాని నెమ్మదిగా నడిచాడు. భర్తని దూరాన్నించే గుర్తుపట్టి ఆమె నవ్వింది. "చాపల్లెనించి ఎవరో వస్తున్నారను కున్నాను" అన్నాడతను పట్టలేని సంతోషంతో.

"నేను చాపల్లెదగ్గరకు వచ్చేటప్పటికి పొద్దు గూకింది. వదిన ఇంటికి వెళ్లి లాంతరు అడిగాను" అంది మూన్ సెంట్.

"అయితే నువ్వు వాళ్లయింటికి వెళ్లి మా చెల్లెల్ని చూశావన్న మాట."

"అం చూశాను. ఆవిడ అత్తగారు చాలా మర్యాద చేసింది. భోజనం చేస్తేగాని వెళ్ళడానికి వీలులేదని బలవంత పెట్టింది. నాకు చెప్ప సిగ్గేసింది" అంది మూన్ సెంటు.

గోల్డురూటు భార్యపక్కనే నడుస్తున్నాడు. అతను తొడుక్కున్న మేజోళ్ళొకటి తడిసి మంచుగడ్డలాగా అతని పాదానికి తగులుతోంది. లేకపోతే భార్య వచ్చినట్లు కలగంటున్నానేమో అనుకునే వాడతను.

"మా బావనుకూడా చూశావా?"

"ఆయనకు వంట్లో బాగాలేదు. గదిలో పడుకున్నారు. నేను గదిలోకి వెళ్ళలేదు."

"పెద్ద జబ్బేం కాదు గదా? మా చెల్లెలు ఎట్లా ఉంది?"

"కులాసాగానే ఉంది."

భర్త తన సంగతి అడక్కుండా అతని చెల్లెలు సంగతి అడగటం ఆమెకు తప్పుగా తోచలేదు. భర్త నైజం ఆమెకు బాగా తెలుసు.

"బేకన్ పడుకుందా?" అని అడిగింది మూన్ సెంటు.

"అది చాలా మొండిదైంది. అక్కణ్ణించి రానంటుంది. బలవంతాన లాక్కొచ్చాను."

"అవును. పెద్దదయింది కదూ!" అంటూ మూన్ సెంటు నవ్వింది. లాంతరు కిందపెట్టి ఆ వెలుతురులో కూతురిని పరీక్షగా చూసిందామె. ముఖంమీద వెలుగు పడుతూవుంటే నిద్రలో వున్న ఆ పిల్ల ముఖం అవతలకు తిప్పేసుకుంది. లాంతరు ముఖానికి దగ్గరగా పెట్టింది. ఆ పిల్ల నిద్ర మేల్కొని తండ్రిచేతుల్లోంచి తప్పించుకుని గుంజుకొని బయటకు పరిగెత్తింది. బుట్టలు అల్లడానికి తెచ్చిన వెదురు బొంగులు యింటిముందు పడివున్నాయి. వాటికి ఆ పిల్ల కాళ్ళు తగిలి పడబోయింది. ఆ చప్పుడుకి కుక్కలు పెద్దగా మొరిగాయి.

"జాగ్రత్త. చీకట్లో వాటిమీద పడతావు." అని అరిచింది మూన్ సెంటు. ఆ పిల్ల వాటిమీద అడుగువేయకుండా కళ్ళు గిలగిల తిప్పుకుంటూ నిలబడింది.

గోల్డురూటు తాత ముత్తాతల నాటి యిల్లు. ఆ యింట్లో ఒక గదీ, యింకో గదిలో సగభాగమూ సంక్రమించాయి ఆతనికి. దీని పక్కనే వున్న గదిలో ముసలి మామా, అత్తా ఉన్నారు.

"గోల్డురూట్! ఎవరొచ్చింది?" అని అడిగింది అత్త.

"నేనా, పిన్నీ! నువ్వూ, బాబాయీ కులాసాయేనా?" అడిగింది మూస సెంటు.

"నువ్వా! ఇంతకుముందే నీ సంగతి మాట్లాడుకున్నాము. ఇంకా నువ్వు రాలేదేమా అనుకున్నాం." అంది ముసలి అత్త.

దీపం చేత్తో పట్టుకుని ముసలి అత్త గదిలో అటూ యిటూ తిరుగుతోంది. ముసలాయన దగ్గాడు. ఆ దగ్గుకు ఏడుస్తూ పిల్లలు నిద్రమేల్కొన్నారు.

"పిన్నీ! పడుకున్నట్టున్నావు. ఇప్పుడు లేచి రాకు. రేపు పొద్దున్న నేనే వస్తాను. గోల్డ్‌హాక్ గారు వదిన బావుందా?" అని అడిగింది మూస సెంటు.

"బాగానే ఉన్నాను వదినా!" అని బదులు చెప్పింది ఆ ముసలి దంపతుల కోడలు గోల్డ్‌హాక్ గారు.

తలుపు గడియతీస్తూ "మేము యింకా పడుకోలేదు. నీ సంగతే మాట్లాడుకుంటున్నాము." అంటూ ముసలి అత్త గదిలోంచి బయటకు వచ్చింది. ఆమె వెనకాలే ముసలి మామ కుంపటి పట్టుకువొచ్చాడు. అక్కడ ఖర్చులేకుండా చేతులూ, కాళ్ళూ చలిమంట కాచుకునేందుకు ఆ కుంపటి చాలా బాగా పనికొస్తుంది.

"పిన్నీ! రా! లోపలికి వచ్చి కూర్చో!" అంది మూస సెంటు. అందరూ గోల్డ్‌హాక్ గారు గదిలో చేరారు. కోడలు గోల్డ్‌హాక్ గారు కూడా వచ్చింది. అందరూ కూర్చునేందుకు చాలినన్ని కుర్చీలు లేవు. ముసలి అత్త మంచంమీద కూర్చుని మూస సెంటును తన పక్కన కూర్చోబెట్టుకుంది.

"ఏమే అమ్మాయీ! ఏం గుండె నిబ్బరమేసీది! మూడేళ్ళకు రావటం? చూడు! నీ కూతురు ఎంత పెరిగిందో!" అని ముసి ముసి నవ్వులతో మంచం వెనక దాక్కున్న బెకీ చెయ్యి పట్టుకుని లాగింది ముసలి అత్త. ఆ పిల్ల మంచం కర్ర పట్టుకుని, ముఖం గోడ వేపు తిప్పి పూర్తి బయటకు రాలేదు.

"అమ్మా! అని పిలు." అంది ముసలి అత్త.

"అమ్మా! అమ్మా! అని పిలు బెకీ!" అంది కోడలు.

అల్లరి చేసిన పిల్లను కొట్టినట్టు బెకీ వీపు మీద ఒకటి చరిచి "చూడు! ఎంత పెద్దదయిందో!" అంది ముసలి అత్త నిష్ఠూరంగా.

గోల్డ్‌రూటు చీకట్లో నిలబడ్డాడు. తన భార్యరాగానే యింట్లో అందరూవొచ్చి యిట్లా మాట్లాడుతున్నారు; మధ్య మధ్య తనేమనా మాట్లాడితే ఆ సందడిలో అదెవ్వరికీ వినిపించటం లేదు. అతను అక్కడ ఉండీ ఉండనట్లే ఉంది.

ముసలాయన కుంపట్లో నిప్పులను చేతిలో ఉన్న పుల్లలతో ఎగసన తోసి మూన్‌సెంటును చూస్తూ "నువ్వు వచ్చిన పడవ పట్నం ఎప్పుడు చేరింది" అని అడిగాడు,

"మధ్యాహ్నం" అని జవాబు చెప్పింది మూన్‌సెంటు.

పట్నం నించి నలభైమైళ్ళు దూరం నడిచి వచ్చిన మనిషికి దాహంగా ఉండదా అనుకుని గోల్డ్‌రూటు పొయ్యిదగ్గరకు వెళ్లి చూశాడు. పొయ్యిలో నిప్పు ఆరిపోయినా పొయ్యిమీద వున్న గిన్నెలో ఒక గ్లాసు నీళ్లున్నాయి. అవి వెచ్చగానే వున్నాయి. గోల్డురూటు ఆ నీళ్లు ఒక గ్లాసులో పోశాడు. అంతమందిలోనూ ఆ గ్లాసు భార్య కివ్వడానికి సిగ్గేసి ముసలాయన దగ్గరకి వెళ్లి ఆ గ్లాసు ఆయన చేతికిచ్చాడు. అది చూసి అందరూ ఒక్కసారి నవ్వారు. ముసలి అత్త ఆ గ్లాసు తీసుకుని మూన్‌సెంటు కిచ్చి తాగమని చెపుతూ "చూడు! నీ మొగుడు నీ విషయం ఎంత జాగ్రత తీసుకుంటున్నాడో" అంది.

అందరూ మళ్లీ విరగబడి నవ్వారు. ఎప్పుడూ దిగులు మొహం పెట్టుకు కూర్చునే కోడలు కూడా నవ్వింది. ఆమె ముఖం కోలగా ఉంటుంది. ఎముకలు బయటకు పొడుచుకు వచ్చాయి. చాలా చిన్నకళ్లు. ఆమె జీవితం దుఃఖమయం. నలుగురూ నవ్వేటప్పుడు మర్యాదకోసం ఆమే నవ్వుతుంది గాని తెచ్చిపెట్టుకున్న ఆ నవ్వు సహజంగా వుండదు. అయితే ఆవిడ యిప్పుడు సహజంగా నవ్వు వచ్చే నవ్వింది. ఆమె మొఖంలో నవ్వనేది ఏదో అసహజంగానూ, విడ్డూరంగానూ కనపడుతుంది.

"వీళ్ల దంపతులు ఎప్పుడూ చాలా అన్యోన్యంగా ఉంటారు. ఒక నిమిషంకూడా ఒకరిని విడిచి ఒకరు ఉండేవాళ్లు కారు. మూడేళ్లు యిట్లా ఎడబాటు కలగడం మహాపాపం," అంది ముసలి అత్త.

"ఈ ముసలి పిన్నిని చూడండి! మూడేళ్ళ తర్వాత యిప్పుడు చూస్తున్నాను ఆవిణ్ణి. ఎంత పిచ్చిగా మాట్లాడుతోందో చూడండి." అంది మూన్‌సెంటు.

"సరేలే, అంత విసుగ్గా వుందా! పదండర్రా పోదాం! వాళ్లిద్దరూ మాట్లాడుకోకుండా మనం అడ్డం ఎందుకూ!" అంది ముసలి అత్త.

"మేమేం చిన్న పిల్లలమా చెట్టంత కూతురుండగా! మేమేం మాట్లాడుకోవాలి!" అంటూ కూర్చోమని అత్తను చెయ్యిపట్టుకు లాగింది మూన్ సెంటు.

"లేవయ్యా! లే! పోదాం! పానకంలో పుడకలాగా మనమెందుకిక్కడ!" అంది ముసలి అత్త కొంటెగా తన ముసలి భర్తతో.

గోల్డురూటు నవ్వుతూ "ఏం ఫరవాలేదు; వెళ్లొచ్చులే! కూర్చోండి." అని బలవంతం చేసి అందరినీ కూర్చోబెట్టాడు. వేళాకోళాలూ, నవ్వులూ సాగాయి. తన పెళ్లినాటి రాత్రి తననూ, తన భార్యనూ బంధువులుచుట్టూ చేరి ఎగతాళి పట్టించడం జ్ఞాపకమొచ్చింది గోల్డురూట్ కి. మంచం తెరల సందులోంచి తొంగిచూస్తూ కూర్చున్న మూన్ సెంటు కొత్త పెళ్లికూతురులా కనబడిందతనికి. అందమైన కళ్లు, తీర్చి దిద్దిన కనుబొమలు, తెల్లటి ముఖం, పెదల్పాటి గడ్డం, చిన్న నుదురు బొమ్మలాగుంది మూన్ సెంట్. శిథిలమైన గుడిలో కనపడీ కనపడని దేవతలా కనిపించిందామె అతని కళ్ళకి. పాడుబడ్డ ఒక ఆలయంలో తిరిగి, మాసిపోయిన తెరల వెనక అందంగా వున్న ఒక ప్రతిమ తన భార్యలాగే కూర్చునుండడం జ్ఞాపకం వొచ్చిందతనికి. అంత అందంగా ఆమె కూర్చునుంటే, ఆ కూర్చున్నది తన భార్యేనా అని సందేహం కలిగింది గోల్డురూట్ కు. ఇంత అందమైన యీ దేవతనేనా జూదంలో డబ్బు పోగొట్టుకున్నప్పుడూ, తాగి వచ్చినప్పుడూ తను కొట్టిందని సిగ్గుపడ్డాడతను.

మూన్ సెంటు మాటలు మార్చి ఎండా వానలను గురించి మాట్లాడింది. తనకోసం ఆమె తపించి పోతున్నదని బంధువులు పరిహాసం చేయడం ఆమెకు యిష్టంలేదు కాబోలు ననుకుని గోల్డురూట్ లోలోపల బాధపడ్డాడు.

"ఈ చలికాలమంతా మంచు పడనేలేదు పట్నంలో. ఇక్కడ మంచు కురిసిందా?" అడిగింది మూన్ సెంటు.

"ఈ సంవత్సరం వానలు బాగానే కురిశాయి." అంది ముసలి అత్త

"మంచు పడ్డదా?"

"పంచాంగాన్ని బట్టి మంచుపడే రోజులు ముందున్నాయి."

"వసంత కాలమొచ్చాక మంచుకురిస్తే బాగుండును. ఈ సంవత్సరం ప్రారంభంలోనే వసంత కాలం వస్తుంది," అంది మూన్ సెంట్.

"కొద్ది రోజుల్లో మంచు కురిసి తీరుతుంది. అప్పుడే చలికి నా వొళ్లు బిగదీసుకు పోతోంది" అన్నాడు ముసలి మామ చిరాకుగా.

"బాగా వానలు కురిశాయి. వచ్చేపంట విరగపడుతుంది" అంది ముసలి అత్త.

అతి వర్షాలు కురిసుంటాయి అనుకుంది మూన్ సెంటు. నాన దేవుళ్లే తమ కొడుకులాగా వాళ్ళ వెనక వేసుకొచ్చి ఎందుకు అంతగా సమర్థిస్తున్నారో ఆమెకు అర్థం కాలేదు. ఎప్పుడూ కీడెంచి మంచెంచడమే అలవాటు. సాధారణంగా పల్లె ప్రజలు వానలు కురవలేదనీ, పంటలు పండలేదనీ గోల పెడతారు. భూస్వాములూ, ప్రభుత్వమూ, వాళ్ళ ప్రతినిధులూ తమవద్ద ఎక్కువ ఫలసాయం కోరుతారన్న భయం వల్లో లేక దేవతలు తమను చిన్న చూపు చూస్తారన్న జంకువల్లో పల్లెటూరి ప్రజ తమలో తాము మాట్లాడుకునేప్పుడు కూడా నష్టజాతకమే వల్లిస్తారు. అది వాళ్ళకు అలవాటైపోయింది. అలాంటిది యీ సంవత్సరం విరగపండుతుందని వాళ్ళ నోళ్ళతో వాళ్లే చెపుతున్నారు. అన్నీ చెప్పడం చాలా తెలివితక్కువ పనీ, మరుసుతనమూ అనుకుంది మూన్ సెంటు.

"ఈ ప్రాంతాల్లో యిప్పుడు కాలమాన స్థితి చాలా బావుంది. వీళ్ళ వాళ్లు బాగుపడ్డారు. దేవుడు దయ దలిచాడు. పంటలు ఎప్పుడూ యింత బాగా లేవు. అమ్మాయీ! నువ్వు నాలుగు రోజులు ఆలస్యంగా వొచ్చావన్న కాని లేకపోతే నీ భర్త ఆదర్శ కర్షకుడుగా గౌరవింప బడటం నీకళ్ళతో నువ్వు చూసేదానివి. రొమ్ముదగ్గర ఎర్రని పువ్వు తగిలించి వేదిక మీద కూర్చోపెట్టారు వాణ్ణి. మన కుటుంబంలో ఎవరికీ ఎప్పుడూ జరగని గౌరవం నీభర్తకి జరిగింది." అంది ముసలి అత్త.

ఇంకెవరికైనా అటువంటి గౌరవం జరిగివుంటే అదో పెద్ద గొప్ప విషయంగా అనుకునేది కాదు మూన్ సెంటు. కాని తన భర్తకే ఆ గౌరవం జరగడంవల్ల గర్వంతో ఆమె వొళ్లు పులకరించింది. గోల్డుస్టోను అది తన విషయం కానట్లు చూస్తూ నమ్రత ప్రదర్శించాడు.

"ఈ గౌరవం జరగడం వల్లే మనవాడు గొప్పవాడని నే ననటం లేదు. దాపరికం లేకుండా చెబుతున్నాను వినండి. మన వంశంలో మొట్టమొదట,

గోల్డురూటు ఒక్కడే ప్రతిభ వున్నవాడని నేను మా ముసలాయనతో ఎప్పుడూ అంటూవుంటాను” అంది ముసలి అత్త.

“అత్త ఎంత చక్కగా చెప్పింది!” అంటూ మూన్ సెంటు పంపకాలు ఎల్లా జరిగాయని అడిగింది. భూ కామందు సామాను, అతని దుస్తులు, పాత్రసామాను అన్నిటిమీదా అంకెలు వేసి లాటరీ వేశారు. ముసలి మామకు ఒక పూలతొట్టె, చిన్నపిల్ల పట్టుగౌను వచ్చాయి. గోల్డురూటుకు ఒక పెద్ద అద్దం వొచ్చింది అని అత్త చెప్పింది.

“ఏదీ! అద్దమేదీ!” అంటూ మూన్ సెంటు గది నాలుగు వేపులా చూసింది.

“మా చెల్లెలికి భరణంగా యిచ్చాను.” అన్నాడు గోల్డురూటు.

“ఎంత మంచి అద్దం అనుకున్నావు!” అని ముసలి అత్త చెబుతుంటేగా సహజంగా భయస్థురాలైన కోడలు అడ్డువచ్చి “అవును చాలా బావుంటుందా అద్దం. అంగుళం వెడల్పున చుట్టూ ఉన్న నల్లకొయ్య చట్టంమీద స్వస్తిక్ గుర్తు చెక్కబడ్డది.” అంది ఆ అద్దంమీద ఆమెకున్న మోజు వెల్లడిస్తూ.

“అంతేనా! అంతకంటే యింకా ఎక్కువ బావుంటుందది. భరణం యిచ్చేరోజున దాని అంచులకు కట్టిన ఎర్రపచ్చ రిబ్బన్లతో ఎంత అందంగా వుందది!” అంది ముసలి అత్త.

ముసలాయన కుంపట్లో నిప్పులను చేతిలోఉన్న పుల్లలతో కదుల్చుతూ “అన్ని వస్తువుల్లోకీ మంచి వస్తువు మీకే చిక్కింది.” అన్నాడు మూన్ సెంటు వేపు తిరిగి.

“అవును. అందరూ అదే అన్నారు. అందరిలోకీ మీరే అదృష్టవంతులన్నారు.” అన్నది ముసలి అత్త.

“దోవలో నువ్వు మా చెల్లెలు యింటికి వెళ్లావు కదా ఆ అద్దం చూడలేదా?” అని అడిగాడు గోల్డ్ రూటు భార్యని.

“ఒంట్లో బాగాలేక మీ చెల్లెలుభర్త గదిలో పడుకున్నాడు, నేనా గదిలోకి వెళ్లి అద్దం చూడలేదు.” అంది మూన్ సెంటు నవ్వుతూ.

“ఇంకోప్పుడైనా నువ్వు వెళ్లి తప్పకుండా ఆ అద్దం చూడాలి సుమా!” అన్నది కోడలు.

మూన్ సెంటు ఆ అద్దం చూడనైనా చూడకుండా ఆమె భర్త తన చెల్లెలికి యిచ్చేశాడు. ఇద్దామా వద్దా అని భర్త ఆమెని అడిగివుంటే వద్దని తను ఎన్నటికీ అనేది కాదు. తన నడగకుండా అతనా పని చేసినందుకు మూన్ సెంటు కొంచెం బాధపడ్డది. ఆమె కొద్దిగా మూతి ముడుచుకు కూర్చోవడం కూడా జరిగింది.

మూన్ సెంటు మూతి బిగించుకుని ఉండడం ముసలావిడ కనిపెట్టి "ఇప్పటికైనా మేము వెళ్ళడం మంచిది. ఇంకా ఉంటే మన పిల్లదాన కాల తిట్టుకుంటారు కూడాను." అంది.

"ఏమిటి పిన్ని ఆ మాటలు! ఇంకొంచెంసేపు కూర్చోండి" అంటూ ఆ ముసలావిడ చెయ్యి పట్టుకు లాగింది మూన్ సెంటు.

"కాదులే. మీరు యిప్పటికే చాలా అలిసిపోయి ఉంటారు. అదీ కాక, ఆకాశంమీద దూరంగా ఉన్న ఆ రెండు పెద్ద నక్షత్రాలు సంవత్సరానికోసారి కలుసుకున్నట్లు యిన్నేళ్ళకు మీ రిద్దరూ ఒకర్నొకరిని కలుసుకున్నారు." అంది అత్త.

పెద్దగా నవ్వుతూ వాళ్ళంతా వొకరివెంట వొకరు బయటికి వెళ్ళి పోయారు. తాము ఎంత బలవంతపెట్టినా వుండకుండా వాళ్ళు వెళ్ళిపోవడం చూసి దంపతులిద్దరూ తలుపుదాకా వెళ్ళి వాళ్ళని సాగనంపారు. దీపం సన్నగా వెలుగుతోంది. గోల్డురూటు దీపంలో నూనె పోసేందుకు బదులు ఒక ఎర్రని కొవ్వొత్తి ముక్క లాంతరులోంచి తీసి వెలిగించి పగిలిపోయిన ఒక నీలి అంచు పళ్లెంలో పెట్టాడు దాన్ని. నిజానికి కొవ్వొత్తి వెలిగించడం అనవసరమే కాని గోల్డురూటుకు శోభనపు రాత్రి ఎర్ర కొవ్వొత్తి వెలగడం యిష్టము.

తలుపు గడియవేసి వొచ్చి "ఇందాకటినించీ నిన్ను అడగాలనుకుంటున్నాను. కాని వాళ్ళంతా ఉండడంవల్ల అడగలేదు. పంటలు బాగా పండాయికదా వదిన యింట్లో రాగుల అన్నం, గంజీ చేసుకుంటున్నారేం?" అని అడిగింది మూన్ సెంటు.

కొవ్వొత్తి వెలిగిస్తూ గోల్డురూటు ఆమె ప్రశ్నకు జవాబేమీ చెప్పలేదు.

"చాన్ స్థితి ఏమంత బాగున్నట్లు లేదు. మధ్యవర్తులు మనల్ని మోసగించారు." అంది మూన్ సెంటు.

గోల్డురూటు నవ్వుతూ "మధ్యవర్తులు మోసగించడ మేమిటి ! ఈ గోల్లాల్లో అందరూ రాగులే వండుకుంటున్నారు. మన యింట్లోనూ యిప్పుడు రాగులే వండుకుంటున్నాము." అన్నాడు కొంచెం విసుగ్గా.

"అదేమిటి ! పంటలు అంత బాగా పండుతే తిండికి బియ్యమే లేదా"! అన్నది మూన్ సెంటు ఆశ్చర్యం చూపుతూ.

చెయ్యి ఎత్తకుండానే ఆమెను మాట్లాడవద్దని సంజ్ఞ చేస్తూ కిటికీ వేపు తల తిప్పాడు గోల్డురూట్. మూన్ సెంటు చప్పున కిటికీ దగ్గరకు వెళ్లి గోల్డురూటు వద్దు అనే లోపున కిటికీ తెరిచింది. ఆ క్షణాన బయటనున్న వెదురు కర్రలు గలగల చప్పుడవడం, చుట్టుపక్కల కుక్కలు మొరగడం జరిగింది. చంద్రుడు ఆ కాలంలో పైకి పోవడంవల్ల కిటికీలోంచి తల బయట పెట్టి చుట్టుపక్కలంతా పరీక్షగా చూసింది మూన్ సెంటు. ఎవరూ కన పడలేదు. కిటికీ తలుపులు మూసేస్తూ ఏమిటదని అడిగింది.

"పనీ పాటా లేనివాళ్లు ఎవరేం మాట్లాడుకుంటున్నారో అని కిటికీల దగ్గర పొంచి వింటారు. అటువంటి వాళ్లేమన్నా వచ్చారేమో!" అన్నాడు గోల్డురూట్ ఆదుర్దా చూపకుండా.

పల్లెటూళ్లలో ఏం తోచక తమాషాకి అప్పుడప్పుడు కొందరు అట్లా చేస్తారని ఆమెకు తెలుసు. "అయితే దాని కింత భయమెందుకు ? వాళ్లు వినకూడని మాట నేనేం మాట్లాడాము ?" అంది మూన్ సెంటు.

గోల్డురూట్ గాభరాగా ఉన్నాడు. "తరవాత పడుకునేప్పుడు చెబుతాలే ఆ సంగతి" అన్నాడతను.

మూన్ సెంటు భర్తను తేరిపార చూసింది. ఊరినించి తను తెచ్చిన మూట విప్పి తన భర్తకోసరం షాంగాయ్ పట్నంలో కొన్న మేజోళ్ళ జత, సిగరెట్టుపెట్టె బయటకు తీసింది. ఇంకేమైనా అయితే చెల్లెలికి యిచ్చి వేస్తాడని చెల్లెలికి పనికిరాని వస్తువులే తెచ్చిందామె. గోల్డుఫ్లవర్ కు ముఖం తుడుచుకునే తుండుగుడ్డ, వాసన సబ్బు తెచ్చింది. దోవలో అవి ఆమెకు యిచ్చి వచ్చింది.

కూతురికి సీమబాదం పాకంబిళ్ళలు తెచ్చింది. ఆ కాగితం పొట్లం విప్పింది మూన్ సెంటు. అంత దూరంనించి నడిచి రావడం వల్ల ఆమెకూ ఆకలిగా వుంది.

"బెకన్! నన్ను 'అమ్మా' అని పిలు. లేకపోతే యివి యివ్వను" అంది మూన్ సెంటు.

బిళ్లలు గుండ్రంగా బంగారు రంగులో వున్నాయి. బెకన్ తన నల్లని కళ్ళతో వాటిని ఆశగా చూసింది.

"నన్ను 'అమ్మా!' అని పిలు, ఒక్కసారి చాలులే" అంది మూన్ సెంటు మళ్లీ.

బెకన్ మాట్లాడలేదు. ఎవరూ మాట్లాడలేదు. అందరూ నిశ్శబ్దంగా ఉన్నారు. బెకన్ ఏడవటం మొదలు పెట్టింది.

"పోనీలే! ఏడవక! ఏడుస్తే నాకు అసహ్యమేస్తుంది." అన్నది మూన్ సెంటు.

పాకం బిళ్ళలు తల్లీ, కూతురూ తినడం ప్రారంభించారు. ఒకటి భర్త కిచ్చింది మూన్ సెంటు.

"నా కెందుకూ! నువ్వు తిను" అన్నాడతను.

"మీకోసమే తెచ్చాను" అంది ఆమె.

"బెకన్ కి దాచిపెట్టు."

"చాలా ఉన్నాయిలే. ఈ ఒక్కటీ నువ్వు తిను."

అయిష్టంగా దాన్ని తీసుకుని బలవంతాన తింటున్నట్లు తిన్నాడు గోల్డురూటు. అతని చెయ్యి వణకడం దీపం వెలుతురులో మూన్ సెంటుకి కనిపించింది. తన భర్తను తను లేనప్పుడు ఎవరు ఏం చేశారా అన్న కోపమూ, అతనిమీద జాలీ ఆమెకు కలిగాయి.

బెకన్ తన కిచ్చిన పాకం బిళ్ళ తినేసింది. తల్లిని చూస్తే కొత్త మనిషిని చూసినట్లు భయపడుతూండడం వల్ల మిగతా రొట్టెలు మూర్నాటికి తల్లి దాచి పెట్టుతూంటే ఆ పిల్ల చూస్తూ ఊరుకుంది. పడుకోబోయేముందు కూతురి గుడ్డలు విప్పుతూ "అయ్యో! ఈ జాకెట్టు ఎట్లా చిరిగిపోయిందో! కుట్టేదిక్కే లేకపోయిందా! ఎంత మురికి వోడ్తోందో. అదేమిటి గుండీలు అన్నీ వూడిపోయాయే" అంటూ తను లేనప్పుడు ఆ పిల్లను సంరక్షణ చేసిన తన వదినమీద నెపాలు వేస్తూ మాట్లాడింది మూన్ సెంటు. తల్లి తననే కోప్పడుతోందను కోవడంవల్ల బెకన్ కళ్లు నీళ్ళతో నిండాయి. వణుకుతున్న పెదవులు విప్పారాయి.

"మళ్లీ ఏడుస్తున్నావా? ఎందుకు? నీ అమ్మనికదూ! నాకు చెప్పవూ" అంటూ తన ముఖం కూతురి ముఖానికానించి బుజ్జగించింది కూతుర్ని.

బెకన్ జవాబు చెప్పలేదు. మూన్ సెంటు ఆ పిల్లను ఎత్తి పక్క మీద పడుకోబెట్టి కాళ్ళకున్న జోడు వూడతీసింది.

“చాలా చలిగా ఉందికదూ! కంబళీ బాగా కప్పుకో! మళ్లీ ఎందుకు ఏడుస్తున్నావో చెప్పవూ! పాకం బిళ్ళలకోసమేనా! నిద్రపో. పొద్దున్నే త్వరగా లేచి తినవచ్చు!” అంది మూన్ సెంటు.

మంచం అంచున కూర్చుని కూతురి గుడ్డలన్నీ తీసి కంబళీమీద పరిచింది మూన్ సెంటు. గోల్డుగూటు వచ్చి ఆమె పక్కన కూర్చున్నాడు. భార్య జాకెట్టు గుడ్డను చేతితో తాకిచూశాడు. లేత వూదా రంగూ బూడిద రంగూ చుక్కలూ, ఎర్రని చారలూ వున్న నూలుగుడ్డ అది. అతను కొంచెం నవ్వాడు. దాని ఖరీదు చాలా ఎక్కువ ఉంటుందనీ, అది చాలా నాజూకుగా ఉందనీ ఆ నవ్వు కర్థమో, లేక ఆమె అటువంటి గుడ్డ కొనడం తన కిష్టంలేదని దాని తాత్పర్యమో చెప్పడం కష్టం-యిష్టంలేనట్లే కనపడ్డాడతను.

చేతులు ఒకదానితో ఒకటి రాసుకుంటూ వెచ్చ చేసుకుంటూ “అబ్బా! చలితో చస్తున్నాను” అన్నాడతను.

“అంత చలిగా వుంటే వెళ్లి కప్పుకుని పడుకో” అంది మూన్ సెంటు. అతను ఆమెను అనుకుని దగ్గరగా కూర్చున్నాడు. మూన్ సెంటు చేత్తో అతని తల నిమిరింది. ఆమె చెయ్యి కాయలు కాసి మొరటుబారింది నున్నగా దువ్విన అతని తలమీది వెంట్రుకలు ఆమె చేతికి గుచ్చుకున్నాయి.

“పల్లెటూళ్లు బాగున్నాయి. పట్నాలకంటే పల్లెటూళ్ళలో నయంగా వుంటుంది” అని అందరూ అన్నారు. పట్నాలలో డబ్బు లేదు. పట్నవాసులకు నౌకర్లను పెట్టుకునే తాహతులేదు. యజమానులు ఉన్న నౌకర్లను తీసివెయ్యకూడదని ప్రభుత్వం ఆజ్ఞలు జారీచేసింది. ‘ఈ రోజుల్లో పల్లెటూళ్ళు బాగున్నాయి. నేను నీ స్థితిలో ఉంటే యింటికి వెళ్లి పొలంపని చూసుకుంటాను’ అనేవాడు నా యజమాని. అతనిమాటలు నిజమనుకున్నాను. అమాయకంగా అతని మాటలు నమ్మానని నాకు యిప్పుడు తెలిసింది” అని నెమ్మదిగా భర్త చెవిలో చెప్పింది మూన్ సెంటు.

తన భార్య పల్లెటూరికి తిరిగి వచ్చినందుకు అప్పుడే విచారిస్తోంది. ఆమె వచ్చినందుకు తను అంత సంతోషంగా ఉంటే, తన దగ్గిరికి రావడం ఆమెకేమీ సంతోషంగా ఉన్నట్లు లేదు.

"అవును. పల్లెటూళ్లలో బ్రతుకు భారమవుతోంది. లేకపోతే నిన్ను రమ్మని ఎప్పుడో వ్రాసి ఉండేవాడిని. ఈ పల్లెటూరి జీవితానికి నువ్వు అలవాటు పడగలవో లేవో అని ఆలోచిస్తున్నాను" అన్నాడు గోల్డురూటు.

"అలవాటు పడడమేమిటి? పట్నంలో ఆడుతూ పాడుతూ కాలం గడిపేదాన్ననుకున్నావా? పొంగాయ్‌లో నే సెలావున్నదీ నువ్వే చూశావుగా!" అంది మూన్‌సెంటు అతన్ని కొంచెం కోపంగా చూస్తూ.

అతను మాట్లాడలేదు. ఇంటికి వచ్చిన మొదటిరోజు కనుక అంతటితో ఊరుకుందిగాని, లేకపోతే యింకా కోప్పడేదే. ఆమె బెకన్ కాలిజోడు వొకటి వంగి చేతులోకి తీసుకుని, దాన్ని అటూ యిటూ తిప్పి, దుమ్ము తుడిచి దీపం వెలుగులో జోడును పరీక్షించింది.

"ఈ జోళ్లు కుట్టింది నీ చెల్లెలేనా?" అడిగిందామె.

"కాదు. దాని అమ్మమ్మ కుట్టింది వాటిని" అన్నాడు గోల్డురూటు.

లేకపోతే అతని చెల్లెలు ఆ మాత్రం కుట్టగలదా అనుకుని "ఈమాత్రం కుట్టిందంటే మీ అమ్మ చూపు యింకా బాగానే వుందన్నమాట. రేపు వెళ్లి మా అమ్మను చూసివస్తాను" అంది మూన్‌సెంటు.

"చాల్లే! ఎక్కడికి వెళతావు! వెళ్లిరావడం మాటలా! మున్నెన్ని మైళ్ళు నడవాలి" అన్నాడతను.

ఉన్నట్లుండి బెకను "నాన్నా! నేను కూడా వెళతాను" అని అరిచింది.

"ఇంకా నువ్వు నిద్రపోలేదా?" అన్నాడు గోల్డురూటు.

మూన్‌సెంటు కంబళి సరిగా కప్పి, ముద్దు పెట్టుకుంటూ "త్వరగా నిద్రపో. లేకపోతే రేపు నాతో నిన్ను తీసుకువెళ్లను" అంది కూతురితో.

బెకనుకు చాలాసేపటివరకూ నిద్రపట్టలేదు. ఆ పిల్ల ధ్యాసంతా అమ్మ తెచ్చిన పాకం బిళ్ళలమీదే ఉంది.

మూన్‌సెంటు తన కాళ్ళను తనే గుద్దుకుంటూ "దూరం నడవడం నాకు బొత్తిగా అలవాటు తప్పింది" అన్నది.

గోల్డురూటు వెటకారంగా నవ్వుతూ "మీ అమ్మను చూడడానికి రేపు వెళ్లతానని నువ్వేకదూ అన్నావు! నాకు తెలుసు, నువ్వేం నడవలేవు. లాభంలేదు" అన్నాడు.

జాకెట్టు గుండీలు వూడతీస్తూ వుండగా జేబులోవున్న డబ్బు ఎంత ఖర్చయిందో లెఖపెట్టాలన్న సంగతి ఆమెకు జ్ఞాపకం వచ్చింది. భార్య దగ్గర యింకా ఎంత డబ్బు మిగిలివుందీ తెలుసుకోవాలనిపించింది గోల్డ్ రూటుకు. ఆవిడ ఆ సంగతి అతనికి చెప్పలేదు. అతనూ అడగలేదు. ప్రతి నెలా తినగా డబ్బు పంపిస్తూ వుండడంవల్ల ఆమె దగ్గర ఎక్కువ ఉండదేమో అనుకుని కొంచెం సిగ్గుపడ్డాడతను.

లెఖ సరిపోలేదేమో ఆమె చాలాసేపు డబ్బు లెఖపెట్టింది. ఆమె వేపు చూస్తూ కూర్చోడం యిష్టంలేక అతను లేచి మంచం పక్కన పేర్చి ఉన్న పెట్టెల దగ్గిరికి వెళ్ళాడు.

ఆమె తల పైకియెత్తి చూసి "ఇప్పుడీరాత్రి పెట్టె ఎందుకు తెరుస్తున్నావు?" అని అడిగింది.

అతను మాట్లాడకుండా పెట్టెలోంచి ఒక కాగితం తీసుకొచ్చి, బల్ల మీద పరిచి తదేకంగా దానివేపే చూశాడు. భార్య డబ్బు లెఖపెట్టడం ఆపి తన దగ్గరకు వస్తుందని అతని ఆశ. ఆమె రాగానే భూమి దస్తావేజును ఆమె ముందు పెట్టి "చూడు" అన్నాడతను.

చక్కని దస్తూరితో వ్రాయబడి, పెద్ద ముద్రలు వేయబడిన పత్రం అది. ఆ పత్రంలో వున్న అంకెలు అతను గుర్తుపట్టాడు. ఆ పత్రంలో తన పేరు ఎక్కడ వ్రాసివుందో ఆమెకు చూపించాడతను. దీపం వెలుతురులో తలలు దగ్గిరగా పెట్టుకుని పత్రాన్ని తదేకంగా చూశారు వాళ్ళిద్దరూ.

"ఇది మన భూమి. మన సొంతం. ఇప్పుడు యుద్ధం జరుగుతోంది కాబట్టి యింత కష్టంగా ఉంది. యుద్ధం ఆగాక మంచిరోజులొస్తాయి. కష్టాలు తీరిపోతాయి. పొలంమీద మనం బతకవొచ్చు" అంది మూన్‌సెంటు సంతోషంతో.

సూర్యకాంతిలో కనబడే విశాలమైన పొలాలలాగా, ముందు రాబోయే కొన్ని తరాల భవిష్యత్తు ఆమె కళ్ళయెదుట పరుచుకుంది. భర్త కౌగిలింతలో వున్న ఆమెకు అనంతమైన ఓర్మితో ఆ భవిష్యత్తుకు ఎదురు చూడవచ్చనిపించింది.

భర్త కౌగిలింతలోంచి తప్పించుకోవాలని "బేబీ యింకా నిద్ర పోలేదు" అంది మూన్‌సెంటు.

"నిద్రపోయింది."

"ఇప్పుడేగా మాట్లాడింది."

"నిద్ర పోయిందిలే. ఇదివరకు దానిముందర నీకింత భయముండేది కాదే!"

"అప్పుడది చిన్నపిల్ల!"

ఆమె మెడ వెనకనున్న ఒక నల్లని మచ్చను చూసి తడుముకుంటూ "నల్లి కుట్టిందనుకున్నాను" అన్నాడతను.

"అవును. ఆ పడవలో ఒకటే నల్లులు."

"కాదు. ఇది పుట్టుమచ్చ. ఇక్కడ పుట్టుమచ్చ ఎప్పుడొచ్చింది!"

"నాకేం తెలుసు. తలవెనక కళ్ళేమైనా వున్నాయా నాకు!"

"ఇదివరకు నీకు యిక్కడ పుట్టుమచ్చ లేదు."

"ఈ మూడేళ్లలో వచ్చి ఉండవచ్చుకదూ!"

"అవును. నిజమే. మూడేళ్లయింది కదూ నువ్వు వెళ్లి" అంటూ అతను సిగ్గుపడుతూ నవ్వాడు.

కొవ్వొత్తి కరిగిపోయింది. పగిలిపోయిన పళ్లెంలో కరిగిపోయిన మైనం ఎర్రని పువ్వు రేకలలాగా కనిపించింది. పువ్వు మధ్య కాడలాగు సన్నని పొడుగాటి మంట గాలికి రెపరెపలాడింది.

సెకన్ నిద్రపోతూ అమ్మమ్మగారి యింటికి వెళ్లినట్టూ, పాకం బిళ్లలు తిన్నట్టూ కలలు కంటూంది. అక్కడ తన తండ్రీ, అత్తా యింకా చాలామంది బంధువులూ వున్నట్టూ, యింకా తన తల్లితో తనకు చనువు ఏర్పడినట్టూ కలగంది ఆ పిల్ల.

# నాలుగో ప్రకరణము

ఉదయభానుని కిరణాల వెచ్చదనానికి కప్పుమీద మంచు కరిగిపోతోంది. ఇంటి వెనక కొండ నల్లగా కనబడుతోంది. సూర్యకాంతిలో కొండ చరియలమీది చెట్ల బోదెలు కనపడీ కనపడకుండా వెండితీగలలాగు మెరుస్తున్నాయి. కొండ చరియలమీద వున్న చెట్ల ఆకుపచ్చని ఆకులు చెరువులో తేలే నాచులా కనపడుతున్నాయి.

ఒక కొండమీదనించి మరో కొండమీదకు ఎగ్రబ్రాకుతున్నట్లున్న నల్లని ఈతచెట్ల వేపు చూసింది మూన్ సెంటు. కొండపైన ఒక గుహ ఉంది. ఆ గుహాదగ్గర తెల్లని మబ్బు ఒకటి ఆకాశంమీద తేలుతోంది. క్రిందటి రాత్రి మూన్ సెంటు యింటికి వచ్చేటప్పుడు ఆ గుహదగ్గర ఒక దీపం వెలుగుతూండడం చూసింది. అది దీపమా లేక నక్షత్రమా అని ఆమెకు సందేహం కలిగిం దప్పుడు. కొండపైన యిల్లుంటే మబ్బులా కనపడుతున్నది ఆయింట్లోనించి వస్తున్న పొగ అయివుంటుంది. ఆ పొగ త్వర త్వరగా మాయమైపోతున్నది. మబ్బయితే అంత త్వరగా మాయం కాదు.

క్రిందటి రాత్రి మూన్ సెంటు చీకట్లో కుక్క పెంట తొక్కింది. కాలిజోడును తడి గుడ్డ పీలికతో తుడిచి చెట్టునీడన ఆరపెట్టింది. సారాతో తుడుస్తే అది పాడవకుండా ఉంటుంది. ముసలి మామకు సారాయి చాలా యిష్టం. వాళ్లయింట్లోకి వెళ్లి కొంచెం సారా అడిగి తెద్దామా అనుకుంది మూన్ సెంటు.

కాని తినడానికే బియ్యం లేని యీ రోజుల్లో బియ్యంతో సారా ఎవరు చేస్తారు! మూన్ సెంటు జోడు చేతిలోకి తీసుకుని యింకోసారి తడి గుడ్డతో దాన్ని తుడిచింది.

పల్లె జీవితం యింత అధోగతిలో ఉంటుందని ఆమెకు అదివరకు తెలిసి ఉంటే షాంగాయ్ పట్నం నించి వచ్చేదే కాదు. గోల్డురూట్‌నే అక్కడకు రమ్మని వ్రాసేది. అయితే షాంగాయ్ పట్నం వెళ్లడానికి అనుజ్ఞాపత్రం దొరకడం చాలా కష్టము. పాటక జనం పల్లెలకు వెళ్లిపోవాలని షాంగాయ్ పట్నం అధికారులు కోరుతున్నారు. అందుకే తను పల్లెకు రావడానికి అనుజ్ఞాపత్రం సులభంగా దొరికింది. పాటక జనాన్ని పట్నం నించి పంపివేస్తుండడం వల్ల ఆ రోజుల్లో షాంగాయ్ పట్నపు వీధుల్లో రిక్షాలు లాగేవాళ్లు లేనేలేరు. గుర్రంబళ్లు తోలేవాళ్లు కూడా చాలా తక్కువమంది ఉన్నారు, ఎంత మందిని పంపివేసినా యింకా పట్నంలో అక్కడక్కడ పాటక జనం ఉంటూనే వున్నారు. తనూ, తన భర్తా ఏ మూలో ఉండడానికి వీలులేక పోతుందా అనుకుంది మూన్ సెంటు.

ఇప్పుడు తామిద్దరూ షాంగాయ్‌కి వెళ్లిపోతే తమ కూతుర్ని అమ్మమ్మగారింట్లో దింపి వెళ్లాలి. ఆ పిల్ల ఖర్చుకుగాను తను ప్రతినెలా కొంత

డబ్బు పంపిస్తానంటే తన తల్లి సంతోషంతో ఒప్పుకుంటుంది. కాని ఏదో కొంతభూమి సంపాదించుకున్నాక యిప్పుడు షాంగాయ్‌కి వెళ్ళడానికి తన భర్త ఎన్నటికీ అంగీకరించడు. తాము పల్లెవదిలి వెళ్ళిపోయినా గాని ఆ పొలం తమది కాకుండా పోతుంది.

తీరా పట్నంకి వెళ్ళాక తమ యిద్దరికీ అక్కడ పని దొరకక పోతే ఏం చెయ్యాలి? తను ఓ వీధిమూల కూర్చుని చిరిగి పోయిన నైలాన్ మేజోళ్ళను కుట్టి బాగుచేసి డబ్బు సంపాదించవచ్చు. ఇదివరకు తను పని చేసిన యింటి యజమానిని అడిగి కొంచెం డబ్బు అప్పుతీసుకుని దానితో సూదులూ, దారాలూ కొనుక్కోవచ్చు. షాంగాయ్ పట్నంలో యిప్పుడు నైలాన్ మేజోళ్లు తొడుగుతున్నారు. పాత సరుకో, దొంగ సరుకో దొరుకుతూనే వుంది. ఎవరూ మేజోళ్ళు తొడగని వేసవి కాలంలో తనూ, తన భర్తా కలిసి ఓ యిస్త్రీ షాపు పెట్టుకోవచ్చు. మామూలు చాకలి షాపుల కంటే యీ యిస్త్రీ షాపులు తక్కువ డబ్బు తీసుకోవడంవల్ల పోయిన వేసవి కాలంలో అవి బాగా డబ్బు చేసుకున్నాయి. గబ్బున కిట కిట లాడుతున్న రోజుల్లో అందరూ చాకగా వుండే కోటికే వెళతారు.

ఏ విధంగానూ డబ్బు సంపాదించడం వీలు కాక పోతే చివరికి రోడ్డు మీద పడి వుండే కాల్చివేసిన సిగరెట్టు పీకలు పోగు చేసి కొత్త సిగరెట్లు తయారుచేయడం, రోడ్డుపక్కన వుండే చెత్త డబ్బాలలో వెతికి ఏదైనా పనికి వొచ్చే వస్తువు దొరికితే దాన్ని తీసి అమ్ముకోవడం, వంతెనల పక్కన నుంచుని అటు వచ్చే బళ్లను వంతెనపైకి నెట్టడానికి సహాయ పడడం, అప్పుడప్పుడు అవసరమైతే ముష్టియెత్తడం చేయవచ్చు. తన భర్త బంధువొకడు షాంగాయ్ పట్నంలో కావలివాడిపనిలో వున్నాడు. అతన్ని అడిగి అతనున్న సందులో ఓ చిన్న గుడిసె వేసుకోవొచ్చు. కష్టకాలంలో తలదాచుకునేందుకు ఆ గుడిసె చాలు. ఏ క్షణాన్నయినా తమ అదృష్టం తిరిగి మంచి దశ పట్టవచ్చు.

ఒకరోజు షాంగాయ్ పట్నంలో మార్కెట్టుకు వెళుతూండగా వీధిలో జనమంతా తలలెత్తి చూస్తూ "చూడండి! చూడండి! సోమరిపోతులను పట్టుకుపోతున్నారు, చూడండి" అని గుసగుసలాడడం ఆమెకు జ్ఞాపకమొచ్చింది. ఒక మనిషిని చేతులు పట్టుకుని రోడ్డుపక్కన నిలబడి వున్న బండీదగ్గరకు యిద్దరు పోలీసులు తీసుకువెళ్ళడం ఆమె చూసింది.

అల్లరిచేసే తమ్ముణ్ణి చేతులు పట్టుకుని తీసుకు వెళుతున్నట్లు ఆ పోలీసు లిస్తూ నవ్వుకుంటూ, జాలిపడుతూ అతన్ని తీసుకువెళ్ళారు. చిరిగిపోయిన గుడ్డలతో వున్న ఆ మనిషికూడా బుజాలు ఎగరవేస్తూ, కాళ్ళు ఎత్తి ఎత్తివేస్తూ, అమాయికంగా నవ్వుతూ వెళ్ళాడు. హువాయి నదిఒడ్డున వున్న పెద్ద కర్మాగారాల్లో పనిచేయడానికి తనను పంపుతారని తెలిసికూడా అతనంత హుషారుగా వున్నందుకు ఆమెకు ఆశ్చర్యం వేసింది. అక్కడే ఒక ఆనకట్ట నిర్మిస్తున్నారు. నడుంలోతు నీళ్ళలో నిలబడి ఖైదీల గుంపులతోనూ, నిర్బంధ కార్మికులుగా పనిచేస్తున్న పాటక జనంతోనూ కలిసి అతనూ పని చెయ్యాలి. హువాయి నదికి కట్టుతున్న ఆనకట్ట విషయం ఆమెకు బాగా తెలుసు. ఆమెకు తెలిసిన స్త్రీల భర్తలెంతమందో అక్కడే పనిచేయడానికి బలవంతాన తీసుకుపోబడ్డారు.

ఈ పల్లెటూరు అరణ్యకంతా చాలా దూరంగా వుంది. ఇంట్లోకి వచ్చి అద్దంముందు పెట్టుకుని తల దువ్వుకోడం ప్రారంభించింది మూన్ సెంటు. బుజాలమీద పట్టేట్లు కత్తిరింపబడి, ముఖం ముందు గుబురుగా నిగనిగలాడు తున్న నల్లని జుట్టుని అద్దంలో చూసుకుందామె. తను పట్నంనించి తెచ్చుకున్న ఆ అద్దం చాలా కాలంకింద మధ్యకి పగిలింది. జిడ్డువోడుతున్న ఎర్రని దారంతో అద్దం ముక్కలయి పడిపోకుండా కట్టిందామె. ఇంత కాలం దాంతో కాలక్షేపం చేసింది కాని, ఆ రోజు అద్దానికి కట్టిన దారం తన ముఖానికి అడ్డురాకుండా ముఖం పైకీ కిందికీ తిప్పడం కష్టమనిపించిందామెకు. తను ఆ యింటికి కాపరానికి వచ్చిన తరవాత ఆ యింట్లోకి మంచి అద్దం ఒకటి వస్తే దాన్ని కాస్తా తన భర్త అతని చెల్లెలికి యిచ్చివేశాడు. తనేమో పగిలిపోయిన అద్దంతోనే తంటాలు పడుతోంది.

"వదినా, వదినా!" అని బయటనించి ఎవరో పిలిచారు. అది ఎవరో కాదు—ముసలి అత్త కోడలు గోల్డుహావ్ గారు.

"రా, రా! లోపలికి వచ్చి కూర్చో!" అని ఆమెను పిలిచింది మూన్ సెంటు.

"అన్న ఎక్కడ?"

"కట్టెలు తేవడానికి కొండమీదకు వెళ్ళాడు."

అన్న యింట్లో లేడని తెలుసుకుని నెమ్మదిగా గదిలో అడుగు పెట్టింది గోల్డుహావ్ గారు.

"తల దువ్వుకుంటున్నావా? అయ్యో! పాపం! అద్దం పగిలిపోయిందే" అందామె. అంతలో భరణం యిచ్చిన అద్దం సంగతి ఆమెకు జ్ఞాపకం వొచ్చింది.

"ఏదో ఒక రోజున నువ్వు చూస్ పల్లెకుపోయి ఆ అద్దం చూసి రావాలి సుమా! ఎంత బాగుంటుందను కున్నావది!" అని దగ్గిర ఎవరూ లేరు కదా అని అటూ యిటూ చూసి రహస్యంగా "నన్నడుగుతే ఆ అద్దం మీరు అట్టే పెట్టుకోవలసిందంటాను. మనకి తిండానికే సరిగా తిండిలేనప్పుడు భరణాలేమిటి! ఈ రోజుల్లో పెళ్లికూతుళ్లు పల్లకీల్లో ఊరేగడం మానేసి పెళ్లికి నడిచే వెళుతున్నారు. పదిమైళ్ళయినా సరే, యిరవై మైళ్ళయినా సరే నడుస్తూనే ఉన్నారు." అంది గోల్డుహాక్ గార్ట్. మూన్ సెంటు నవ్వింది. తనేమంత అదృష్టవంతురాలు కాకపోయినా పెళ్లయినాక అత్తవారింటికి పూలపల్లకీ యెక్కే వచ్చింది తను.

కోడలు మళ్ళీ అందుకుని "గోల్డుహాక్ వదిన కూడా పెళ్లికి నడిచే వెళ్లింది. రోజులు మారాయి. ఈ రోజుల్లో భరణా లెవరిస్తారు!" అంది.

కోడలు అమాయకపు మనిషనీ, తన భర్త అద్దం చెల్లెలికి యిచ్చినందుకు తన పక్షం తీసుకుని అతన్ని కోప్పడుతోందనీ గ్రహించి మూన్ సెంటు చిన్నగా నవ్వింది. కాని తన భర్త చెల్లెలికి పక్షపాతం చూపించాడనీ, తనను నిర్లక్ష్యం చేశాడనీ అందరూ అనుకుంటారేమోననీ ఆమెకు కొంచెం చిరాకు కలిగింది.

"గోల్డుహాక్ గార్ట్ వదినా!" అని ఆప్యాయంగా పిలుస్తూ "అవును, నువ్వు చెప్పినట్లు రోజులు మారాయి. అయితే చూడు! చూస్ యింట్లో మా వదిన ఒక్కతే కోడలు కాదుగా! మా వదినకంటె ముందు ఆయింటికి వచ్చిన కోడళ్లంతా ఏదో ఒకభరణం తెచ్చారు పుట్టింటినించి. రోజులు మారాయని చెప్పి మేము భరణం యివ్వకుండా పంపితే లోకులు ఏమను కుంటారు చెప్పు. ఆ యింట్లో ఆమెను చిన్నచూపు చూస్తారు!" అంది మూన్ సెంటు.

అవునన్నట్లు కోడలు తల ఊపింది కాని మూన్ సెంటు మాటలు ఆమెకేమీ నచ్చినట్లు లేవు.

"నచ్చేమో లేవు. నేను కాదనడానికి పరాయిదాన్నాయెను." అంది కోడలు రహస్యంగా మూన్ సెంటు చెవిలో.

మూన్ సెంటుకు కోపం వచ్చింది కాని పైకి ఆప్యాయంగా నవ్వుతూ "నేనున్నా లేకపోయినా ఫర్వాలేదులే. 'మీకున్నదల్లా ఒక్క చెల్లెలు. మనం ఎంత బీదవాళ్ళమైనా మీ చెల్లెలు పెళ్ళిమాత్రం బాగా చెయ్యాలి. అని నేను మీ అన్నయ్యతో చెబుతూండేదాన్ని. కష్టకాలంలో ఆవిడను యిచ్చేందుకు చేతిలో ఏమీ లేనిగోజుల్లో పెళ్లి జరగడం దురదృష్టం." అంది పెద్దగా.

ఉగ్గం పనికి మాలిన వస్తువులాగా, మంచి భరణం యివ్వడానికి చేతిలో డబ్బు లేనపుడు పెళ్ళి జరగడం దురదృష్టమని మూన్ సెంటు అన్న మాటలకి కోడలికి ఆశ్చర్యమే గాక, బాధకూడా కలిగింది.

తరవాత పల్లెలో ఉన్న ఆ మనిషి సంగతీ, యీ మనిషి సంగతీ అడుగుతూ కోడల్ని మూన్ సెంటు వేరే మాటల్లోకి దింపింది కాసేపు. మాటలు అయిపోయినాయి కాని యింకా ఏదో చెప్పదలుచుకున్నట్లు కోడలు కదలలేదు అక్కణ్ణించి.

"మా మామా, అత్తా నన్ను పెళ్లి నిన్ను అడగమన్నారు" కోడలి ముఖం ఎర్రబడ్డది సిగ్గుతో. మధ్య మధ్య ఆగుతూ "వాళ్లు నీకంటే పెద్ద వాళ్లు కదూ అందుకని వాళ్లే వచ్చి అడగడానికి భిడియపడి నన్ను పంపారు." అందామె.

ఆ ముసలి దంపతులు మూన్ సెంటు దగ్గర డబ్బు అప్పుతీసుకోవాలనుకున్నారు. పంట బాగానే పడింది. కాని పన్నులకింద పంటలో చాలాభాగం పోయింది. పన్ను ఒకసారే చెల్లించాలి గాని ఆ చెల్లించవలసిన పన్ను చాలా ఎక్కువగా ఉంటోంది. తేయాకు, పట్టు పురుగులూ, ప్రభుత్వానికి చాలా చౌక ధరకు అమ్మేశారు.

"ఈ సంవత్సరం మా జొన్నపొలం బాగా పండలేదు" అంది కోడలు.

"పండిన కొంచెం జొన్నలూ పరపతి సంఘం వారికి అమ్మేందుకు మా మామ పట్నం తీసుకువెళ్లాడు. అధికారి యింకా నిద్ర లేవక ముందే మామ పట్నం చేరుకున్నాడు. నిద్ర లేపడంవల్ల అధికారికి కోపం వచ్చింది. పడుకునుండగానే మామ ఒక జొన్నకంకు ఆయన చేతిలో పెట్టాడు. కప్పుకున్న దుప్పటిలోంచి తల బయటపెట్టి ఆ కంకును చూస్తూనే 'ఛ! ఛ! నాసిరకం!' అన్నాడా అధికారి."

"నిరాశతో మా మామ యింటికి తిరిగి వచ్చేశాడు. అంతలో మా వూరి ఒకతను వచ్చి అధికారి అప్పుడప్పుడు తనేం మాట్లాడుతున్నదీ తెలియకుండా మాట్లాడుతాడనీ, నాశిరకం అని తిరగకొట్టిన వాటినే మళ్లీ తీసుకు వెళ్లితే తీసుకుంటాడనీ, ఒకొక్కొక్కసారి మామూలుకన్నా వాటినే ఎక్కువ పసందు చేయటం కూడా జరుగుతుందనీ చెప్పాడు.

"మా ముసలి మామ కావడికి రెండు వేపులా జొన్నలు సెప్తమూటలుగా కట్టి, కావడి భుజాన వేసుకుని మళ్ళీ పట్నం వెళ్ళాడు. అప్పటికే జొన్నలు తీసుకువచ్చిన రైతులతో పరపతి సంఘం కచ్చేరి నిండిపోయింది. వాళ్లు తెచ్చిన ధాన్యం పరీక్షిస్తూ అధికారులు చాలా పనిలో నిమగ్నులై వున్నారు. వాళ్లల్లో ఒక అధికారి మా మామ పక్కకు వచ్చి జొన్నల్ని చూస్తూనే "నాశిరకం. తీసుకుపో! తీసుకుపో!" అంటూ వాటిని మళ్లీ ఇక్కడికి తీసుకురాకుండా వుండేందుకు ఒక బిందెడు ఎర్రటి నీళ్ళను ఆ తెల్లటి జొన్నలమీద కుమ్మరించాడు. ఎర్రనీళ్లు కుమ్మరించే అధికారం వాళ్లకు ప్రభుత్వం కొత్తగా యిచ్చిందిట.

"నీళ్లు కారుతూ ఎర్రగా వున్న ఆ జొన్నలను మా మామ వాళ్ల ఆఫీసులోంచి మోసుకువచ్చి, కావిడి ఎదురుగా పెట్టుకుని వంతెన పక్కన కూర్చున్నాడు. తన అవస్థను తలుచుకుని నిట్టూరుస్తూ రాత్రి పడేవరకూ అల్లాగే కూర్చున్నాడాయన. అంతలో గోల్డురూటు భుజాన కావడి వేసుకుని పరపతి సంఘం ఆఫీసులోనుంచి బయటకి రావటం ఆయన చూశాడు. గోల్డురూటు తీసుకు వచ్చిన జొన్నలు కూడా ఎర్ర నీళ్ళతో తడిసి వున్నాయి. జొన్నలలాగే అతని మొహంకూడా ఎర్రబారి వుంది. వంతెన దగ్గిర కొచ్చి కోపంతో జొన్నల్ని కాలవలో పారబోశాడతను."

"ఏమిటి చేస్తున్నావు. నలుగురూ చూస్తారు. పారపొయ్యకు." అన్నాడు మా మామ. గోల్డురూటు వెనకాలే వొచ్చిన ఒక అధికారి అది చూసి "ఏమిటి చేస్తున్నావు? ఎవరిని నిందించడానికి నువ్వు యీ పని చేస్తున్నావు?" అని అరిచాడు.

"అవి యిక పనికిరావు కాబట్టి కాలవలో పారబోశాను. మీరు అక్కరలేకపోతే యింకెవరికన్నా అమ్ముకునేవాణ్ణి. ఎర్రనీళ్లు పోసి వాటిని పాడుచేస్తే ఎవరు కొంటారు?" అని కేక పెట్టాడు గోల్డురూటు."

"నువ్వు ఏం చెయ్యతలచుకుందీ నాకు తెలుసులే. గోలచేసి ప్రభుత్వం దగ్గరనుంచి నష్టపరిహారం పొందాలని చూస్తున్నావు. అవునా కాదా! నీ సంగతి నాకు బాగా తెలుసు. ఏయ్! ముసలాడా! నువ్వేం చేస్తున్నావు?' అని అరిచాడు ఆ అధికారి."

ఈ కథంతా విని "నాకీ సంగతి మీ అన్న చెప్పలేదే!" అంది మూన్ సెంటు.

"మా అన్నకి అప్పుడు చాలా కోపమొచ్చింది" అంది కోడలు.

తరవాత ఆ వూళ్ళోవాళ్ళంతా సైనికులకు బూడ్సులు కుట్టిన విషయం చెప్పింది కోడలు. "ప్రతి కుటుంబం యాభై, అరవై జతలు కుట్టాలి. రాత్రింబగళ్ళు కష్టపడి అందరూ కుట్టారు. బూడ్సుల ఎత్తు మడమలు మైనం పూసిన గట్టిదారంతో కుట్టి కుట్టి నా చేతివేళ్లు రక్తమయమైనాయి. పైన వేయడానికి గట్టి గుడ్డకూ, లోపల వెయ్యడానికి సన్నని గుడ్డకూ అయే డబ్బు అధికార్లు యివ్వాలి.

"కానప్పు (కరణం) ప్రతియింటికీ వెళ్లి పనిచురుగ్గా సాగుతోందో లేదో చూసేవాడు. చురుగ్గా పనిచేసేవాళ్ళను మంచిమాటలాడి వాళ్ళచేత యింకో యిరవై జోళ్లు యెక్కువ కుట్టించేవాడు. 'మడమలు గట్టిగానూ, బలంగానూ వుండేట్లు చూడండి. అమెరికా రాక్షసులతో పోట్లాడడానికి కొన్ని వేల మైళ్ళ దూరంలో వున్న కొరియాకు యీ బూడ్సులు తొడుక్కునే పోతారు మన సైనికులు. ఆ అమెరికను బూర్జువాలను యాలూనది ప్రాంతాలనించి మనం తరిమివెయ్యకపోతే యిక్కడికి మన గుమ్మాల దాకా వస్తారు వాళ్లు. రాగానే ఏం చేస్తారో తెలుసా! మీ భూములను స్వాధీనపరుచుకుని ఆక్రమిస్తారు" అని కరణం చెప్పేవాడు.

కరణం వెళ్లిపోయాక "తెలివి తక్కువ పెద్దమ్మ! అమెరికా రాక్షసులు మన పల్లెలకు ఎన్నటికీరారు. కరణంగాళ్లు ఉన్నదంతా తీసుకుని మనల్ని అష్టదరిద్రుల్ని చేశాక మన దగ్గిర ఏం బావుకుందామని వస్తారు వాళ్లు?" అనేది ముసలి అత్త.

పల్లెటూరి ప్రజ బూడ్సులు కుట్టి యిచ్చాక, ప్రథమశ్రేణి సైనికులకు సహాయమనో, యింకేదో అనో డబ్బు వసూలు చేయడానికి వచ్చేవాళ్లు కరణాలు. 'విమానాలకూ, మరఫిరంగులకూ వసూళ్లు' అంటూ చాప్ గ్రామానికీ, మన గ్రామానికీ పోటీపెట్టడం అన్నిటికన్నా అన్యాయం.

కరణాలు చేసిన పనులనూ, మాట్లాడిన మాటలనూ కోడలు సరిగా చెప్పలేక పోయిందిగాని క్రిందటి రాత్రి గోల్డురూటు చెప్పినదానికంటె ఎక్కువ వివరాలతో మూన్ సెంటుకు వర్ణించి చెప్పిందామె. ఈ విషయాలు గోల్డురూటుకు సరిగా అవగాహన కాక పోవటంవల్ల అతను విపులంగా చెప్ప లేక కప్పదాట్లు వేశాడు.

"వదినా! నేను యిప్పుడు నీకు చెప్పిన సంగతులు ఏవీ మళ్ళీ అన్నయ్యతో అనబోకుసుమా! మా అత్తా మామలతో కూడా అనకు. నేను నీకు యీ సంగతులన్నీ చెప్పానని వాళ్ళకు తెలిస్తే వాళ్ళ ప్రాణాలు పైనే పోతాయి" అంది కోడలు మూన్ సెంటుని హెచ్చరిస్తూ.

గోల్డురూటు అవసర్ల కృషీవలుడు కావటంవల్ల అతన్ని చూస్తే ఆ పల్లెలో అందరూ భయపడతారని మూన్ సెంటుకు తెలుసు. "ఈ ప్రాంత పరిస్థితులు యిట్లా వున్నాయని నాకు తెలిసివుంటే నేను యిక్కడికి రానే పోదును" అని నిట్టూరుస్తూ తన అవస్థల్ని గురించి కోడలికి చెప్పింది మూన్ సెంటు.

"నేను పట్నంలో సంపాదించేదానిమీదే మా కుటుంబం ఆధారపడి ఉంది. అక్కడ నేను నా సంపాదనలోంచి బట్టలూ, కాళ్ళకు జోళ్ళూ, మేజోళ్ళూ, పరుపూ, పక్కా అన్నీ కొనుక్కోవాలి. పైగాను పట్నంలో అన్నిటి ధరలూ విపరీతంగా మండిపోతుంటాయి. ఇంక కూడ బెట్టేందుకు ఏమి మిగులుతుంది చెప్పు!" అంది మూన్ సెంటు.

"ఎట్లా అయినా మాకంటే నయమేలే" అంటూ కోడలు దగ్గరగా వచ్చి మూన్ సెంటు చెవిలో "బీదవాళ్ళకు భాగ్యవంతులు ఆధారమనీ, భాగ్యవంతులకు దేవుడు ఆధారమనీ అంటారు. వెనకటి రోజుల్లో కరువు కాటకాలు వచ్చినపుడు పాటకజనం భూకామందులను అడిగి అప్పు తెచ్చుకునేవారు" అని కోడలు చెబుతూ వుండగా బయట తలుపు చప్పుడయింది. ఎవరు వచ్చిందీ చూడడానికి కోడలు బయటకు వెళ్ళింది.

కట్టెలు తీసుకుని గోల్డురూట్ వచ్చాడు. అతని భుజాన వేలాడు తున్న కావడికి రెండువేపులా ఆకులతో వున్న కొమ్మలు మోపులు ఎత్తుగా పేర్చబడి వున్నాయి. చెదరిపోయిన రెక్కలను పరుచుకుని మరికగా వున్న ఒక పెద్ద పక్షి అతని భుజంమీద కూర్చున్నదా అనిపించిందా దృశ్యం. చాలాసార్లు ప్రయత్నించి, నెమ్మదిగా పక్కకు తిరిగి కావడిని మోసుకుని తలుపులోంచి లోపలికి వచ్చాడు గోల్డురూటు.

అతను లోపలికి రాగానే కోడలు వెళ్లిపోయింది. ఆ రోజు పొద్దున్న నించీ ఊళ్లోవాళ్లందరూ మూన్ సెంటుని చూడడానికి వచ్చి వెళుతూ డబ్బు బదులివ్వమని అడిగారు. వాళ్లడిగింది స్వల్పమే అయినా ఆమె యిస్తుందన్న ఆశలేదు వాళ్లకు. ఇవ్వకపోతే యివ్వలేదన్న కోపమూలేదు.

మూన్ సెంటుకు భయమేసి "ఊళ్లో అందరూ వచ్చి నన్ను డబ్బు అప్పు అడగడం చూసి, నేను చాలా డబ్బు మూటకట్టుకు వచ్చాననుకుంటారేమో నువ్వు:" అంది భర్తతో.

"ఎప్పుడూ అంతే. పట్నంలో ఉండి తిరిగి వచ్చిన వాళ్లంతా డబ్బు మూటకట్టుకు వచ్చారనే అనుకుంటారు యిక్కడి వాళ్లంతా" అన్నాడు గోల్డురూటు తన వూరివాళ్ళను సమర్థిస్తున్నట్లుగా.

"మనకు సరిపోయే బియ్యం నీళ్లలో కడిగి మధ్యాహ్నం భోజనానికి వండు అన్నాడు గోల్డురూట్.

"మనం బియ్యం పొదుపుగా వాడుకోవాలి. కొంచెమే వున్నాయి. జాగ్రతగా వాడుకోక పోతే వసంతం గడవదు." అంది మూన్ సెంటు.

"రోజూ తింటామూయేం! ఎప్పుడో ఓ రోజేగా!"

"ఇవాళ సంవత్సరాది పండగా కాదు, నే పుట్టిన రోజూ కాదు. ఎందుకు యివాళ వరి అన్నం వండుకోవడం!" అంది మూన్ సెంటు నవ్వుతూ. ఆమె ఊరికి వచ్చిన మొదటి రోజు కావడంవల్ల ఆ రోజు పండగే అని అతని నోట చెప్పించడం ఆమెకు యిష్టం.

"పండగ కాకపోతే పోయింది. నేను వరి అన్నం తిని చాలా రోజులయింది. ఇవాళ వరి అన్నం తినాలని ఉంది." అన్నాడు గోల్డురూట్ యేం చెప్పడానికీ తోచక.

చివరికి మూన్ సెంటు ఒప్పుకుంది. కాని బియ్యం తియ్యడానికి మట్టి జాడీలో చెయ్యిపెట్టినపుడు, సరిపడినన్ని బియ్యం తియ్యడానికి యిష్టం లేకపోయిందామెకు. కొద్దిగా బియ్యంతీసి కుండనిండా చిక్కని గంజి కాచిందామె.

భోజనాలకు కూర్చునేముందు "మనం యింత సుఖంగా భోజనం చెయ్యడం చూస్తే, మన దగ్గిర చాలా డబ్బు వుందనుకుని అప్పులివ్వమని అందరూ ఎగబడతారు." అని అంటూ గోల్డురూట్ బయటతలుపు మూసి గడియవేసి వచ్చాడు.

"ఇదేమిటి! పట్టపగలు తలుపులు బిగించుకుంటే చూసేవాళ్లు ఏమను కుంటారు! పొట్టలు పగిలేట్లు నవ్వుతారు." అంది మూన్ సెంటు.

ఎంతో చలిగా వున్న రాత్రిళ్లు కూడా పడుకోబోయేవరకూ తలుపులు మూయడం అక్కడి ఆచారం కాదు.

గోల్డురూట్ తలుపుదగ్గరగా నిలబడి, బయట ఏదైనా చప్పుడవు తుందేమోనని వింటూ భోజనం చేస్తున్నాడు. అంతలో ఎవరో వస్తున్నట్లు గ్రహించి మనిషి బిగుసుకుపోయి "ఆ గిన్నెలన్నీ అక్కడనించి తీసెయ్యి. కామ్రేడ్ వోంగ్ వస్తున్నాడు." అన్నాడు గోల్డురూట్.

అప్పటికే బయటనించి ఎవరో వాళ్ళకు తెలియని భాషలో "గోల్డు రూట్ ఉన్నాడా?" అని కేక పెట్టారు.

గోల్డురూటు తన చేతిలో ఉన్న గిన్నెను విసురుగా భార్యచేతి కిచ్చి సావిట్లోకి పరిగెత్తాడు. మూన్ సెంటు భర్త యిచ్చిన గిన్నెనూ, తన గిన్నెనూ దోమతెర చాటుగా మంచంమీద దిళ్లకు ఆనించి పెట్టింది. ఆమె జాగ్రతగా వుంచకపోతే ఆ గిన్నెలు బోర్లపడి వాటిలోగంజి పక్కమీదను వొలికే ప్రమాదం ఉంది. కూతురిని చూసి ఆపిల్ల చేతిలోవున్న గిన్నెకూడా యివ్వమని అడిగింది. బలవంతాన లాక్కుంటే వేడిగంజి ఆ పిల్ల చేతుల మీద పడి చేతులు కాలిపోవచ్చు. ఇంతలో ఆమె భర్త కామ్రేడ్ వోంగ్‌తో లోపలికి వచ్చాడు.

వోంగ్‌కు నలభై ఏళ్లు దాటివుంటాయి. నెత్తిమీద టోపీ ఉంది. పల్చని ముఖం. నలభై ఏళ్లు ఉన్నట్లు కనబడడు. మెతక గుడ్డలు వేసుకో వడం వల్ల అతను ఉన్నదానికంటే ఎక్కువ లావుగా కనిపిస్తాడు. పటకా నడుంకి బిగించి కట్టుకోవడం వల్ల రొమ్ము పైకి పొడుచుకు వచ్చింది. మంచి చురుకైన మనిషిలాగుంటాడతను.

"ఈవిడేనా గోల్డ్‌రూట్ వదిన! కానీండి, భోజనాలు కానియ్యండి. నేను వేళ కాని వేళ వచ్చాను." అన్నాడు కామ్రేడ్ వోంగ్.

భోజనం చెయ్యమని అతను వాళ్ళని బలవంత పెట్టాడు. బెకన్ చేతిలో గిన్నెను భయభయంగా కుర్చీమీద పెట్టింది.

"కానీ, చల్లారి పోతుంది. బాగా పొడుగు ఎదిగావే!" అన్నాడ తను ఆ పిల్లను నవ్వుముఖంతో చూస్తూ.

బెకన్ని అతను రెండుచేతులతో పైకెత్తాడు. అట్లా ఎత్తడం తనకు ఉత్సాహంగా వున్నా మూతి ముడుచుకునే వుంది ఆ పిల్ల.

"కామ్రేడ్ వోంగ్ ! కూర్చోండి !" అని ఆదరంతో చెపుతూ కుంపటి దగ్గరకు పరిగెత్తి ఒక గిన్నెనిండా వేడినీళ్లు పోసుకు వచ్చింది మూన్ సెంటు.

"తేయాకు లేదు. ఈ వేడినీళ్లు తాగండి" అంటూ గిన్నె అతని కందించిందామె.

"వదినా! అవస్థపడకమ్మా! నన్ను పరాయివాడిగా అనుకోకు!" అంటూ కుర్చీలోంచి కొంచెం లేచి వేడినీళ్ల గిన్నె అందుకొంటూ "నిన్న రాత్రేకదూ వొచ్చావు. ప్రయాణంలో బాగా అలిసిపోయి ఉంటావను కుంటాను" అన్నాడు వోంగ్.

షాంగాయ్ అధికారులు తనకిచ్చిన అనుజ్ఞాపత్రం మూన్ సెంటు అతనికి చూపించింది. అతను ఆ పత్రం చదువుతూ "సరేలే! మంచిదే! పొలంపని చూసుకునేందుకు పల్లెటూరికి వచ్చావన్నమాట" అంటూ ఒక కాలు ఎత్తి కుర్చీమీద పెట్టి రైతులు కూర్చునేలాగా కూర్చున్నాడు.

"వదినా! ఈ దేశమంతా చాలా మారిపోయింది కదూ! వెనక నువ్వు చూసినప్పటికీ యిప్పటికీ చాలా మార్పు వచ్చింది. బీదవాళ్లు కొంచెం తేరుకున్నారు. ఇప్పటి ప్రభుత్వం ప్రజా ప్రభుత్వం. అంతా మనదే. నువ్వేమైనా చెప్పుకోవలసి ఉంటే మాతో చెప్పవచ్చు. ఏం భయపడనక్కర లేదు. ఇప్పుడు ప్రజలదే పైచెయ్యి" అన్నాడు వోంగ్ ఆ ఆజ్ఞాపత్రం చూస్తూ.

మూన్ సెంటును పొగుడుతూ "నువ్వు వచ్చేయడం చాలా మంచి పని. మీ రిద్దరూ కలిసి పంట బాగా పండించవచ్చు. పంటలు బాగా పండుతూ వుంటే చదువు విషయం కూడా చూసుకోవచ్చు. ఇప్పుడు చలి కాలంలో అట్టే పొలంపని వుండదు కనుక అందరూ స్కూళ్లకు వెళతారు. పట్నంలో స్కూళ్ళనించి చిన్న చిన్న ఉపాధ్యాయులు వచ్చి యిక్కడ చలి కాలం స్కూళ్లలో పాఠాలు చెపుతారు. వదినా! యీ రోజుల్లో స్త్రీలు, పురుషులు అంతా సమానమే. మీ రిద్దరూ ఒకర్ని మించడానికి ఒకరు ప్రయత్నించాలి. అతను ఆదర్శ కృషీవలుడు కనుక నువ్వు ఆదర్శ విద్యార్థినివి కావాలి" అన్నాడు కామ్రేడ్ వోంగ్. ఆ మాటలకి అందరూ నవ్వారు.

కొంచెంసేపుండి వోంగ్ వెళ్ళిపోయాడు. మూన్ సెంటు, ఆమె భర్తా తలుపుదాకా వెళ్ళి అతన్ని సాగనంపారు. వెనక్కి తిరిగి ఇంట్లోకి రాగానే "కామ్రేడ్ వోంగ్ నిజంగా చాలా మంచివాడు. నీళ్ళయినా ముట్టుకో లేదు. వెనకటి అధికార్లు అది కావాలి, యిది కావాలి అని తంటాలు పెట్టేవాళ్ళు. ఇంట్లోకి వచ్చారా అఖరికి ఒక కోడిపిల్లనైనా చంపి, కూర వండి భోజనం పెట్టితేగాని వెళ్ళేవాళ్ళు కారు" అంది మూన్ సెంటు.

ఇదివరకు ఏ పరాయి మగవాడూ ఆమెతో అంత చనువుగా, అంత కులాసాగా మాట్లాడలేదు. మంచి చెడ్డలు విచారిస్తూ, ఒక ఆడదానితో మాట్లాడుతున్నట్లు గాక స్నేహితుడితో ముచ్చటిస్తున్నట్లు అతను ఆమెతో మాట్లాడాడు. అతనిమీద ఆమెకు చాలా మంచి అభిప్రాయం కలిగింది.

"కామ్రేడ్ వోంగ్ చాలా మంచి మనిషి" అన్నాడు గోల్డురూటు.

గంజితో నిండిన గిన్నె వోంగ్ కంటపడ్డందుకు భర్త విచారంగా ఉన్నట్లు మూన్ సెంటు కనిపెట్టింది.

బెకన్ తన గిన్నెను యివ్వకుండా గట్టిగా పట్టుకుందనీ, వేడిగంజి ఒలికి పిల్లచేతులు కాలిపోతాయేమోనన్న భయంతో తాను బలవంతాన గిన్నెను లాక్కోలేదనీ మూన్ సెంటు చెప్పింది.

"తప్పంతా నీదే! గిన్నెనిండా గంజి పొయ్యమని నువ్వే బలవంతం చేశావు" అంది ఆమె కోపంగా.

"నువ్వు నా మాటవిని అన్నమే వండినట్లయితే యిబ్బందే లేక పోయేది. గంజిలాగా అన్నం వొలకదుగా!" అన్నాడు గోల్డురూట్.

"అయితే తప్పంతా నాదేనంటావు. అన్నం తినాలని ఉందని చెప్పి వండమన్నది నువ్వు, అతను చూశాడేమోనని భయపడేదీ నువ్వే?" అంది మూన్ సెంటు.

"నేను శుభ్రమైన అన్నం తినాలనుకున్నాను గాని, బంకలాగున్న యీ గంజి తాగుతాననలేదు."

"అయితే గంజి తాగడం మానెయ్యి. నిన్ను ఎవరు బలవంత పెట్టారు?"

మూన్ సెంటు చల్లారిపోయిన గంజిని కుండలో పోసి మళ్ళీ వెచ్చ చేసింది. గోల్డురూట్ తనవంతు గంజి మాట్లాడకుండా తాగాడు.

భోజనాలయినాక గుడ్డలు ఉతికేటందుకు మూన్ సెంట్ కాలవకి వెళ్లింది. నీళ్ళదగ్గర రాతి మెట్టుమీద కూర్చుని కర్రతో గుడ్డలను బాదుతూ ఉంటే అవతల గట్టుమీద ఉన్న కొండలమీదనించి డప్పు వాయిస్తున్నట్లు శబ్దం వినిపించింది. పెళ్ళయిన కొత్త రోజుల్లో బట్టలుతకడానికి తను కాలవకు రావడం జ్ఞాపకం వచ్చిందామెకు. కొండలలోంచి వినపడే చప్పుడు తను బట్టలుతికే చప్పుడుకు ప్రతిధ్వనేనని ఆమె నమ్మలేకపోయేది. కొండపైన ఉన్న చెట్ల గుబురుల్లో ఏదో జరుగుతోందనుకునేది ఆమె. దేవతలు ఒకరితో ఒకరు పోట్లాడుకుంటున్నారేమోనని భయపడేది.

ఆమె దగ్గరగా కాలవలో రెండు బాతులు యీదుతున్నాయి. లేత ఆకుపచ్చని నీళ్లలో గుడ్డపీలికలలాగా వాటి పసుపు పచ్చని కాళ్లు తేలుతున్నాయి.

"అమ్మా! అమ్మమ్మ వచ్చింది!" అని దూరాన్నించి అరుచుకుంటూ బెకన్ వచ్చింది.

మరుసటి రోజు తనే వాళ్లమ్మను చూడడానికి వెళదామనుకుంది మూన్ సెంటు. కాని తను వచ్చిన సంగతి విని, తనను చూడాలన్న ఆదుర్దాతో ఆమే బయలుదేరి వచ్చినట్లుంది. తను వచ్చిన పడవమీద తన పుట్టింటి వాళ్ళవూరి మనుషులిద్దరు కనపడ్డారు. వాళ్లు తను వస్తున్న సంగతి తన తల్లికి చెప్పివుండాలి.

గుడ్డలు పిండి, బెకన్ని వెంటపెట్టుకుని త్వరత్వరగా యింటికి వెళ్లింది మూన్ సెంటు.

గోల్డయూట్ ఆమె తల్లితో మాట్లాడుతున్నాడు. మూన్ సెంటుని చూస్తే ఆమె తల్లికి ఏమంత యిష్టంలేదు. కాని ఒకప్పుడు కను చూసుకుని కొన్ని ఏళ్ళపాటం తరువాత కలుసుకోగానే యిద్దరికీ దుఃఖం వచ్చింది. తల్లి బాగా ముసలిదైంది. వాళ్ళ కుటుంబంలోనూ, బంధువుల్లోనూ ఆ మధ్య సంభవించిన జననాలను గురించీ, మరణాలను గురించీ, వివాహాలను గురించీ యిద్దరూ మాట్లాడుకున్నారు. నొప్పులు కష్టపడి చచ్చిపోయిన ఒక బంధువు సంగతి తల్లి చెప్పింది. దెయ్యాలు కొందరు అతన్ని వెదురుకట్టె కర్రలతో కొట్టడంవల్ల అతను నొప్పులు కష్టపడ్డాడు. ఆ కథ చెప్తూ ఆమె తల్లి ఆగి "మీ కామ్రేడ్ వోంగ్ మంచివాడే" అన్నది.

కూతురూ, తల్లీ ఏకాంతంగా మాట్లాడుకోనీమని గోల్డురూటు బయట వసారాలోకి వెళ్లి పైపు తాగుతూ నుంచున్నాడు. తల్లి కూతుర్ని డబ్బు అప్పు అడుగుతుందని అతనికి రూఢిగా తెలుసు. తల్లీ, కూతురూ మాట్లాడుకుంటూ చాలా సేపు గదిలో కూర్చున్నారు.

అక్కడినించి ఆ ముసలావిడ బయలుదేరేటప్పుడు ఆమెను సాగనంపటానికి కూతురూ, అల్లుడూ ఊరి చివరదాకా వెళ్ళారు. తెల్లగా, పచ్చగా ఉన్న వెదురు పొదల్లోంచి చలిగాలి వీస్తోంది. ముసలావిడ రోడ్డు మలుపు తిరిగి కనపడకుండా వెళ్ళేంతవరకూ బెకన్! చేతులు పట్టుకుని భర్తా, భార్యా ఆమెను చూస్తూ నిలబడ్డారు. తన దగ్గిర ఉన్న డబ్బంతా తల్లికి తన భార్య అప్పు యిచ్చిందనీ, అట్లా యిచ్చినందుకు ఆమె విచారిస్తున్నదనీ గోల్డురూట్ గ్రహించాడు.

# ఆయిదో ప్రకరణము

భర్త దగ్గిరకి వచ్చిన వారం రోజుల్లో మూన్ సెంటు పల్లెటూరి జీవితానికి అలవాటు పడ్డది. తను ఎప్పుడూ ఆ పల్లె వదిలి వెళ్లినట్లే లేదు ఆమెకి.

గోల్డురూట్ వాకిట్లో నిలబడి వెదుళ్లు సగానికి చీల్చి ముక్కలు ముక్కలుగా నరుకుతున్నాడు. అన్నిటినీ ముక్కలుం చేసి కొంచెం విశ్రాంతి తీసుకున్నాడతను. ఇంట్లోనించి రెండు బుట్టలు తీసుకువచ్చి పైపు తాగుతూ వాటికి ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడు. ఆ బుట్టల మీద అందంగా తెల్లా, పచ్చా రంగులలో చదరాలు గీయబడ్డాయి.

తరవాత అతను నేలమీద కూర్చుని చీల్చిన వెదురు బద్దలతో ఆ బుట్టలకు కొక్కాలు చేశాడు. ఒళ్లంతా చెమటలు పోయడంవల్ల చొక్కా విప్పేసి కుర్చీమీద దాన్ని మడిచిపెట్టాడు.

కొండమీదకు వెళ్లిన బంధువొకడు ఎనిమిది, తొమ్మిది అడుగుల పొడుగున్న వెదురు బొంగుల మోపు ఒకటి మోసుకువచ్చాడు. ఇంటి ముందుకు రాగానే అతను ఆ మోపును గభీమని కిందపడేశాడు. గోల్డురూట్ తల ఎత్తి చూడనే లేదు.

మూన్ సెంట్ యింట్లోంచి వచ్చి చూరుకింద కూర్చుని గోల్డురూటు విప్పిన చొక్కాకి చిరుగులు కుట్టుతోంది. భార్యా భర్త లిద్దరూ సూర్యు

డికి ఎదురుగా కూర్చున్నారు. గోల్డురూట్ మీద ఎండ బాగా పడుతోంది. సూర్యుడు నెమ్మదిగా మబ్బుల్లోకి పోయి మళ్ళీ బయటకి వస్తున్నాడు. భూమి మీద ఒకసారి ఎండ, ఒకసారి నీడ పడుతోంది. వాళ్లు నోరు విప్పి ఒక మాటైనా మాట్లాడుకోలేదు.

ఎండ పడటం వల్ల మాన్‌సెంటుకు నడుందగ్గర చిటపట లాడి జాకెట్టు పైకి లాగింది. పసుపు పచ్చగా వున్న శరీరం ఎర్రబడేట్లు గోకి, అంతలో ఏదో అనుమానం తగలడం వల్ల భర్త చొక్కా తీసి దానిని బాగా పరిచి పరీక్షించిందామె. అందులో ఏమీ కనబడలేదు. చొక్కా చేరెమ్మో కటి వెనకకు తిప్పి చిరుగు కుట్టడం ప్రారంభించింది మాన్‌సెంటు.

గోల్డురూట్ ఒక బుట్టకు కొక్కెం అల్లడం పూర్తిచేసి, బుట్టలో కాలుపెట్టి, కొక్కెం పట్టుకుని బుట్టను పైకెత్తి చూశాడు, కొక్కెం వూడకుండా బలంగానే వుంది. ముసలి మాకు చొక్కా తొడుక్కుంటూ తొందరగా వొచ్చాడు. కొత్తబుట్ట చూడగానే అయన ఒక కాలు బుట్టలో పెట్టి కొక్కెం ఎంత గట్టిగా వుందో పరిక్ష చేశాడు. కొక్కెం ఊడడ కుండా గట్టిగా ఉన్నందుకు తృప్తిపడి మాట్లాడకుండా వెళ్ళిపోయాడతను. ఇంకా కొంతమంది బంధువులు ఒకరి తరవాత ఒకరు బుట్టలో కాలుపెట్టి కొక్కెం గట్టిగా వున్నదీ లేనిదీ పరీక్షించారు. గట్టిగా ఉందని తెలుసు కుని మాట్లాడకుండా వాళ్లూ వెళ్లిపోయారు.

మాన్‌సెంటు యింట్లోకి వెళ్లి గిన్నెలూ, అన్నంతినే పుల్లలూ తీసుకు వచ్చి వాటిని అరుబైట బల్లమీద పెట్టింది. బల్లమీద ఒక వేపున గిన్నెలో ఉప్పులో ఊరవేసిన ఊరగాయ ముక్కలూ, యింకోవేపు పొడుగాటి కొయ్యతొట్టెలో వరి గంజీ వున్నాయి. ఎక్కడినించో చెకన్ పరిగెత్తు కొచ్చి బల్లదగ్గర నుంచుంది.

"ఏయ్! రా! భోజనం చేద్దాం రా!" అని కూతురిని పిలిచాడు గోల్డురూట్. అతను పిలవడం నిజానికనవసరం. ఆ పిల్ల భోజనానికి కూర్చో డానికి ముక్కాలుపీట తీసుకునే వచ్చింది. గోల్డురూట్ ఊరగాయముక్క ఒకటి పుల్లలతో తీసి కూతురి గిన్నెలో పెట్టాడు.

మాన్‌సెంటు ఊరగాయ ముక్కలు ముట్టుకోలేదు. గుచిగిలవాటి కోసం ఎగబడడం తిండికి మొహంవాచినట్లు ఉంటుంది. భర్త తన గిన్నెలో

గి-జి మళ్లీ పోసుకునేందుకు తల తిప్పినపుడు త్వరగా రెండు ముక్కలు తీసుకుంది మూన్ సెంటు.

బల్లకింద ఏమైనా పడుతుందేమోనని పసుపు పచ్చని కుక్కవొకటి గోల్డురూట్ కూర్చున్న కుర్చీకింద కూర్చున్నది. దాని బొచ్చుతోక గోల్డు రూట్ వీపు వెనకాల అతని తోకలా కనపడుతోంది.

ముసలి అత్త ఆవైపు వొచ్చింది. ఏం తింటున్నారో అని వొంగి చూసి మాట్లాడకుండా వెళ్లిపోయింది. ఇప్పుడా ముసలావిడ మూన్ సెంటుతో యిదివరకంత చనువుగా వుండటం లేదు. తనను ఎప్పుడూ సాధిస్తూ వుంటుందనీ, తనకు ప్రతి విషయంలోనూ అన్యాయం చేస్తోందనీ, కోడలు మూన్ సెంటుతో తనమీద చాడీలు చెప్పిందని ఆమెకు అనుమానం కలిగింది.

నల్లసిరాతో గీసిన బొమ్మల పటాలు కొన్ని తెల్లటి గోడమీద ఎత్తుగా వేలాడుతున్నాయి. విసనకర్ర ఆకారంలో వున్న ఒక చట్రంలో పూలమొక్కల బొమ్మలూ, ఒక చదరపు చట్రంలో పుట్టలోంచి తల బైటికి పెట్టిన పాము, వీణె చిత్తరువులు వున్నాయి. ఆ పటాలలో వున్న బొమ్మలకూ, ఆయింట్లో ఉన్న వాళ్ళ జీవితాలకూ ఎటువంటి సంబంధం లేదు. గోడమీద ఉన్న పటంలోని బొమ్మగీసి యాభైఏళ్ళయిందేమో! యెండకు యెండీ, వానకు తడిసీ అది వెలిసిపోయింది. పగటిపూట చంద్రుడిలాగా బొమ్మ కనపడీ కనపడకుండా వుంది.

మొదట గోల్డురూట్ భోజనం పూర్తయింది. కావలసి కుర్చీ భార్య వేపు తిప్పుకుని పైపు తాగుతూ కూర్చున్నాడతను.

# ఆరో ప్రకరణము

కోడలు గోల్డుహోవ్ గాట్ బట్టలుతికి వాటిని గతుకులుగా వున్న ఒక రాయిమీద పెట్టింది. ఆ సరిహద్దు రాయిమీద కొన్ని అక్షరాలు చెక్కి ఉన్నాయి. ఒక అడుగువెత్తున ఇంటి బయట ఉందారాయి. దానిమీద పెట్టిన తెల్లని చిరిగిపోయిన గుడ్డలు గాలికి కొట్టుకుంటున్నాయి.

కామ్రేడ్ వోంగ్ యూనిఫారం వేసుకున్న యింకో మనిషిని వెంటబెట్టుకుని ఆమెదగ్గరకు వస్తూ "గోల్డుహోవ్ గాట్ వదినా! నీ భోజనం అయిందా?" అని అడిగాడు. కోడలు తలయెత్తి కామ్రేడ్ వోంగ్‌ని

చూసి కొంచెం కలవరపడ్డది. అతన్ని చూస్తే ఆమెకెందుకో భయం. భయంతో ఆమె యేం మాట్లాడుతుందోనని వోంగ్ యెప్పుడూ జంకు తూనే ఉంటాడు. ఇవాళ మాత్రం కోడలు సరిగానే జవాబు చెప్పింది.

"నీ భోజనం కూడా అయిందా?" అని చిరునవ్వుతో అతన్ని పల కరించిందామె.

ఆవిడ మాటలు వినిపించుకోకుండా "మంచిది, మంచిది. నీ మామ యింట్లో ఉన్నాడా?" అని పెద్దగా అరుస్తూ అడిగాడు వోంగ్.

"కామ్రేడ్ వోంగ్ వచ్చాడు" అని అరుస్తూ ఆమె యింట్లోకి వెళ్లి పోయింది.

ముసలి అత్తా, మామా నవ్వు ముఖాలతో యింట్లోంచి బయటకు వచ్చారు. తనతో వచ్చిన యూనిఫారంలో వున్న మనిషిని వాళ్ళకు పరి చయం చేశాడు వోంగు.

"ఈయన కామ్రేడ్ కు. పల్లె పట్టున స్థితిగతులు ఎట్లా వున్నాయో తెలుసుకునేందుకు ఈయన షాంగాయ్ పట్నంనించి వచ్చాడు. మీ యింట్లో వుండి మీరెట్లా బ్రతుకుతున్నారో అట్లాగే తనూ బ్రతకాలని ఈయన కోరిక" అన్నాడు వోంగ్.

కామ్రేడ్ 'కు' ని ఆదరంతో ఆహ్వానించారా దంపతులు. అతనికి యింకా ముప్పైఏళ్లు నిండలేదు. గంభీరంగా కనపడతాడు. నల్లని చట్రం వున్న కళ్లజోడు పెట్టుకున్నాడు. నల్లని అతని కనుబొమ్మలు ఆ చట్రం నలుపుతో కలిసిపోయాయి. తను సినిమా దర్శకుడననీ, రచయిత ననీ, కార్మిక సాహిత్య కళాసంస్థవారు సినిమాకథ కోసం పల్లె జీవితంలోని అనుభవాలు తెలుసుకుని, కథా సామగ్రి సేకరించేందుకు తనను పంపారనీ అతను చెప్పాడు.

కామ్రేడ్ వోంగ్ పరిచారకుడు కామ్రేడ్ స్మాల్ ఛాంగ్ ఒక కావడిలో "కు" సామాను మోసుకుని ఒగర్చుకుంటూ వాళ్ళ వెనకాలే వొచ్చాడు. తన సామాను తనే యింటిలోపల పెట్టుకుంటూన్నాడు. కామ్రేడ్ 'కు.' వద్దనీ, సామాను లోపల పెట్టడం తన పని అనీ అడ్డు పడ్డాడు ఛాంగ్. కామ్రేడ్ 'కు' సామాను ఛాంగ్ చేతుల్లోంచి లాక్కోవ డానికి చాలాసార్లు ప్రయత్నించాడు. 'కు' తో "అయ్యా! మీపని మీరు చూసుకోండి. ఇది నాపని, నేనే చేస్తాను" అని చెపుదామా అనుకున్నాడు ఛాంగ్.

భూ సంస్కరణలు జరిగే రోజుల్లో పల్లెటూరి వాసుల యిళ్ళల్లో పట్నంనించి వచ్చే వివేకులు దిగేవారు. ముసలి అత్తా, మామా యింట్లో కూడా అప్పుడు వివేకులైన అతిథులుండేవారు. ఇప్పుడు కామ్రేడ్ 'క' తను యింట్లో వుండడానికి రావడం వాళ్ళకేమీ యిబ్బందిగాలేదు. తమయింట్లో తిండి అంత బాగుండదని కాని, ఉండడం కూడా అంత సుఖంగా ఉండదని కాని చెప్పి ఆ ముసలాళ్లు క్షమాపణ అడగలేదు. పల్లెటూరు పట్నంకంటే చాలా తక్కువని స్ఫురించేలాగా "మీరు షాంగాయ్ పట్నంనించి వచ్చారా?" అనికూడా అడగలేదు.

ముసలి దంపతులు అతిథికి ఒక గది చూపించారు. అందులో తిరగలి, పొలం సామాను వున్నాయి.

"ఈ సామానుయిక్కణ్ణించి తీసివేస్తాము. తలుపులు ఊడదీసి ఆ పలకలను రాత్రిళ్లు పడుకునేందుకు మంచంగా వేస్తాము" అని చెప్పారా ముసలివాళ్లు. 'క' చాలా సంతోషించాడు. తరవాత అందరూ మధ్య సావిట్లోకి వచ్చారు. భూస్వామి సామాను అందరూ పంచుకున్నప్పుడు లాటరీలో వీళ్లవంతుకు ఒక ముదురు నీలి రంగు పూలతొట్టె వచ్చింది. సావిట్లో వున్న ఆ తొట్టె అందాన్ని చూసి అందరూ ముగ్ధులైనారు.

కామ్రేడ్ వోంగ్ చెప్పగా ఎవరో పరుగెత్తుకు వెళ్లి గోల్డురూటునూ, అతని భార్యనూ పిలుచుకు వచ్చారు. గోల్డురూటు ఆదర్శ కృషీవలుడు. అతని భార్య పొలంపనిలో భర్తకు సహాయం చేయడానికి షాంగాయ్ పట్నంనించి కొద్దిరోజుల క్రిందటే వచ్చింది. 'క' కు ఆమె చాలా నచ్చింది. పల్లెటూరి పిల్లలు అందంగా వుంటారనుకున్నాడతను. ముసలి అత్త అందరికంటే ఎక్కువ కబుర్లు చెప్పింది. ఆమె మాట్లాడుతూ వుంటే మిగతా వాళ్లు తలలాడిస్తూ, నవ్వుమొహాలతో చూస్తున్నారు. ఇప్పుడు పల్లెటూళ్లు బాగుపడ్డాయి. మునపటిలాగా లేవు. అధ్యక్షుడు మేయో లేకపోతే యిటువంటి మంచిరోజులు మేము చూసేవాళ్ళమే కాదు" అంది ముసలి అత్త హడావిడిగా అరుస్తూ. తమ కుటుంబంలోని పెద్దను సంబోధించినట్లు ఆవిడ మేయో అధ్యక్షుణ్ణి "ముసలియింటి పెద్ద" అని సంబోధించింది.

కామ్రేడ్ వోంగ్ కి ముసలి అత్తను చూస్తే చాలా అభిమానమనీ, ఆమె అంటే అతను చాలా గర్వపడతాడనీ, 'క' గ్రహించాడు. అందుకే

తను వాళ్ళింట్లో వుండడానికి ఏర్పాటు చేశాడతను. కామ్రేడ్ వోంగ్ వెళ్ళిపోతున్నప్పుడు 'కు' వీధి చివరిదాకా అతనితో వెళ్ళాడు. "ఆ మెలో విశేషమేమంటే—దాపరికం లేని బోళామనిషి" అన్నాడు "కు" తో కామ్రేడ్ వోంగ్.

ఆ వూళ్ళో చలికాలం పాఠశాల పెడుతున్నారనీ, పాఠాలు చెప్పడానికి 'కు' ఆబడికి వెళ్ళితే పల్లె ప్రజలతో బాగా కలిసి మెలిసే అవకాశం కలుగుతుందనీ కామ్రేడ్ వోంగ్ చెప్పాడతనికి.

"ప్రయాణంవల్ల బాగా అలిసిపోయుంటావు. వెళ్ళి విశ్రాంతి తీసుకో. నేను రేపువచ్చి నిన్ను బడికి తీసుకువెళ్ళి విద్యార్థులకు పరిచయం చేస్తాను" అన్నాడు కామ్రేడ్ వోంగు.

పల్లె ప్రజల రాజకీయజ్ఞానం వృద్ధికావడానికి వాళ్ళకు చదవడం, వ్రాయడం నేర్పడం ఎంత అవసరమో విశదంగా చెప్పాడు వోంగ్. పల్లెటూరి పిల్లలకు పాఠాలు చెప్పమనీ, చదువురాని రైతులకు అక్షరాలు నేర్పమనీ 'కు' తో కామ్రేడ్ వోంగ్ చెప్పినవిధం చూస్తే దేశంలో చేయవలసిన పనులలోకల్లా అదే గొప్పపని అనీ, కష్టమైన పని అనీ తోస్తుంది. వోంగ్ మంచి ప్రచారకుడు అనుకున్నాడు 'కు'. వోంగ్ పార్టీలో చేరి చాలా కాలమైంది. ఉత్తర కియాంగ్సులో యుద్ధం జరిగేటప్పుడు అతను అక్కడ ఉన్నాడు కూడా. వోంగ్ యిప్పుడు ఉన్న పదవికంటే పెద్ద పదవి పొందడానికి తగిన అర్హత ఉన్నవాడు. కాని ముఠా రాజకీయాలు అతన్ని అణిచిపెట్టి ఉంచడానికి కారణమైవుంటాయి. మేయో ఆగ్రహానికి గురియైన ఓ ప్రముఖుడి అనుచరుడై ఉండివుంటాడు వోంగు. అదే నిజమైతే అతనితో ఏలాటి జోక్యం పెట్టుకున్నా అపాయకరంగా పరిణమిస్తుందని 'కు' భయపడ్డాడేమో! వోంగుతో ఎడఎడంగా ఉండటం మంచిదనుకున్నాడతను.

కామ్రేడ్ వోంగు ఒక్కడూ పంచాయితీ ఆఫీసులో ఉన్న తన నివాసస్థలం చేరుకున్నాడు. ఆఫీసు వున్న ఆలయం వెనకటి గొప్పల్లో కోపోద్రిక్తుడైన ఒక యోగి ఆశ్రమం. 'కు' వెళ్ళిపోయిన తరవాత అతనితో చాలా అనవసర ప్రస్తాపన చేశానని తెలుసుకున్నాడు వోంగు. జపాను వారు తమ దేశాన్ని ఆక్రమించుకున్నప్పుడు తను అజ్ఞాతవాసంలోకి పోయి పనిచేసిన సంగతీ, పరిస్థితులు విషమించినప్పుడు కొత్తగా నిర్మింపబడిన

నాలుగో నెంబరు సైన్యంలో చేరడానికి తను పరిగెత్తుకు పోయిన విషయమూ 'కు' కు చెప్పాడు అతను. పరిచయంలేని కొత్తవాడితో ఆ విషయాలు చెప్పకూడదు. ప్రమాదవశాత్తు నోరుజారి మాట్లాడాడు తను. వీరులు తాము చేసిన ఘన కార్యాల గురించి గొప్పగా చెప్పుకోరు. వెనకటి విషయాలు నెమరువేసుకుని పొంగిపోయే కుపిత వృద్ధుడిలాగా సంచరించినందుకు ఖిన్నుడైనాడతను.

'కు' తనను చిన్నచూపు చూస్తుండటం వల్ల అలా చెప్పుకోవలసి వచ్చింది. దేశ విషయాలూ, ప్రపంచ విశేషాలూ, తనకేం తెలియనట్లు అతను మాట్లాడాడు. తన గ్రామం బయట యేం జరుగుతున్నదీ బొత్తిగా తనకు తెలియదనీ, బయట జరిగే విషయాలను గురించి వినాలని తను తపించి పోతున్నాననీ అనుకుని సదుద్దేశంతోనే అతను తనకా విషయాలు చెప్పి ఉండవచ్చు.

ఈ 'కు' ఎవరో అసలు తను ఎప్పుడూ వినలేదు. అతన్ని పరిచయం చేస్తూ కార్మిక విజ్ఞాన సంస్థ అధికారి తనకు వ్రాసిన ఉత్తరంలో 'కు' దేశ విముక్తి జరిగిన తరవాత 'ద కాజ్' సంఘంలో చేర్చుకోబడ్డ కొత్త మనిషి అని వ్రాశాడు.

ఇరవై ఏళ్ళ కాలం పార్టీలో పనిచేశాను. పార్టీ సాగించిన పోరాటాల్లో ప్రముఖపాత్ర వహించాను. ఈనాడు యీ తుచ్ఛుడి అడుగులకు మడుగులొత్తవలసిన గతి పట్టింది నాకు. రెండు నాలుకలున్న యీ బుద్ధిలేని వివేకి—వెనకటి ప్రభుత్వపు తొత్తు తనేమో మహా గొప్పవాడిలాగా మాట్లాడాడు అనుకున్నాడు వోంగు.

తను యిలా కోపం తెచ్చుకోవడం మంచిది కాదనీ, 'కు' విషయం అట్లా అనుకోడం అన్యాయమేమోననీ జిజ్ఞాసలో పడ్డాడు వోంగు. తను యింటికి వెళ్ళేటప్పటికి కొంతమంది రైతులు వాళ్ళ మధ్య వచ్చిన తగాదాలను పరిష్కరించమని అడగడానికి వచ్చి తనకోసం కూర్చుని ఉంటారని వోంగు ఆశించాడు. ఆ పనిలో పడి 'కు' విషయం మరిచిపోవచ్చుననుకున్నాడతను. రైతులను ఎట్లా సమాధాన పర్చాలో అతనికి బాగా తెలుసు. వాళ్లు సమాధానపడి వెళ్లిపోతుంటే అతనికి ఆనందంగా ఉంటుంది. ఆ రైతులకు అతనే ప్రభుత్వం. వాళ్లని సమాధానపరిచి పంపేటప్పుడు తను ప్రభుత్వం యంత్రంలో చెడిపోయి, పనికిరాదని ఒక మూల

పారేసిన పనిముట్టు గాక ప్రధానమైన భాగాలలో తనూ ఒకణ్ణనే తృప్తి కలుగుతుంది అతనికి.

సాధారణంగా ప్రతిరోజూ ఉదయంనుంచి రాత్రి అయేవరకూ వోంగు తీరిక లేకుండా ఉంటాడు. కాని ఆ రోజు అతనికోసం ఎవరూ రాకపోవటం వల్ల కొంచెం విశ్రాంతి చిక్కింది. కాసేపు బల్లదగ్గిరకూర్చుని, లేచి, చేతులు వీపువెనక పెట్టుకుని బయటకు వెళ్ళాడతను. తన యిల్లు కని పెట్టుకుని ఉండే కామ్రేడ్ స్మాల్ ఫాంగు తలుపుదగ్గర ఒక దిండుమీద కూర్చొని ఉన్నాడు. భగవధ్యానంలో నిమగ్నులైన సన్యాసులు అటువంటి దిళ్లమీదే కూర్చుంటారు. ఆ మఠంలో ఉండే సన్యాసులను చాలా కాలం క్రిందటే వెళ్ళగొట్టారు. ఫాంగు ఆ దిండుమీద కూర్చుని భగవధ్యానం చేయటం లేదు. వెల్లుల్లిపాయల పొట్టు ఒలుస్తున్నాడు. అతను కూర్చున్న దిండు చాలా పాతది. నీలిరంగు గుడ్డలోంచి లోపలవున్న గడ్డి పైకి కనబడుతోంది. నగిషీలు చెక్కిన కిటికీకి అడ్డంగా తాడుకట్టి ఉతికిన గుడ్డలు ఆరవేశాడు ఫాంగు. వెలిసిపోయి గుబులు పుట్టిస్తున్న గులాబీరంగు గోడమీద సూర్యకాంతి నిబ్బరంగా పడుతోంది.

ఆ దేవాలయంలోనించి దేవతలను వెళ్లగొట్టారు. తను ఆ దేవాలయంలో ఉంటున్నాడు. మసక చీకట్లు అలుముకుని నిర్మానుష్యంగా ఉన్న గదులలో దేవతలు యింకా తిరుగుతున్నట్లనిపించింది వోంగుకి. షామింగును వివాహం చేసుకున్నప్పుడు అతను ఒక గుళ్లో నివసించేవాడు. వెనకటి విషయాలు అతను ఎప్పుడు జ్ఞాపకం చేసుకున్నా ఆ విషయమే అతని మనస్సులో ముందుగా మెదుల్తుంది.

అతను ఉత్తర కియాంగ్సులో నాలుగో నెంబరు సైన్యంలో సిపాయిగా ఉన్నప్పుడు ఆ ఊరి కరణం సమకూర్చిన ఓ పెద్ద సభలో ఆమెను మొదటిసారి చూశాడు. ఒక చిన్న పట్నంలో కరణాలందరూ పనినేర్చుకునేందుకు సమకూడారు. ఖాళీగా వున్న ఒక యింట్లో వాళ్లు బస చేశారు. ఆ యింటి వాలు స్తంభాలు ఎత్తుగా ఉన్నాయి. చలిగాలికి వణికిపోయారందరూ. ఆరుబయట చీకట్లో ఉన్నట్లుంది. రాళ్లుపరిచిన నేలమీద కూర్చుని కరణాలు పై అధికారులు యిచ్చే ఉపన్యాసాలు వింటూ, పుస్తకాలు మోకాళ్ళ కానించి పెట్టుకుని, ముఖ్య విషయాలు వ్రాసుకుంటున్నారు. ఉపన్యాసాలు ముగియగానే నినాదాలు చేయటం వాళ్ళ కల

పాటు. అందరూ లేచి నిలబడి ఉపన్యాసకుడితో బాటు "అధ్యక్షుడు మేయో చిర కాలము వర్ధిల్లుగాక!" అని అరుస్తూ టోపీలను పైకి ఎగర వేశారు. టోపీలు క్రింద పడుతున్నప్పుడు ఎవరి టోపీని వాళ్లు పట్టుకో లేక పోయేవాళ్లు. "ఎస్. ఎస్. టాలిన్ చిర కాలము వర్ధిల్లుగాక!" అని అరుస్తూ ఉపన్యాసకుడు చెయ్యి పైకెత్తినపుడు అందరూ టోపీలను ఎగర బడేవారు.

"ఎస్. ఎస్. టాలిన్ చిర కాలము వర్ధిల్లుగాక!" అని అందరూ అరుస్తూ టోపీలు మళ్లీ పైకి ఎగరవేశారు.

ఆ నాడు సభ ముగిసింది. చేతిలో టోపీ పట్టుకుని, విచారంగా నిల బడి ఉన్న ఒక స్త్రీ వోంగు కంటబడ్డది. ఆమె చేతిలో ఉన్నది ఆమె టోపీ కాదు. ఆమె వయాస్సు అట్టే లేదు. మిగతా ఆడవాళ్ళలాగా బుజాల వరకు పడేటట్లు జుట్టు పొట్టిగా కత్తిరించుకో లేదామె. రెండు వైపులా రెండు చుట్టలు చుట్టి వాటిని టోపీలో దూర్చింది. పాలిపోయిన ఆమె పల్చటి ముఖమూ, ఎడంగా వున్న ఆమె కళ్లూ చూసి ఆమె యువతనను కుంటారు ఎవరైనా. తలమీద టోపీ లేనందువల్ల జుట్టుముళ్లు స్పష్టంగా కనబడుతున్నాయి. ఆమె వదులుపాటి దుస్తులు వేసుకుంది. మనిషి సన్నగా ఉంది. విద్యార్థినిలా కనపడ్డది.

వోంగు నలిగి మాసిపోయిన తన టోపీ నెత్తిమీదనించి తీశాడు. అది తన టోపీ అవునో కాదో ఒకసారి చూసుకుని తన టోపీయే అని నిశ్చయించాడు. ఆమె దగ్గరకు వెళ్లి యిది నీ టోపీయేమో చూడమని అడుగుదా మనుకుని అంతలో ఆ ఉద్దేశం మానుకున్నాడు. కొంతమంది పొరబాటున యితరుల టోపీలు తీసుకోడం జరిగేది. ఎవరి నెత్తిమీదా ఆమె టోపీ లేదు. చుట్టూ పరీక్షగా చూడగా ఒక దూలంమీద ఆమె టోపీ వేళ్లాడుతుండడం కనపడ్డది. 'యు' అనే ఒకతను త్వరగాపోయి నిచ్చెన పట్టుకొచ్చి టోపీని పైనించి తీశాడు. ఆ గదిలోంచి వోంగు బయ టకు వెళుతున్నప్పుడు అతను ఆమెతో మాట్లాడుతున్నాడు. కామ్రేడ్ 'యు' అంతస్థేమీ అంత పెద్దది కాదనీ, ఆమెను పెళ్లిచేసుకునే తాహతు అతనికి లేదనీ వోంగుకి తెలిసినా అతనికి అనుమానం పోలేదు.

"టోపీ పోగొట్టుకున్న ఆ పిల్ల యెవరు? ఊరికే గోలచేస్తున్నారు" అని అడిగాడు వోంగు యింకో కరణాన్ని.

"నేను యిదివరకెన్నడూ ఆమెను చూడలేదు. కొత్తగా వచ్చింది. అయినా ఆమె సంగతి నీకెందుకూ?" అన్నాడతను.

"పిచ్చిమాటలు మాట్లాడక" అని వోంగ్ అతన్ని కసిరాడు.

"తలమీద జుట్టు చుట్టలుగా చుట్టుకుండే ఆ అమ్మాయి భర్త పేరు ఛన్ కదూ!" అని యింకో మనిషిని అడిగాడు వోంగు.

"షామింగు విషయమేనా నువ్వు అడుగుతోంది! ఆ అమ్మాయికి పెళ్లయిందనుకోను. ఆ పిల్ల యీ వూరికి ఒక సంవత్సరం క్రిందట వచ్చింది. టెలిగ్రాఫ్ శాఖలో పనిచేస్తోంది." అని చెప్పాడతను.

"కామ్రేడ్ ఛన్ నాకు తెలుసు. అతను ఆమె భర్త అనుకుని పొర బడ్డాను" అని సర్ది చెప్పాడు వోంగు.

ఉపకరణాలు ఆ రాత్రికి పరపతి సంఘం దుకాణంలో బసచేశాగు. వోంగు మర్నాడు ఉదయం అక్కడికి వెళ్లి కామ్రేడ్ షామింగును చూడా లని అడిగాడు.

మామూలుగా చైనావారి షాపులలో ఉండేటట్లు, ఆ షాపు గదిలో రెండువైపుల ముఖ్యమైన ఖాతాదారుల కోసం నగిషీలు చెక్కిన కుర్చీలు. వాటి మధ్య బల్లలు వేయబడ్డాయి. వోంగు ఒక కుర్చీమీద కూర్చున్నాడు. ఆ పరపతి సంఘం ప్రారంభించినపుడు చదవబడిన ఎర్రటి అభినందన పత్రాలు అతని వెనకవున్న గోడకు వేలాడుతున్నాయి.

పెళ్లివిషయం ముచ్చటించటానికి ఆమెను పరపతి సంఘం దుకా ణంలో కలుసుకోవడం మంచి శకునం అనుకున్నాడు వోంగు. తామిద్దరూ కలిసి చేయబోయే విప్లవ కార్యసాధనలో జీవితాంతమూ ఒకరితో ఒకరు సహకరిస్తారన్నమాట.

బుట్టలలో ఉన్న బియ్యంమీదా, అతని కాళ్ళదగ్గర వున్న ఎర్రటి చిక్కుడు గింజలమీదా, మన్నుతో నిండిన తోటకూర కాడల గుట్టమీదా, విప్పుకున్న చెవులలాగున్న చేమ ఆకులమీదా, వాడిపోయి, తియ్యని వాసన వేస్తున్న గోధుమరంగు వెదురు ముక్కలమీదా, తలుపు సందులోంచి ఎండ పడుతోంది. స్త్రీ కరణాలు పక్కలు చుట్టుకుంటూ, గల్లా పెట్టెదగ్గర నుంచుని పెద్దగా మాట్లాడుకుంటున్నారు. వాళ్లు ఆ రాత్రి అక్కడే పడు కుని నిద్రపోయారు.

అంతలో షామింగు వోంగువేపు త్వరగా వచ్చింది. వోంగు తనను తనే పరిచయం చేసుకుని "నీతో మాట్లాడాలి" అన్నాడు.

చిరునవ్వు నవ్వుతూ తొణకకుండా కూర్చుందామె. అందరూ తను వేసుకున్న జుట్టు ముడిని గురించి తర్కించారనీ, అతనూ ఆ విషయమే మాట్లాడడానికి వచ్చాడని తనకు నిశ్చయంగా తెలుసుననీ ఆమె వోంగుతో చెప్పింది.

"నీకు ఇంకా పెళ్లి కాలేదని విన్నాను. నాకూ పెళ్లి కాలేదు. మనిద్దరమూ వివాహం చేసుకునేందుకు సంఘం అనుజ్ఞ కోరే విషయంలో నీ అభిప్రాయ మేమిటి?" అని అడిగాడు వోంగు.

హామింగు కొంచెం ఆశ్చర్యపోయినట్లు కనపడ్డా శాంతంగానే వుంది.

"ఆ విషయం బాగా ఆలోచించుకుందాం!" అన్నదామె నవ్వుతూ.

"నేను నా మనస్సు నిశ్చయం చేసుకున్నాను. ఆలోచించుకోవలసిందేమీ లేదు నాకు."

"పెళ్లి చాలా ప్రమాదమైన విషయం. బాగా ఆలోచించుకోవడం మంచిది" అంది ఆమె మళ్లీ నవ్వుతూ.

వెంటనే ఏదో ఒకటి తేల్చి చెప్పమని వోంగు ఆమెను బలవంత పెట్టలేదు. ఎండ వెలుగులో ఆమెను చూసినపుడు అతని మనస్సులో ఏదో కలవరం కలిగింది. చిన్నదే అయినా పాలిపోయి వయస్సు మళ్లిన దానిలా గా కనబడ్డది. వెలిసిపోయిన ఫోటోలోని బొమ్మలా స్పష్టంగా వుందామె. ఆ బొమ్మను తాను వేలితో నైనా తాకకూడదనీ, తాకితే అది మరింత వాడిపోతుందనీ అనుకున్నాడతను.

రెండు వారాలయిన తరవాత వోంగు ఆమెను ఆమె ఆఫీసులో కలుసుకున్నాడు. అతనితో మాట్లాడడానికి ఆమె బయటకు వచ్చేటప్పుడు తన తోటి ఆఫీసరును నిద్ర లేపి తన స్థానంలో కూర్చోపెట్టింది.

"మనం సంఘానికి దరఖాస్తు పంపిద్దాం. మనలో ఎవరు కాని పెళ్లికి అర్హులం కాకపోతే సంఘంవారు ఆ విషయం తెలియజేస్తారు కనుక నీకు ఆదుర్దా అక్కరలేదు. మనం ఎటువంటి భయం లేకుండా ఆ విషయం సంఘానికి వదిలి పెట్టవచ్చు" అన్నాడు వోంగు.

బాగా ఆలోచించుకోవడం మంచిదంటూ యిదివరకు అతనికి అడ్డుపడ్డ ఆమె అతను రెండో పర్యాయం తనను ఆఫీసులో కలుసుకున్నప్పుడు కొంచెం అయిష్టంగా "సరే" అన్నది. సంఘానికి దరఖాస్తు పంపుకున్నారు.

సంఘంవారు పెళ్ళికి అనుజ్ఞ యిచ్చారు. ఆమెను తీసుకు రమ్మని ఒకరోజు వోంగు తన క్రింది ఉద్యోగిని గుర్రం యిచ్చి పంపాడు.

సాయంకాలం నిశ్శబ్దతలో గుర్రం గిట్టలచప్పుడు గంటలలాగా విన పడుతోంది. ఆ చప్పుడు దూరమయేవరకూ వోంగు దేవాలయం మెట్లమీద నిలబడి తరవాత లోపలికి వెళ్ళిపోయాడు. గదిలో వెలుగుతున్న దీపంనించి వచ్చే కొద్దివెలుగులో నీలపు ముఖాలతోనూ, ఎర్రటి ముఖాలతోను వరసగా నిలబడి వున్న దేవతా విగ్రహాలనూ, వాటి జరీ దుస్తులనూ అతను చూశాడు. కిటికీలకు అంటించబడిన కాగితాలు చిరిగిపోయి గాలికి కొట్టుకుంటూ పెద్ద చప్పుడు చేస్తున్నాయి. వోంగు హాలులోంచి తూర్పువైపు ఉన్న తన గదికి వెళ్ళాడు. ఆరోజు గది ఊడ్చి సామాను సర్దడం వల్ల గది చాలా ఖాళీగా కనపడుతోంది.

యుద్ధం జరిగే రోజుల్లో కమ్యూనిస్టు పార్టీ అణిగి ఉండేది. అందు వల్ల ఆ దేవాలయాన్ని పార్టీ ఆక్రమించుకున్నా కూడా విగ్రహాల జోలికి గాని, సన్యాసినుల జోలికి గాని వాళ్ళు పోలేదు. వయస్సులో వున్న సన్యాసినులు అక్కడనించి వెళ్ళిపోయారు. ఒక ముసలి సన్యాసిని మాత్రం అక్కడే వుండిపోయింది. ఆమె దేవాలయం వెనక భాగంలో కూర్చుని కొయ్యడబ్బామీద చేతితో కొడుతూ ఏదో చదువుతోంది. ఆమె డబ్బా మీద కొట్టుతున్నప్పుడు ఆ రయే 'టక్, టక్' అనే శబ్దం శిధిల ప్రపంచంలో ఎక్కడో ఒక్క గడియారం మాత్రం ప్రపంచానికంతటికీ కాలగమనం తెలుపుతున్నట్టుంది.

వోంగు గదిలో ఆ యువతికోసం ఎదురు చూస్తూ అటూ యిటూ పచార్లు చేస్తున్నాడు. అప్పుడు అతనిని యేదో ఆవహించినట్టు కనపడ్డా డతను. ఆ రాత్రి ఆమె అతని గదికి వచ్చింది. తెల్లవారుతుండగా వచ్చిన గుర్రంమీదే తిరిగి వెళ్ళిపోయిందామె. వెళ్ళేటప్పుడు కూడా వోంగు క్రింది వుద్యోగి గుర్రాన్ని కళ్ళెం పట్టుకుని నడిపించుకుని వెళ్ళాడు. తరవాత వారాని కొకసారి ఆమెకు కబురంపే వాడతను. కథల్లో అప్సరసలాగా రాత్రివచ్చి ఉదయం కాకముందే వెళ్ళిపోయేదామె.

విచిత్రమైన ఆ అనుభూతినుండి బయటపడాలని అతను అస్తమానూ ప్రయత్నించేవాడు. అందరి భార్యలలాగా ఆమెకూడా తన దిన చర్యలలో పాల్గొంటూ తనతో కలసి వుండడమే అతనికి యిష్టం. అతను ఉన్న

ఊరిలో కరణాల అత్యవసర సమావేశం జరిగినపుడు ఒక్కసారే ఆమె తన భార్య అనుకునే అనుభూతి అతనికి కలిగింది. సభలు జరిగే ప్రదేశాలను చక్కగా అలంకరించడంలో కమ్యూనిస్టులు చాలా పట్టుదల చూపేవారు. సభ జరగబోయే గదిని పెద్ద ఉద్యోగి ఒకతను వచ్చి ముందు చూసేవాడు. బల్లమీద పూలతో స్టైలో పూలు అందంగా అమర్చి వుండకపోయినా అతను సభ ఏర్పాటుచేసిన కరణం మీద విరుచుకు పడేవాడు. కాని వోంగువున్న ఊరు పాడుబడిపోయిన ఊరు కావడంవల్ల అక్కడ పువ్వులు లేవు. జండాలు, తోరణాలు, రంగు రంగు దీపాలు లేవు. ముఖ్యంగా ఉండవలసిన మాయోట్సేటుంగు పెద్దపటమైనా వోంగు సంపాదించలేక పోయాడు.

పటం లేదన్న లోపం కనబడకుండా హామింగు మధ్యనున్న గోడ మీద ఒక పెద్ద ఎర్రరంగు కాయితం అంటించి "అధ్యక్షుడు మేయో చిరకాలము వర్ధిల్లుగాక!" అన్న మాటలు నల్లని పెద్ద అక్షరాలతో వ్రాసింది. అంతేగాక, రెండు యిత్తడి పళ్ళాలనిండా నూనెపోసి బల్ల మీద రెండు వేపులా పెట్టింది. సభ ప్రారంభమయాక ఆ పళ్ళాలలో ఉన్న వత్తులు వెలిగించబడ్డాయి. రెపరెపలాడుతున్న ఆ పెద్ద జ్యోతులు వెనక ఉన్న ఎర్ర కాగితంమీద వెలుగు నీడలను వెదజల్లుతుండగా కరణాలంతా చేతులెత్తి పార్టీయెడల తమకుగల భక్తి విశ్వాసాలను వెల్లడిస్తూ ప్రమాణాలు చేస్తున్నపుడు అద్భుతమైన దృశ్యం కన్నులకు కట్టినట్లయింది.

తాముభయులూ కలిసి, సభను జయప్రదం చేసినట్లు తలుస్తూ వోంగు తన భార్యను చూసి ఎంతో గర్వపడ్డాడు. తరవాత సభలో జరిగిన లోపాల గురించీ, విశేషాలను గురించీ ఆమెతో కులాసాగా మాట్లాడాడతను. అతిథులందరూ వెళ్ళిపోతున్నప్పుడు ఆమెకూడా వాళ్ళతో వెళ్ళిపోక దిగబడి ఆ రాత్రి తనతో ఉండిపోవడం అతనికి మరింత సంతోషాన్ని కలిగించింది.

కొత్తగా ఏర్పడ్డ నాలుగో సైన్యంలో చేరడానికి తను ఎలా వచ్చిందీ భర్తకు చెప్పిందామె. హైస్కూలులో ఆమె చదువుతున్నపుడు ఒక కమ్యూనిస్టు ఉపాధ్యాయినితో ఆమెకు స్నేహమైంది. వాళ్లు అర్ధరాత్రి వేళ గుసగుసల్లో మాట్లాడేవారు. కొవ్వొత్తి వెలుగులో పరదావెనక కూర్చుని ప్రచారక సాహిత్యం చదివేవారు. జపాను దండయాత్రను

ఎదుర్కోడంలో చైనాకు రష్యాదేశ మొక్కటే సహాయపడ్డదని ఆ ఉపాధ్యాయిని ఆమెకు చెప్పింది. జపాను పైన యానన్ సాధించిన కొత్త విజయాలను గురించి ఆమె ఎప్పటికప్పుడు చెప్పేది. చాలామంది ఆడపిల్లలతో బాటు హామింగు కూడా కమ్యూనిస్టుగా మారిపోయింది. జపాను ఆక్రమించిన ప్రాంతంలోంచి ఉత్తర కియాంగ్సులోకి ఆ ఉపాధ్యాయిని తప్పించుకు పోతున్నప్పుడు పిల్లలనందరినీ తనతో తీసుకు వెళ్లింది. అక్కడ నూతన నాలుగో సైన్యం ఏర్పడ్డది.

సైన్యంలో చేరిన తరవాత ఆమె పేరు మార్చుకుంది. "బ్రయిట్ శాండ్" అన్న ఆమె కొత్తపేరు రంగస్థల వేషధారి పేరు లాగా, మగవాళ్ల పేరు మల్లే తమాషాగా వుండేది.

ఆఖరు రోజుల్లో వాళ్లున్న యింటి సంగతి అతనితో చెప్పిందామె. తపాలాశాఖలో తంతి యిచ్చే ఒక యువకుడూ, ముగ్గురు యువతులూ ఒక రైతు యింట్లో సావిడిని ఆక్రమించుకున్నారు. వాళ్లు పగలు బల్లలముందు కూర్చుని పనిచేసేవారు. రాత్రిళ్ళు వాటిమీదే పడుకుని నిద్రపోయేవాళ్లు. ఆ సావిడికి తలుపులేదు. దండెత్తివచ్చిన సైనికులు తలుపు బద్దలు కొట్టి పొయ్యిలో పెట్టేశారు. ఉత్తరాన్నించి వీచే యీదురుగాలికి దీపం ఆరిపోయేది. అయినా పశువుల పాకలోకన్నా సావిడిలో వెచ్చగా వుండేది. అందువల్ల ఆ రైతు తన గేదెను సావిట్లో కిటికీ వూచలకి కట్టేసేవాడు. గేదె వుచ్చపోసేది. రాత్రివేళ తంతిపని చూసుకునే అమ్మాయి వెంటనే కుర్చీ మీదనించి ఒక్కదూకు దూకి పరిగెత్తి వుచ్చకింద పడకుండా గేదె తోక దగ్గర తొట్టె పెట్టి వచ్చేది. గేదె వుచ్చపొయ్యడం పూర్తి కాగానే వాళ్లల్లో ఒకరు లేచి వెళ్లి ఆ వుచ్చ బయట పారపోసేవారు. అట్లా పారపొయ్యక పోతే గేదె ఆ తొట్టెను తన్నడమూ, యిల్లంతా వుచ్చమయం కావడం జరుగుతుంది.

ఒక విధంగా గేదెను సావిట్లో కట్టేయడం వాళ్ళకు మంచిదే అయింది. వాళ్లు ముగ్గురూ చలికి తాళలేక గేదె కడుపుకింద చేరి దూడల మల్లే ముడుచుకోవడం ఆమెకు బాగా జ్ఞాపకం వుంది.

ఈ విషయాలు అతనితో ఆమె సిగ్గుపడుతూనే చెప్పింది. ఇద్దరూ కలిసి ఆమె పడ్డ అవస్థలకు నవ్వుకునే వారు.

"సామాన్యుడెవడూ విప్లవ జ్వాలలకు తట్టుకోలేడు. అయితే మనందరమూ యిట్లా తయారుకావడానికి విప్లవమే కారణం." అన్నాడు వోంగు.

ఆమెను చూస్తే అతనికి విచారం కలిగింది. "ఆరోగ్యం బాగుంటే కష్టాలను ఎదుర్కోవచ్చు. నీకేం ఫర్వాలేదులే. నీ ఆరోగ్యం బాగుపడుతుంది." అని మాత్రం అతను అనగలిగాడు.

ఆమె తనువుండే చోటికే రావడంవల్ల వోంగుకి సంతోషంగా వుంది. అయితే ఆమెకు పరిచర్యలు చేయడానికి అతనికి తీరిక లేదు. శత్రువుల చేతుల్లో తమ పక్షానికి అపజయాలు ప్రాప్తిస్తున్నాయి. చివరకు వాళ్లు ఆ దేవాలయం ఖాళీచేసి వెళ్లిపోవలసి వచ్చింది.

దేవాలయం తెల్లవారకముందే ఖాళీ చెయ్యమని ఆజ్ఞలు జారీ చేయబడ్డాయి. అందరూ గంద్రగోళంగా సామాన్లు సర్దుకుంటున్నారు. అంతా అల్లకల్లోలంగా వుంది. "ప్రజలదగ్గర ఒక సూదిగాని, ఒక దారం ముక్కగాని తీసుకోకూడదు" అని నినాదాలు చేసే సైనికులు ప్రజలనుండి అవసరానికి ఏమేమి బదులు తీసుకున్నారో వాటినన్నిటినీ తిరిగి యిచ్చివేయవలసి వచ్చింది. ఇంటింటికీ వెళ్లి సైనికులు తలుపులు తట్టి యింట్లో వాళ్ళని "పిన్నీ! పిన్నీ" అని పిలిచారు. తలుపు బద్దలుకొట్టడం వినిపించి యింట్లోవున్న ముసలిఅవ్వ భయపడుతూ వచ్చి తలుపు తెరిచేది. సైనికులు పగిలిపోయిన చిల్లిముంతో, విరిగిపోయిన కుర్చీయో తీసుకువెళ్లి ఆమెకిచ్చి వాటిని ఆరునెలల కాలం వాడుకోటానికి వాళ్ళకు యిచ్చినందుకు కృతజ్ఞత తెలిపేవారు.

"మేము వెళ్లిపోతున్నాము. పిన్నీ! భయపడక మళ్ళీ వస్తాము" అని ఆమెను బుజ్జగించేవారు సైనికులు.

బయలుదేరేముందు వోంగు ఒక లక్ష విషయాలు చూసుకోవలసివుంది. తన బసకు పరిగెత్తాడతను. షామింగు కష్టపడి లేచి పక్కమీద కూర్చుని తన వస్తువులు ఒక చిన్న మూటలో కట్టుకుంటోంది. ఆమెను తనతో తీసుకువెళ్ళటం లేదని ఆమెకు చెప్పటం ఎట్లాగా అని వోంగు ఒకనిముషం బాధపడ్డాడు.

అతను చేతులు మోకాళ్లమీద పెట్టుకుని ఆమె పక్కన కూర్చుని "మా ప్రయాణం చాలా ప్రమాదకరంగా ఉంటుంది. నీ దేహస్థితిని బట్టి నువ్వు యిప్పుడు మాతో రావడం మంచిదికాదు. కామ్రేడ్ ఫాంగు తల్లి దండ్రులతో నువ్వు వాళ్లింట్లో వుండేందుకు ఏర్పాటు చేశాను" అని ఆజ్ఞ చేస్తున్నట్లు చెప్పాడతను. కామ్రేడ్ ఫాంగు తన సేవకుడు కావడంవల్ల

అతను తనక్రింద పనిచేస్తున్నంతకాలం తన భార్యను అతని తల్లితండ్రులు జాగ్రతగా కాపాడతారని వోంగు నమ్మకం.

వస్తువులు నెమ్మదిగా సర్దుకుని చివరకు అలిసిపోయినట్లు వాళ్ళో ఉన్న మాటమీద ఆమె తల ఆనించింది. ఆమె ఏడుస్తున్నదని అతను తెలుసుకున్నాడు.

"కామ్రేడ్లు శత్రురాజ్యంలో ఉండిపోవడమూ, అజ్ఞాతవాసంలోకి పోవడం సాధారణంగా జరిగే విషయమే" అన్నాడతను.

"నేను నీతో వస్తాను" అంటూ ఏడ్చిందామె.

"చాలినన్ని స్ట్రెచ్చర్లుగాని, స్ట్రెచ్చర్లు మోసేవారుగాని లేరు. గాయపడ్డ సైనికుల నందరినీ మేము మాతో తీసుకుపోవాలి. నువ్వయితే యిక్కడ శత్రువులకు చిక్కకుండా దాక్కోవచ్చు. గాయపడ్డ సైనికుడు ఎట్లా దాక్కోగలడు?" అన్నాడు వోంగు.

అతను సామాను సర్దుకుంటున్నాడు. కొంచెంసేపుండి తల ఎత్తి చూశాడతను. ఆమె ఏడవడంమాని సామాను సర్దుకుంటోంది. తెల్లవారుతున్నప్పటి సూర్యుని కాంతిలో కిరసనాయిలు దీపపు కాంతి వెలవెలపోయింది.

కామ్రేడ్ వోంగు తండ్రీ, సోదరుడూ కలిసి తలుపు చెక్క ఒకటి మోసుకు వచ్చారు. వాళ్లు ఆమెను ఆ చెక్కమీద పడుకోబెట్టి దుప్పటీ కప్పారు. జబ్బువాళ్ళకు చలి తగలకూడదు గనుక అది జూన్ నెల అయినా ఆమెకు దుప్పటీ కప్పారు. వోంగు వంగి ఆమె మెడచుట్టూ దుప్పటి సర్దుతూ "నీకేం ఫరవాలేదు. అయినా తగిన జాగ్రతలో మాత్రం ఉండు. త్వరగా కోలుకో. మేము మళ్లీ త్వరగానే వస్తాము" అన్నాడు.

ఆమె దిండుమీద ఆనించివున్న తలను ఊపింది. ఆమె మొహం పాలిపోయింది. కళ్లు చెమ్మగిలాయి.

"కామ్రేడ్! ఏమీ ఫర్వాలేదులే. అంతా సక్రమంగా సర్దుబాటవుతుంది" అన్నాడు ముసలాయన. బలవంతాన ఆమెను తమ వశం చేయటం వల్ల తమకు కలగబోయే చిక్కులూ, అపదలూ తలుచుకుని అతను లోపల భయపడుతున్నాడు. చుక్కలింకా ఆకాశంమీద కనపడుతుండగా తెల్లవారుజామునే ఆమెను పొలాలకు అడ్డంపడి వాళ్లు మోసుకుపోయారు. అది చూస్తూ నిలబడ్డ వోంగు హృదయం గతుక్కుమంది. కాని తెచ్చిపెట్టుకున్న ఉత్సాహంతో మాట్లాడాడు.

సైన్యం యింకో జిల్లాలో స్థిరపడ్డది. యుద్ధం ముగింపుకు వస్తోంది. రెండుపక్షాలవాళ్లూ విసిగిపోయి, నిరుత్సాహంగా వున్నారు. ఒక పక్షం దెబ్బతీయడానికి నడుములు బిగించి ముందుకు వచ్చినపుడు రెండో పక్షం మాట్లాడకుండా లొంగిపోయి, వీలు దొరకగానే చెల్లాచెదరై పోయేది. జూదం బల్లమీద పాచికలలాగా సైన్యాధిపతులు సేనలను ముందుకూ, వెనకకూ నడిపారు.

దేశం సరిహద్దుల్లో రాకపోకలు ఎక్కువగా జరిగేవి కావు. కొంత కాలం గడిచేటప్పటికి షామింగు విషయం నూతన నాలుగో సైన్యానికి ఏమీ తెలియకుండా పోయింది. ఏమన్నా జరిగి వుండవచ్చు: ఆమెను శత్రువులు కనుక్కొని వుండవచ్చు, లేదా ఎవరన్నా మోసగించి ఆమెను శత్రువుల వశం చేసివుండవచ్చు. జబ్బుతో తీసుకునో, వైద్య సహాయం లేకనో ఆమె మరణించీ వుండవచ్చు.

షామింగు ఏమైందీ అడుగుతూ ఒక ఉత్తరం వ్రాసి వోంగు ఎవరి చేతో ఫాంగ్సుకి పంపించ గలిగాడు. చుట్టుపక్కల ఆమె అందరకూ తెలిసి వుండడం వల్ల పట్టుబడే అవకాశం వుందనీ, అక్కడకు కొంత దూరంలో ఒక పల్లెటూర్లో వున్న తమ బంధువుల యింటికి ఆమెను పంపామనీ, అక్కడినించి ఆమె మరెక్కడికో వెళ్ళిపోయిందనీ ఫాంగ్సు తెలియజేశారు.

ఆ విషయం ఆరాతీయడానికి వోంగు ఆ పల్లెటూరికి ఎట్లాగో వీలు చేసుకుని వెళ్ళాడు. వ్యాపారస్థుడిలాగా వేషం వేసుకుని వెళ్లి ఫాంగ్సు బంధువూ, చా సోదరులలో ఎనిమిదోవాడూ అయిన చౌపాకెను వోంగు కలుసుకున్నాడు.

చౌపాకెకు నలభై ఏళ్లుంటాయి. పొట్టి మనిషి. అతని కళ్లు పైకి ఉబికినట్లుంటాయి. నున్నని అతని తల పచ్చగా కనపడుతుంది. గుండ్రంగా ఉన్న అతని ముఖం క్రిందిభాగం ఎవరో అణగకొట్టినట్లు ఉంటుంది. గడ్డంమీద ఎవరూ కొట్టడానికి వీలుకాకుండా రక్షించుకునేందుకా అన్నట్లు అతనికి అసలు గడ్డమే లేదు. పొడుగాటి నీలం అంగీ వేసుకుని మర్యాదస్థుడిలాగా కనబడతాడాయన. అతను మామూలు రైతుమాత్రమే కాదు. వర్తకం కూడా చేశాడు. పాతసామాను, పట్టు పురుగులు, ఉప్పు, తేయాకు, పన్నులు వీటి విషయం అతనికి బాగా తెలుసు. వోంగు పాత

సామాను విషయంలో తనకు ఆసక్తి వున్నట్లూ, ఆ విషయం మాట్లాడ-డానికి ఫాంగ్సు తనను అతని దగ్గరకు పంపినట్లూ నటించాడు. చా అతిగా వాగడం విని అతనికి పాకె అన్న పేరు ఎగతాళి చేయడానికి పెట్టివుంటారనుకున్నాడు వోంగు. చైనాభాషలో పాకె అంటే పేరకీట్ అన్న మాట. పేరకీట్ తెలివైన పక్షి. దానికి మాటలు సులభంగా నేర్పవచ్చు. చా భార్య అక్కడకు రావడం, ఆమెను అందరూ 'ఎనిమిదో వదినా' అని పిలవడం జరిగింది. అంటే పాకే అన్నదమ్ములలో ఎనిమిదో వాడన్న మాట.

భోజనానికి ఉండమని వోంగుని బలవంతం చేశాడు చా. భోజనాలవుతుండగా పన్నుల విషయంలో ఉన్న చిక్కులూ, ఏ ఉద్యోగులతో చిక్కులు కలిగేదీ, వాళ్ళను ఎట్లా సమాధానపరచవలసిందీ, ఏయే సైనికులు అతనికి ఎదురయ్యేదీ చా చెప్పాడు.

జపానువారూ, కమ్యూనిస్టులూ, అసమర్థ ప్రభుత్వంయొక్క శాంతి సైన్యమూ, చుంకింగు ప్రభుత్వానికి నామమాత్రంగా లోబడి ఉన్న ఊరూ పేరూ లేని సైన్యాలూ, అన్నీ ఒకటి తరవాత ఒకటి దండెత్తిన ప్రదేశాల్లో ఆ వూరూ ఒకటి.

ఇద్దరూ ద్రాక్షరసం గిన్నెల్లో పోసుకు తాగారు. జపానువారు టుంగ్ చావ్ నించి దండెత్తి వచ్చినప్పటి సంగతులు వోంగుకు చెప్పాడు చా.

"ఓ ముఠాకు నాయకత్వం వహించిన ఉద్యోగి ఎకాయెకి ఇంట్లోకి వచ్చి 'నువ్వు సామాన్య పౌరుడివేనా?' అని అడిగాడు. నేను అవునని సమాధానం చెప్పాను.

"నీకు జపాను సైనికులను చూస్తే యిష్టమా, చైనా సైనికులను చూస్తే యిష్టమా?' ఆ ప్రశ్నకు ఏమని సమాధానం చెప్పడం మంచిదో నాకు తెలియలేదు. అతను జపానువాడో, చైనావాడో నేనూహించుకో లేక పోయాను. చైనాభాష చక్కగా మాట్లాడాడు."

"మాట్లాడే తీరునిబట్టి తప్పకుండా కనుక్కోవచ్చు" అన్నాడు వోంగు. సామాన్య రైతులకు అందరు సైనికుల మాటల ధోరణీ ఒకలాగే ఉంటుందనీ, జపాను సైనికుడు చైనాభాష మాట్లాడినా, ఉత్తర చైనా సైనికుడు మాండరిన్ మాట్లాడినా ఒకేలాగుంటుందని అంతలో అతనికి జ్ఞాపకం వచ్చింది.

"మాటలాడే తీరునిబట్టి కూడా కనుక్కోలేం. వాళ్ల బూడ్సులను చూసి మాత్రమే వాళ్లేదేశస్థులైనదీ తెలుసుకోవచ్చు. కాని వాళ్ల బూడ్సులవంక చూసే ధైర్యం లేకపోయింది" అన్నాడు చా.

అతను తల కొంచెం పైకెత్తి, మెడబిగించి సైనికుడులాగా నుంచున్నాడు. తల ఆడిస్తూ నవ్వి "కాళ్లవేపు చూసే ధైర్యం లేకపోయింది" అన్నాడు మళ్ళీ.

"అవును. మనుషులను పైనించి కిందదాకా ఎగాదిగా చూడడం అమర్యాదగా వుంటుంది" అన్నాడు వోంగు నిదానంగా.

"మరి నేను అతని ప్రశ్నకు ఏమని జవాబు చెప్పాననుకున్నావు. ఒకసారి నిట్టూర్చి అయ్యా! మాకు బతకడమే చాలా కష్టంగా వుంటోంది. సైనికులు జపాను వాళ్ళయినా, చైనావాళ్ళయినా మాకు ఒకటే. మాకు కావలసిందల్లా శాంతి. అందరికి కావలసిందీ శాంతే అన్నాను. 'అవును. నువ్వు చెప్పేమాట నిజమే!' అన్నాడతను. అప్పుడు అతను జపాను దేశస్థుడని గ్రహించాను" అని చా సగర్వంగా చెప్పాడు.

భోజనాలు అయినాక వోంగు అక్కడనించి బయలుదేరాడు. దగ్గర ఉన్న యింకో వూరికి వెళ్లడానికి నిశ్చయించుకున్నాడనీ, రాత్రి కాకముసుపే అతనా ఊరు చేరుకో తలచాడనీ గట్టిగా తనకు తెలియగానే, తమ అతిథిగా యింకా కొద్దిరోజులు ఉండకుండా వోంగు వెళ్లిపోతున్నందుకు విచారం వెలిబుచ్చాడు చా.

"మీరు నా యెడల చూపించిన ఆదరణకు నేను పొంగిపోతున్నాను. అతిథుల్ని మీరు గొప్పగా సత్కరిస్తారని నేను యిదివరకే విన్నాను. నా చుట్టం ఒకామె యీ ప్రాంతాల్లో తిరుగుతున్నప్పుడు మీ యింట్లోనే బస చేసిందని విన్నాను. అందుకు మీకు నా కృతజ్ఞత తెలపడమే మరిచిపోయాను" అన్నాడు వోంగు.

"ఎవరామె?" అడిగాడు చా కొంచెమాగి.

"ఆమె ఫాంగ్సు యింట్లో ఉండేది. ఎక్కువ వయస్సు లేదు. యువతి" అన్నాడు వోంగు అతన్ని పరికించి చూస్తూ.

"మీరు పొరబడుతుండాలి. ఏ యువతీ మా యింట్లో అతిథిగా ఉండలేదే!" అన్నాడు చా తెల్లమొహంవేసి.

"వయస్సు తెలియకుండా ఆమె మాయచేసి ఉండవచ్చు. నేను వెనక ఆమెను చూసినపుడు ఆమె కాట్టే వయస్సు లేదు. ఈ పాటికి నడి వయస్సు వచ్చివుంటుందా మెకు" అన్నాడు వోంగు నవ్వుతూ.

"మా యింటికి నడివయస్సు స్త్రీ కూడా ఎవరూ రాలేదే!" అన్నాడు చా.

"ఆమె జబ్బుపడ్డదనీ, జబ్బువల్ల ఆమెకు వృద్ధాప్యం త్వరగా ప్రాప్తించిందనీ నేను విన్నాను" అన్నాడు వోంగు.

"ముసలి స్త్రీ కూడా ఎవరూ మా యింట్లో అతిథిగా వుండలేదు" అని జవాబు చెప్పాడు చా.

ఎవతో కమ్యూనిస్టు స్త్రీని వెదుకుతూ తను వచ్చి ఉంటాడన్న భయంతో చా తన ప్రశ్నలకు సరైన సమాధానం చెప్పటం లేదని వోంగు తలచి తెగింపుతో మాట్లాడి తనెవరో బయట పెట్టుకున్నాడు.

"నిజం చెప్పడానికి భయపడకు. నేను కొత్త నాలుగో సైన్యంలోని వాణ్ణి. జరిగింది జరిగినట్లు నాతో చెప్పవచ్చు. చెప్పకుండా పిస్తేనా దాచావా నీకే అపాయం కలుగుతుంది" అన్నాడు వోంగు.

చా యిబ్బందిలో పడ్డాడు. వోంగు తను కమ్యూనిస్టునని చెప్పు కున్నాడు గాని అతను ఎవరి పక్షమో ఎవరికి తెలుసు. అతని బూడ్సులను చూసి తెలుసుకోడానికి కూడా వీలులేదు. అతను సైనిక దుస్తులు ధరించ లేదు కనుక అతని కాళ్ళకు బూడ్సులు లేవు.

తన యింటి గుమ్మంలో ఏ వయస్సులో ఉన్న స్త్రీ కూడా అడుగు పెట్టలేదని చెపుతూ చా కాలం నెట్టుతున్నాడు.

"ఫాంగ్సు ఆమెను మీ యింటికి పంపామని చెప్పారు. ఆమెను నువ్వు ఏం చేశావు? పోలీసులకు అప్పగించావా?" అని వోంగు గట్టిగా అడిగాడు.

"అయ్యో దేవుడా! నాకా విషయం తెలియనే తెలియదు. ఫాంగ్సు అలా చెప్పివుంటే వాళ్లు చెప్పనది శుద్ధ అబద్ధం. నా మీద ఎందుకు వాళ్లు అట్లా చెప్పారు!" అన్నాడు చా.

"నీ మూలంగానే మా వాళ్ళొకరు నాశనమయ్యారు. అందుకు నీకు తగిన శాస్తి జరుగుతుంది" అన్నాడు వోంగు.

వోంగు చాలా భయపెట్టగా చివరికి జబ్బుగానున్న ఒక అమ్మాయికి తమ యింట్లో ఆశ్రయం యిచ్చినట్లు ఒప్పుకున్నాడు చా. వోంగు చివరకు మరో పక్షానికి చెందినవాడని తేలితే అతనిని వదుల్చుకునేందుకు బొంకానని చెప్పి అప్పుడు తప్పించుకోవచ్చు ననుకున్నాడు అతను.

“ఇప్పుడామె యెక్కడున్నది ?” అడిగాడు వోంగు.

“అష్టమి రోజున యిక్కణ్ణించి వెళ్ళిపోయింది. చింకియాంగు వెళ్ళి హాస్పిటలులో చేరుతానని చెప్పింది. ఆ వూళ్ళో తనకు బంధువులున్నారన్నదికూడా” అన్నాడు చా.

“ఆమె ఒక్కతే వెళ్ళిందా !” అడిగాడు వోంగు.

“ఇక్కడనించి బయలుదేరేముందు ఆమె వంట్లో చాలావరకు నెమ్మదించింది. ఒంటిగా వెళ్ళగలనంది” అని బదులు చెప్పాడు చా.

వోంగు యింకా ప్రశ్నలడిగాడు గాని యింతకన్నా ఎక్కువ విశేషాలేమీ అతనికి తెలియలేదు. తన భార్యకు ఛింకియాంగులో పినతండ్రి ఒకడు ఉండటంవల్ల అతని మాటలు నమ్మదగినవిగానే వోంగుకు కనబడ్డాయి.

వోంగు అప్పటికి తృప్తిపడి వెళ్ళిపోయాడు కాని చాలా కాలం గడవకముందే అతన్ని కొన్ని సందేహాలు బాధించాయి. చింకియాంగువంటి పట్నంలో వున్నవాళ్లు సులభంగా వర్తమానాలు పంపేందుకు వీలుంది. ఆమె చింకియాంగులోనే ఉంటే తనకుగాని, మరెవరికిగాని ఏ కబురూ ఎందుకు పంపదు ?

ఆమెను చింకియాంగు పట్నంలో చూసినట్లు కొందరు అతనికి చెప్పారు. పార్టీ నిబంధనలు ఆమె అతిక్రమించినట్లు వెల్లడైనకొద్దీ పార్టీలో ఆమె విషయం అప్పుడప్పుడు తర్కించేవారు. అప్పుడు వోంగు “ఆమెకు నిలకడనేది లేకపోవడం విచారకరం. మధ్యతరగతి మనుష్యులు ఎప్పుడూ అటూ యిటూ వూగుతూ, నిలకడ లేకుండా వుంటారు. నేను ఆమెని మార్చలేక పోయినందుకు విచారపడుతున్నాను” అనేవాడు.

తన దగ్గరున్నప్పుడు అసలామె సుఖంగా వుండేదా లేదా అని అతనికి సందేహం కలిగింది. బయటి ప్రపంచం తమ వివాహం గుర్తించలేదు గనుక ఆమె యింకెవరినో వివాహం చేసుకుని, ఏ చిన్న వూళ్ళోనో సామాన్య గృహిణిగా స్థిరపడిపోయివుండే అవకాశం వుంది. తన సంగతి

ఎట్లావున్నా ఆమె తిరిగివచ్చి విప్లవకారులతో పనిచేయాలని కోరుకున్నాడు అది ఆమెకే శ్రేయస్కరం. బయటి ఒత్తిడి ఎక్కువగా వున్న ఆ రోజుల్లో పార్టీ అంత కఠినంగా ఉండేది కాదు. పార్టీని వదిలి వెళ్లిపోయినవాళ్లు పశ్చాత్తాపం తెలుపుకుంటే వాళ్ళను మళ్లీ పార్టీలో చేర్చుకునేవారు.

ఒక పట్టణంలో సేనలు తిరుగుతున్నప్పుడు వోంగు ఆ సేనలతో ఉన్నాడు. ఆ పట్టణం ఒకళ్ళ అధీనంలోంచి యింకోళ్ల అధీనంలోకి చాలాసార్లు మారింది. అనేకసార్లు యుద్ధరంగమైంది. చెరువుకట్ట దాటి నిర్మానుష్యంగా వున్న వీధిలోకి సేన నడిచింది. గులకరాళ్లు పరిచివున్న ఆ వీధికి రెండువైపులా తెల్లటి శిథిలాలు కనపడుతున్నాయి. శిథిలమైన ఆ యిళ్ల పైకప్పులు చాలా ఎత్తయినవి. రెండస్థుల యిళ్ళకన్నా చాలా ఎత్తుగా వున్నాయి ఆ యిళ్లు. సైన్యం అటు వెళుతున్నప్పుడు వోంగు తల పైకెత్తి అద్దాలులేని చీకటి కిటికీలగుండా కప్పులేని ఒక యింటిలోకి చూడటం తటస్థించింది. రెండో అంతస్థులోని కిటికీలోంచి తనవేపు తొంగిచూస్తున్న ఒక అమ్మాయి అతని కంటబడగానే ఉలిక్కిపడ్డాడు వోంగు. ఆ యిళ్లల్లో యింకా మనుష్యులు నివశిస్తున్నారని అతను అనుకోలేదు. చీకట్లో ఒక తెల్లటి ముఖం అస్పష్టంగా కనిపించిందతనికి. ఆ ముఖం అందమైన స్త్రీ ముఖమని అతను అనుకున్నాడు. అతన్ని ఆమె చూసినపుడు ఆమె ముఖంమీద నవ్వువెలగడం అతనికి మరింత ఆశ్చర్యం కలిగించింది.

ఆ యింట్లో ఎటువంటి మనుష్యులుండేదీ తనకి తెలిసినట్లు అతను ముఖం తిప్పేసుకున్నాడు. కొత్త నాలుగో సైన్యంలోని వాళ్లు తిరుగుబోతు స్త్రీలను కళ్లెత్తి చూడరని ఆమెకు తెలిసివుండాలి. "ఆమె పామింగ్! సందేహం లేదు. పామింగే!" అన్న మాట అతని మనస్సులో మెదిలింది. ఉలిక్కిపడి మళ్ళీ పైకిచూశాడు. అతని మనస్సులోని మాట ఆమెకు వినపడి భయపడిందేమో అనుకునేట్లు ఆ ముఖం మాయమైపోయింది.

సైన్యంలోనించి యివతలకు వచ్చి కిటికీవంక చూస్తూ నిలబడ్డాడు వోంగు. తనని తప్పించుకోవాలని చూస్తోందా ఆమె? ఇంతకుముందు తనని చూసి నవ్వింది కదా! మెట్లమీదనించి చీకట్లో త్వరగా కిందకి వస్తోందేమో! తప్పటడుగువేసి కిందపడి మెడవిరుచుకుంటుందేమో! అనుకుంటూ యిదివరకు ఆ యింటికి ద్వారమైన నలుచదరం దోవగుండా అతను త్వరగా యింట్లోకి వెళ్లాడు.

ఒక నిమిషం అతనికంతా అగమ్యంగా వుంది. ఏం జరిగిందీ తెలియ లేదు. చల్లటిగాలి మొహంమీదకు వస్తోంది. నల్లని ఆకారాలు చుట్టూ తిరుగుతున్నట్లు కనపడ్డాయి. లేత ఊదా, నీలిరంగుల్లో నెత్తిమీద ఒక దీపం వెలుగుతోంది. కాళ్లదగ్గర మిడతలు కీచుమంటున్నాయి. అతను ఆరుబయట నుంచున్నాడు. ముందున్న గోడ తప్పితే మిగతా యిల్లంతా కూలిపోయింది. గోడవెనక రాళ్ళగుట్టలు తప్ప యింకేమీ లేవు.

రెండో అంతస్థులోని కిటికీలో అతనికి ఆమె ముఖం కనపడ్డది. ఆ కిటికీకోసం అతని కళ్లు వెతికాయి. ఎడమవేపునించి అది మొదటి కిటికీ. వీపు వెనక్కి తిప్పితే కుడివేపు మొదటి కిటికీ అదే. అది ఒక నలుచదరపు రంధ్రం. దుమ్ముతో నిండిన ఆ రంధ్రంగుండా నక్షత్రాలు కన్పిస్తున్నాయి. ఆ దృశ్యం చూస్తున్నపుడు అతని నడినెత్తి మంచుతో తడిసి, బిగుసుకు పోయింది.

నిర్మానుష్యంగా వున్న ఆ వీధిలో సైనికుల అడుగుల చప్పుడు అతనికి దూరంగా వినపడ్డది. సైన్యం దూరమయి పోవడంవల్ల అతనికి అమితమైన భయంకలిగింది. ఒక్క విసురులో వీధిలోకిపోయి సైన్యాన్ని కలుసుకునేందుకు పరిగెత్తాడు వోంగు.

అది అతన్ని కల్లోలపరిచే అనుభవమైనా అతనిలో ఉత్సాహం కూడా పొంగిపొర్లింది. తను చచ్చిపోయిందని అతను అనుకోవాలని ఆమె ఉద్దేశం కావటంవల్ల కనపడీ కనపడకముందే ఆమె మాయమైపోయిందని అతను నిశ్చయించుకున్నాడు. ఆమె అతనికి ద్రోహం చేసినట్లు తనకు తెలియడం ఆమెకు యిష్టంలేదు కాబోలు!

అంతలో అతను పొందిన శిక్షణవల్ల అతని మనస్సు కుదుట పడ్డది. తను పిచ్చినమ్మకాలకు లొంగిపోయి ఆమెను పోగొట్టుకోవడమే గాక, మళీకూడా పోగొట్టుకుంటున్నానని తెలుసుకున్నాడు వోంగు.

ఆమె సమాచారం కొన్ని ఏళ్ళతర్వాతగాని మళ్ళీ అతనికి తెలియ లేదు. కమ్యూనిస్టులు చైనాదేశం యావత్తూ స్వాధీనపరచుకున్నాక, సైన్యాలు ఒక ప్రదేశంనుండి యింకో ప్రదేశానికి మారుతున్నప్పుడు తననూ, తన భార్యనూ తెలిసిన ఒక పాత స్నేహితుడు వోంగుకి కనప డ్డాడు. హామింగును సూచౌ పట్నంలో తను చూసినట్లు అతను చెప్పాడు. అతను ఆమెను కలుసుకున్నప్పుడు అతనిని గుర్తుపట్టినట్లు కనిపించలేదామె.

అందువల్ల అతను ఆమెను మాట్లాడించలేదు. తరవాత అతను విచారించగా ఆమె తిరిగి వివాహం చేసుకున్నట్లూ, యిద్దరు పిల్లలు పుట్టినట్లూ, పేము సామానూ, గడ్డిచెప్పులూ అమ్మే సొంత షాపు ఒకటి ఆమెకున్నట్లూ తెలిసింది. ఈ సమాచారం వోంగుని కలవరపెట్టలేదు. ఆమె జీవించివున్నదనీ, ఎవరికో యిల్లాలుగా పిల్లలనుకంటూ ముసలిదవుతున్నదనీ వూహించుకుని సరిపెట్టుకోవడం వల్ల అతని మనోద్రేకం చల్లారింది.

పద్ధొమ్మిదేళ్ల తరవాత సొంత ఊరికి వెళ్లే అవకాశం కలిగింది వోంగుకు. అతని తల్లి యింకా బ్రతికి ఉందిగాని ఆమెతో అతనికి అట్టే సంబంధం లేదు. ఆమె తనను కలిగిన అంతులేని కష్టాలు, నష్టాలు, చిక్కులూ కథలుగా చెప్పింది. దుఃఖపడవద్దనీ, మంచి రోజులు వస్తాయనీ అతను ఎంత చెప్పినా ఆమె వూరట చెందలేదు. అతని కుటుంబంవారు అతని వివాహానికి యిదివరకే ఏర్పాట్లు చేశారు. చిన్నతనంలో అతనికి పెళ్లిచేద్దామనుకొన్న పిల్లను యింటికి తెచ్చి పెంచుతున్నారు. ఆమెను బానిసకంటే అన్యాయంగా చూస్తూ, యింటిపనులన్నీ ఆమె చేతే చేయించడంవల్ల ఆపిల్ల బక్క చిక్కిపోయింది. అయినా వోంగు ఆమెకు అన్యాయం చేయకుండా వివాహం చేసుకున్నాడు. సైన్యంనుండి అతను ఎప్పుడోగాని యింటికి తిరిగివొచ్చేవాడు కాడు. అతను వచ్చినపుడు ఒకసారికన్నా ఒకసారి వొంటరితనంతో బాధపడేవాడు.

వోంగుకి ఆప్తమిత్రులెవరూ లేరు. తనపై అధికారులతో తప్ప మిగతా అందరితోనూ అతను సాయిలా బాయిలాగా వుండేవాడు. ఎప్పుడు ఏ తప్పు జరిగినా అధికారులు అతనినే నిందించేవారు. సమావేశాల్లో అతను చక్కగా తర్కించి అతని అభిప్రాయం తెలిపినా అధ్యక్షుడు తన తుది ఉపన్యాసంలో అతని అభిప్రాయం సరైనది కానట్లు తేల్చి చెప్పేవాడు. కమ్యూనిస్టులు దేశాన్ని స్వాధీనపరచుకున్నాక అతనికి ఉద్యోగరీత్యా ఏమీ లాభించలేదు. పైగా మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా ప్రవర్తించలేని అసమర్థుడని ముద్దరవేశారతనికి. కరణం ఉద్యోగం జన్మాంతం వుండేది కనుక సైన్యంలోంచి విరమించిన తరువాత పల్లెటూరిలో ఒక చిన్న ఉద్యోగం యిచ్చారతనికి.

పార్టీ విధానాలతో వోంగుకి ఎలాటి వైరుధ్యమూ లేదు. పార్టీ విధానాలకు అడ్డుచెప్పకుండా వాటిని శిరసావహించడం అతనికి నేర్పు

బడ్డది. చిన్న విషయాలే అతన్ని కలతబెట్టేవి. అధికారుల భార్యలను గౌరవోద్యోగాలలో నియమించడమూ, పెద్ద ఉద్యోగాలలో వున్నవారిని పట్టుకుని ప్రాకులాడటమూ, అందరి జీవిత చరిత్రలను నిగూఢంగా దర్యాప్తు చేయడమూ అతనికి గిట్టేవి కావు. టిబెట్ ప్రతినిధులు వచ్చినపుడు వాళ్లను సంతోషపెట్టడానికి పెకింగు, షాంగాయ్ పట్టణాలలోని దేవాలయాలను పునర్నిర్మించి దేదీప్యమానంగా దీపాలు వెలిగించడం డబ్బు విరజిమ్మడంగా తోచిందతనికి. డబ్బు ఎక్కడనించి వస్తున్నదీ అతనికి తెలును. రైతుల నుండి అతనుకూడా డబ్బు వసూలుచేశాడు.

అతనికి తరచు ఆగ్రహం కలిగేది. స్నేహితులచేత చులకన చేయబడ్డ నిస్సహాయులైన వృద్ధుల కోపంలాటిదే అతని కోపమూ. ఎన్నడూ దీర్ఘ కాలం కోపంతో బిగదీసుకు పోయేవాడు కాడతను. కోపం నింగేసుకుని యిట్టే మామూలు మనిషి అయేవాడు. ప్రపంచంలో అతనికి మిగిలిం పార్టీ ఒక్కటే.

# ఏడో ప్రకరణము

చలికాలం బడిలో పిల్లలకు చదువు చెప్పడం 'క' అనుకున్నంత సులభంగా లేదు. స్కూలు భవనం అతనున్న చోటికి అయిదుమైళ్ళ దూరంలో ఉంది. అంతదూరం నడవడం అతనికి అలవాటు లేదు. అదీ కాక అతని కెప్పుడూ ఆకలి అయేది. ఉత్తరపుగాలి జోరుకి ఎదురు నడిచి, రొప్పుకుంటూ వూపిరాడని స్థితిలో అతను బడికి వెళ్లేవాడు. పూర్తిగా నీరసించి పోవడంవల్ల బ్లాక్ బోర్డుమీద సుద్దముక్కతో వ్రాయబోతే సుద్దముక్క మాటిమాటికీ చేతిలోంచి జారిపోయేది,

తిండి ఘోరంగా వుండేది. పల్లెటూరి ప్రాంతాల్లో ఏ కష్టాలు పడడానికైనా అతను సంసిద్ధుడే గాని సరైన భోజనం లేకపోవడం నిభాయించుకోలేక పోయాడు. భూ సంస్కరణోద్యమంలో పాల్గొనడానికి పల్లెలకు వెళ్లిన స్నేహితులు పల్లెటూళ్ళను గురించి గొప్పగా చెప్పారు. "రైతులు చాలా అమాయకులు. వాళ్లకు నీమీద యిష్టం కలిగిందా తింటున్న రొట్టెను కూడా నీకు యిచ్చివేస్తారు. నువ్వు తప్పకుండా దాన్ని తీసుకోవాలి. రైతు భార్య తన బిడ్డ పిర్రలు తుడిచిన గుడ్డతో కుర్చీ తుడిచి

నిన్ను దానిమీద కూర్చోబెడుతుంది. నువ్వు సందేహించి ఆమె మనస్సు కష్టపెట్టకూడదు" అని వాళ్లు అతనికి సలహా యిచ్చారు. రైతులు అంత అమాయికులుగా అతనికి కనబడలేదు. రొట్టెలు అసలే లేవు. వాళ్ళకున్నదల్లా గడ్డిపరకలు తేలుతూవుండే నీళ్ళగంజి.

ఈ విషయాలు అతను కార్మేడ్ వోంగుతోగాని మరెవ్వరితోగాని చెప్పలేదు. ఆ వూళ్ళోమాత్రమే స్థితిగతులు అంత అధ్వాన్నంగా వున్నదీ, దేశమంతటా అట్లాగే వున్నదీ తెలుసుకునే అవకాశం లేదతనికి. వార్తా పత్రికల్లో ఆ వూళ్ళోగాని, మరేప్రాంతంలో గాని కరువొచ్చినట్లు వ్రాయబడలేదు. దేశ కాలమానాలతో సంబంధం లేకుండా తను ఆకాశంలోంచి ఊడి పడ్డట్లనిపించిందతనికి.

ఆకలిబాధ అతని పేగులు కొరికి వేసింది. అతనాబాధ భరించలేక పోయాడు. పచ్చగా పెరిగే చేలూ, కొండ చరియల్లో చెట్లు కొట్టేజనం, దూరంగా వినపడే గంటలచప్పుడూ, లలితకళా సంస్థ యాజమాన్యాన నాట్యంచేస్తూ, భంగిమలు చూపుతూ ఏరువాక పాట నేర్పుతుంటున్న జనం అతన్ని ఆకర్షించలేదు సరిగదా అవేవీ అతని కళ్ళకు నిజంగా కనపడలేదు.

ఆ వూరిజనం యిబ్బందులు పడుతున్నట్లుగా గాక మామూలుగా జీవించడం అతనికి ఆశ్చర్యంగా వుండేది. వాళ్లు రోజూ మూడుసార్లు వండుకునేవారు. మధ్యాహ్నమయేసరికి పొగ గూళ్ళలోంచి పొగ రావడం ప్రారంభమయేది. పల్లెటూళ్ళలో యిళ్లకు తెల్లని గోడలు, నల్లని కప్పులు వుంటాయి. గోడలో ఉన్న నలుచదరపు రంధ్రాలనించి పొగ బయటకు వస్తూవుంటుంది. శరీరంలోంచి ప్రాణం బయటకు పోయి బ్రహ్మపదార్థంలో కలిసిపోయినట్లు పొగ నెమ్మదిగా బయటకు వచ్చి ఆకాశంలో కలిసి పోతోంది. ఆదృశ్యం చూస్తున్నప్పుడు కాన్ఫ్యూషియస్, యిందో గ్రంథంలో "మనుష్యులకు ఆహారమే దైవము" అని చెప్పిన మాటలు 'కు' కు జ్ఞాపకం వచ్చేవి. కుండలలో పల్చని గంజి పొయ్యిలమీద వుడుకుతున్నప్పుడు వచ్చే పొగను చూసి ఆహారమే దైవము అనుకునే వాళ్ళు గంజితాగి ఎట్లా బ్రతుకుతున్నారా అని ఆశ్చర్యపోయే వాడు 'కు'.

'కు' బరువు తగ్గిపోయాడు. బరువు తగ్గిపోతున్నందుకు చాలా ఆందోళన పడ్డాడతను. భూ సంస్కరణోద్యమంలో పాల్గొన్న కారంటా

పల్లెటూళ్లలో మూడు నెలలుండి లావయ్యామని గర్వంగా చెప్పేవాళ్లు. పల్లెటూళ్ళకు వెళ్ళడానికి భయపడి భూ సంస్కరణకు దూరంగా నిలబడిన వారితో "పల్లెటూరి జీవితం కష్టంగానే వుంటుంది కాని లావవుతావు" అని వాళ్లు చెప్పేవారు. లావుగాక చిక్కిపోతే దానికి కారణం మనస్సులో చెలరేగే సంఘర్షణలే అనుకోవాలనేవారు. తన స్నేహితులకు, తోటి ఉద్యోగులకు మొహం ఎట్లా చూపించనా అని 'కు' బాధపడ్డాడు. అక్కడ తను యింకా రెండుమూడు నెలలు వుంటే దిష్టిబొమ్మలాగా తయారవుతాడు. పల్లెటూరిలో క్షామం కలగడంవల్ల తనట్లా అయిపోయానని చెప్పి తప్పించుకోలేడు. తను అట్లా చెబితే దుష్ప్రచారం చేస్తున్న నేషలిస్టు గూఢచారి అని తనను అనుమానించి అరెస్టు చేసే ప్రమాదం వుంటుంది.

సరైన తిండి లేకపోయినా పార్టీ కార్యకర్తలు నిర్విరామంగా పని చేయడం 'కు' చూసి "పార్టీ కార్యకర్తలు భౌతికవాదం మానుకుని శరీరాని కన్నా ఆత్మ గొప్పదనే ఆధ్యాత్మిక వాదంలోకి దిగారు." అని చమత్కారంగా అనేవాడు. సౌందర్యవతీ, క్షయరోగి అయిన ప్రఖ్యాత షియోషింగ్ నాట్యకత్తె మిస్ టోటల్లి గ్రేగ్రెంట్ వు భూ సంస్కరణల్లో పాల్గొన్న సందర్భంలో జరిగిన గొప్ప ప్రచారం 'కు' జ్ఞాపకం చేసుకుని బాధపడ్డాడు. పల్లెటూరి కఠినవాతావరణంలో తన ఆరోగ్యం ఎట్లా బాగుపడ్డదీ గొప్పగా చెప్పుకుంటూ ఆమె తన స్నేహితులకు ఉత్తరాలు వ్రాసింది. తను వార్తాహరురాలిగా పనిచేస్తూ ఒక ఉత్తరం బట్వాడా చేయడానికి గడ్డి చెప్పులు తొడుక్కొని, రెండడుగులలోతు మంచులో ముప్ఫయి మైళ్ళ దూరం నడిచానని అన్నది. ఇప్పుడు తను పూటకు మూడు పెద్దగిన్నెల అన్నం తింటున్నాననీ, యిరవై పౌనుల ధాన్యం విసరగలుగుతున్నాననీ, చెప్పింది. మూడుగిన్నెల అన్నమా! తనూ మూడు పెద్ద గిన్నెల అన్నం తినగలననుకున్నాడు 'కు'.

తిండికి అంత మొహం వాచికూడా కష్టపడి పనిచేయడానికి 'కు' ప్రయత్నించాడు. భూ సంస్కరణల తరవాత రైతాంగం బాగుపడి, అభివృద్ధి చెందినట్లు నిరూపించే కథావస్తువు సంపాదించేందుకు అతను ప్రయాసపడ్డాడు. మొత్తంమీద దేశం భాగ్యవంతమైందనే అతనికి యింకానమ్మకం. "మొత్తంమీద" అనే మాట చాలా విలువగా కనబడిందతనికి.

అతను చాలామందితో మాట్లాడాడు. దగ్గర వూళ్లలో వున్న సైనికుల కుటుంబాలను చూడడానికి 'కు' వెళ్లేటప్పుడు కామ్రేడ్ వోంగుకూడా అతని వెంట వెళ్ళేవాడు. గ్రామ ప్రజలు చాలా మంచిగా వుండేవారు కాని మాట్లాడడానికి వాళ్లకు అట్టే విషయాలుండేవి కావు. అయినా కొంతమంది అతిగా మాట్లాడేవారు. 'కు' తమస్థితి బాగుచేయడానికి వచ్చిన ఓ పెద్ద ఉద్యోగని అనుకని ఉంటారు వాళ్లు. ఆగి ఆగి మాట్లాడుతూ, మాటలు మింగివేస్తూ యిదివరకు కంటే తమ స్థితి అధ్వాన్నమైందని వాళ్లు చెప్పేవారు. "వీళ్లు చెప్పేది సరి కాదు" అనే మాటతో వాళ్ళను పంపించివేసేసాకు కని పెట్టాడు 'కు'.

ముసలి అత్త మాటలు సరైనవని కామ్రేడ్ వోంగు అభిప్రాయం కావచ్చు. అయితే ముసలి అత్త యింట్లో వోంగు వుండలేదు కనుక ఆమె మాటలు విసుగు పుట్టిస్తాయని అతనికి తెలియదు. ఆమె సిగ్గులేకుండా అబద్ధాలు చెప్పే మనిషని 'కు' కొంతప్పుడు అనుకునేవాడు. గోల్డురూటుని, అతని భార్యని కలుసుకుని 'కు' మాట్లాడాడు. తన దగ్గర వాళ్ళు బిడియపడ్డట్లు కనపడ్డారు. వాళ్ళకు తనతో ఎక్కువ పరిచయం అయితే మనస్సు విప్పి మాట్లాడుతారని 'కు' అభిప్రాయపడ్డాడు.

గోల్డురూటు చలికాలం బడికి శ్రద్ధగా వెళ్లేవాడు. భర్త శ్రద్ధ చూపడంవల్ల మూన్ సెంటు కూడా శ్రద్ధగా బడికి వెళ్లేది. బళ్లో చెప్పిన "ది యాస్ట్ యాజ్ రెడీ," "బీట్ డవున్ ది అమెరికన్ వూల్వ్స్" అనే పాటల వరసలు ఆమె నేర్చుకున్నది. ఆమెకు పాఠాలమీద అట్టే శ్రద్ధుండేది కాదు. చదువు నేర్చుకుని బాగుపడాలన్న ఆదుర్దా ఆమెలో కనపడలేదు. పెళ్లి చేసుకుని సుఖంగా సంసారం చేసే చాలామంది స్త్రీలలాగా ఆమెకూడా బడివిషయం అట్టే పట్టించుకునేది కాదు.

గోల్డురూటు కాయితాలమీద తలుపు, బల్ల, కుర్చీ మొదలైన వస్తువుల పేర్లు వ్రాయమని 'కు' ని అడిగి, ఆ కాయితం ముక్కలను ఆ ఆ వస్తువులమీద అంటించాడు. ఆ మాటలు 'కు' వ్రాస్తూ వుండగా చూడడానికి గుమ్మంముందు జనం గుంపు చేరేవారు. మూన్ సెంటు [illegible]మీద నిలబడి, ఒక చెయ్యి గోల్డుహావ్ గాటు వదిన మెడమీద వేసి తొంగిచూస్తూ నిలబడ్డది ఓ రోజున.

"గోల్డుహాక్ గాట్ వదినా! మీ యింట్లోనే ఉపాధ్యాయుడుండగా నువ్వు చదువు నేర్చుకోకపోతే సిగ్గుచేటుగా ఉంటుంది" అంటూ వదినను ఒక్క తోపుతోసి నవ్వుకుంటూ పరిగెత్తింది మూన్ సెంట్.

తనను ఎవరూ హాస్యం పట్టించడం ఎరగని గోల్డుహాక్ గాట్ సిగ్గుపడి పిచ్చిగా నవ్వింది. ఆమెను చూసి 'కు' నవ్వాడు. చక్కటి యీ పల్లెటూరి పిల్లలు అప్పుడప్పుడు కొంచెం ధైర్యంగా కూడా వుంటారు అనుకున్నాడతను.

ఈమెను గురించి తను ఒక కథ అల్లవచ్చు. పట్నంలో ఉండికూడా దేశాచారాలు మరిచిపోని యువతి మూన్ సెంటు. 'భూమి దున్నుకు బతకండి' అన్న నినాదంవిని యీమె పల్లెటూరికి వచ్చింది. ఆ చుట్టుపక్కల ఉన్న వాళ్ళందరికంటే ఆమె కులాసాగా వున్నట్లు 'కు' కు తోచింది.

ఒకరోజున 'కు' షికారువెళ్లి వచ్చేటప్పటికి మూన్ సెంటు గుడ్డలుతికి చెట్టుమీద ఆరవేస్తోంది. ఎత్తుగానున్న చెట్టు కొమ్మలమీద లేత ఎరుపు రంగు అద్దకం గుడ్డతో కుట్టిన పొట్టినూలులాగులు అందంగా వేలాడుతున్నాయి. చలికాలం మధ్యలో కూడా ఆ చెట్టు పువ్వులతో కళకళలాడుతున్నట్లు కనబడ్డది. మూన్ సెంటు కాలంలో స్త్రీలు లావుపాటి దుస్తులు ధరించడంవల్ల గర్భిణులలాగు కనిపిస్తారు. వేసవిలో అయితే యీమె యింత బొద్దుగా వుంటుందా అని 'కు' అనుకున్నాడు. మందంగా వున్న లాగును నడుందగ్గర మడవటంవల్ల ఆమె తొడుక్కున్న చొక్కా పొట్టపైకి పోయింది.

"షాంగాయ్ పట్నంలోకన్నా ఇక్కడ చలిఎక్కువ" అన్నాడు 'కు'

మూన్ సెంటు అవును అన్నట్లు మందహాసం చేసింది. 'కు' సరిహద్దు రాయిమీద కూర్చుని షాంగాయ్ పట్నంలో ఆమె ఎక్కడ ఉండేదీ అడిగాడు. తన బసకు దగ్గరగానే ఆమె ఉండేదని తెలుసుకున్నాడు 'కు'. ఇంటికి దగ్గరగా బజారుంటే చాలా వీలుగా ఉంటుందని కూడా ఆమె అన్నది.

ఆమెతో మాట్లాడడానికి అతనికారోజు మంచి అవకాశం దొరికింది. మాటల సందర్భంలో అతని కుటుంబంలో ఎంతమంది ఉన్నదీ, నౌఖరులు ఎంతమంది ఉన్నదీ, యిల్లంతా అతని స్వాధీనంలో ఉన్నదీ లేనిదీ, షాంగాయ్ పట్నంలో అతనికి ఎవరెవరు బంధువులున్నదీ, ఎంత

మంది స్నేహితులున్నదీ అడిగిందామె. తనకూ, తన భర్తకూ పట్నంలో ఏమైనా ఉద్యోగాలు సంపాదించి పెట్టడంలో అతను సహాయపడగల డేమో తెలుసుకునేందుకే ఆమె తనను ఆ ప్రశ్నలన్నీ అడుగుతోందని అను కుని అతను కొంచెం భయపడ్డాడు.

ఆ రోజు తర్వాత అతను మళ్ళీ ఆమెను ఎప్పుడూ కలుసుకోలేదు.

అతను తన భార్యకూ, స్నేహితులకూ తరుచు ఉత్తరాలు వ్రాసే వాడు. వాటిని పోస్టు చేయడానికి ముప్ఫయిమైళ్ళు దూరం నడిచి వెళ్ళే వాడు. తరవాత హోటలుకు వెళ్ళి, అన్నమూ, మాంసమూ, కూరగలూ, స్వీట్లూ మొదలైనవాటితో భోజనం చేసేవాడు. అతనికి యిలా వెళ్ళడం చాలా యిష్టం. ఒకరోజు కామ్రేడ్ వోంగు వచ్చి పోస్టు చేయవలసిన ఉత్తరాలు ఏమైనా ఉన్నాయా అని అతన్ని అడిగాడు. వోంగు ఒక సమావేశానికి హాజరయేందుకు పట్నం వెళుతున్నాడు. పోస్టు చేయవలసిన ఉత్తరాలుంటే అతను పోస్టు చేయగలడు.

అప్పుడప్పుడు తృప్తిగా భోజనంచేసే అవకాశంకూడా తనకు లేకుండా చేస్తారా వీళ్లు అని 'కు' కు చాలా కోపం వచ్చిందిగాని అంతలోనే తేరు కున్నాడు. తను పట్నం వెళ్ళినపుడు వోంగు దొంగతనంగా తనను కనిపెట్టి చూశాడేమో! తృప్తిగా తింటున్నందుకు తనను చూస్తే అతనికి ఈర్ష్యగా ఉంటే ఉండవచ్చుగాని తన డబ్బుతో తను తింటున్నప్పుడు అతనికి అభ్యం తరం ఎందుకుండాలి అనుకున్నాడు 'కు'.

"పోస్టు చేయవలసిన ఉత్తరాలు ఏమీ లేవు" అన్నాడు 'కు' నవ్వుతూ. క్రితం రాత్రి అతను ఒక ఉత్తరం వ్రాశాడు. కవరు మూతకు వ్రాసిన జిగురు మంచిది కాకపోవడంవల్ల తన అదృష్టంకొద్దీ అది అతుకోలే లేదు. అతుక్కోనేందుకు దానిమీద ఒక పుస్తకం బరువు పెట్టాడతను.

తను అట్లా అబద్ధం చెప్పడం చాలా పిచ్చిపని. వోంగు ఆ పుస్త కాన్ని పైకితీయడం జరిగివుంటే ఆ ఉత్తరంలో తను ఏవో రహస్యాలు వ్రాశాడని అనుకునేవాడు. రహస్యాలు వ్రాయకపోతే ఆ ఉత్తరం యిత రుల చేతికి యివ్వడానికి తను ఎందుకు భయపడతాడని అనుమానపడతాడు వోంగు, కనుక వోంగుని త్వరగా ఆ గదిలోంచి పంపించివెయ్యడం అవ సరం.

"కొత్త సంవత్సరం వస్తూందికదూ! నీకు యింటిధ్యాస ఎక్కువయి ఉంటుంది" అంటూ 'కు' వీపుమీద చరిచి "ప్రియురాలునించి ఎడబాటు బాధగా వుందా?" అని వేళాకోళం పట్టించాడు వోంగు. కమ్యూనిస్టులు భార్యను కూడా ప్రియురాలు అనే అంటారు.

'కు' నవ్వి "కామ్రేడ్ వోంగ్! నువ్వు నీ ప్రియురాలిని చూడడానికి సంవత్సరాదికి వెళతావా?" అని అడిగాడు.

"నేను యీ మధ్య యింటికి వెళ్లలేదు. రెండేళ్లయింది. నాకు తీరిక ఉండదని నీకు తెలుసుగా!" అన్నాడు వోంగు నవ్వుతూ.

"కామ్రేడ్ వోంగ్! ప్రజాసేవలో నీకు ఆసక్తి ఎక్కువ. పొద్దస్తమానం పనిగానే ఉంటావు. నిన్నడిగి సంగతులు తెలుసుకునే అవకాశమే లేదు నాకు" అన్నాడు 'కు'.

"ఏమిటీ నమ్రత. కామ్రేడుల మధ్య నమ్రత అనవసరం" అన్నాడు వోంగు.

"అదికాదు. నీతో సంప్రదించవలసిన విషయాలు చాలా ఉన్నాయి. నువ్వు పట్నానికి వెళుతూంటే నీతో కూడా నేను దేవుడిగుడి దాకా వస్తాను. దోవలో మాట్లాడుకోవచ్చు" అన్నాడు 'కు'.

"అవును వెళుతున్నాను. అసలు యిదివరకే బయలుదేర వలసింది" అన్నాడు వోంగు.

వోంగుకోసం కామ్రేడ్ స్మాల్ ఛాంగు యింటిబయట కాచుకుని వున్నాడు. ఆ వూరిలో మిలిటరీ వాళ్ళకు తుపాకులు గాని, సైనిక దుస్తులు గాని లేవు. తుపాకులకు బదులు వాళ్లు కర్రలు, బల్లాలు, కత్తులు పట్టుకున్నారు. స్మాల్ ఛాంగు దగ్గరమాత్రం ఒక తుపాకీ వుంది. వెనక అంగరక్షకులు వస్తూండగా సేన గ్రామ వీధులవెంట నడిచి వెళుతూంటే చూడడానికి ముచ్చటగా ఉంది.

"నువ్వు వ్రాయవలసిన కథ ఏమన్నా తయారయిందా! భూసంస్కరణోద్యమం రోజుల్లో నువ్వు యిక్కడ ఉండవలసింది. నేను చెబుతున్నాను విను—నిజంగా అది ఒక గొప్ప అనుభవం" అన్నాడు వోంగు. ఈ మాట తరుచూ చెప్పడం అతనికి అలవాటు.

భూసంస్కరణల మాట ఎత్తి తనను మాటిమాటికీ ఎత్తిపొడవడం 'కు'కి కోపం తెప్పించింది. భూసంస్కరణ రోజుల్లో ప్రజాసేవ చేయ

డానికి అతను ముందుకు తాలేదు. ఆ రోజుల్లో అపరిమితంగా చలివేసేది. అతని ఊపిరి తిత్తులను గురించి అతని భార్య చాలా ఆందోళనపడేది. వోంగు తననుగురించి ఏమనుకుంటున్నాడో 'కు' గ్రహించాడు. తను రంగంలోకి ఆలస్యంగా వచ్చాడని అతననుకుంటున్నాడు.

"నిజంగా ఆవేశపూరితంగా వుండేది. భూస్వామియొక్క వ్యవసాయ పనిముట్లు రైతులు పంచుకుంటున్నప్పుడు వాళ్ళ కళ్లు సంతోషంతో మెరవడం నువ్వు చూడవలసింది" అన్నాడు వోంగు.

"అదంతా వెనకటి విషయం. ఈ రోజుల్లో అదేం పనికిరాదు సాహిత్య పత్రికలో యీ విషయం ఒక ప్రత్యేక వ్యాసం ప్రచురింపబడ్డది 'భూసంస్కరణ తరవాత రైతులు పొందిన సంతోషాతిశయాల గురించి రచయితలు వ్రాయకూడదు. అది తాత్కాలికమైన విషయం. రచయితలు ముందడుగు వేయాలి' అని ఆ వ్యాసకర్త వ్రాశాడు" అన్నాడు 'కు'.

ఆ ప్రముఖ పత్రికలో వ్రాసిన విషయాలపట్ల శ్రద్ధచూపుతూ వోంగు జాగ్రతగా విని "అవును, నిజమే. చేయవలసిన పని యింకా చాలావుంది" అన్నాడు.

"అప్పటికి పల్లెటూరి ప్రజ మనస్థితిని తీవ్రంగా విమర్శించింది ఆ సాహిత్యపత్రిక. భూములు సంపాదించుకున్న రైతులకు తినడం, తాగడం తప్ప వేరే ధ్యాస లేదు. 'పంటలు పండించి, ధనరాసులు పోగుచెయ్యి' అన్నదే వాళ్ళ ఆదర్శం. ఉత్తర దిక్కున ఉన్న ప్రజలు తమ ఆదర్శం తెలిపే పాట ఒకటి కట్టారు."

"ముప్ఫయి ఎకరాలు, ఒక గేదె, భార్య, పసిపిల్ల, వెచ్చని పక్క."

"అవును. అవును. వాళ్లలో రాజకీయచైతన్యం లేదు" అన్నాడు వోంగు.

"ఒక పందివుంటే కూతురి పెళ్లికి దాన్ని చంపి విందు చేస్తామంటారు వాళ్లు" అన్నాడు 'కు' ఏ పుస్తకంలోని మాటలో వల్లిస్తూ.

"అవును. రైతులు యింకా వెనకబడి వున్నారు. వాళ్లలో రాజకీయ చైతన్యం కలగాలి" అన్నాడు వోంగు విచారంగా.

"అంతర్సహాయ సంఘాలను స్థాపించే మీ ఉద్యమం ఎట్లా సాగుతోంది" అడిగాడు 'కు'.

"ఈ సంవత్సరం అకురాలుడు కాలంలో ఉద్యోగులవర్గం బాగా పని చేసింది. వచ్చే సంవత్సరానికి యీ ఉద్యోగుల వర్గాన్ని సహకార సంఘాలుగా మార్చివేస్తాము. అప్పుడు వాటిమధ్య సంఘీభావం మరింత బాగా కుదురుతుంది. గేదెల నన్నిటినీ స్వాధీన పరుచుకుని సంఘాలకు పంచుతాం. ఈల వేయగానే పొలాల్లో పనిచెయ్యడానికి రైతులు వుమ్మడిగా బయలు దేరుతారు" అన్నాడు వోంగు ఉత్సాహంగా.

రైతుకు యిటీవలే ప్రాప్తించిన భూమినుండి అతన్ని తప్పించి ఉమ్మడి వ్యవసాయ పద్ధతులు ప్రవేశపెట్టడానికి ఉపక్రమించడం 'కు' కు యిష్టంలేదు. ఈ సమస్యను అతను తీయబోయే చిత్రంలో ప్రవేశపెట్టకూడదని అతనికి తెలుసు. ఉమ్మడి వ్యవసాయ పద్ధతులకు రైతులు యిష్టపడరని నిరూపించడం చిత్రంలో అతిగా జరగవచ్చునీ, ప్రభుత్వ విధానాలకు ప్రజలు విముఖులుగా ఉన్నట్లు చిత్రిస్తే తనకు ముప్పు కలుగుతుందనీ 'కు' భయం.

ఉమ్మడి వ్యవసాయ పద్ధతులను సమర్థిస్తూ వోంగు పైకి మాట్లాడాడు గాని అతనికి లోపల భయంగానే ఉంది. అయితే అతనా విషయం ఒప్పుకోడు.

వాళ్లు మాట్లాడుకుంటూ గ్రామ సరిహద్దు ప్రవేశించారు. ముందున్న కాలవలోని నీళ్లమీద ఎండపడి నీళ్లు మెరుస్తున్నాయి. కాలవగట్టు వెంబడే నడుస్తున్నారు 'కు', వోంగు.

"రాజకీయ సేవ అంత సులభం కాదు. సారస్వత, కళారంగాలలో పనిచేసే మీ వంటి వాళ్లను చూస్తే నాకు అసూయగా ఉంటుంది. ఇప్పుడు యీ తరుణంలో అనేక ఉద్రేకపూరితమైన సంఘటనలను గురించి వ్రాసి వాటిని ప్రజల దృష్టికి తెచ్చే అవకాశముంది. ఇదివరకటి నిరంకుశ ప్రభుత్వం క్రింద ఏవేవి చెప్పకూడదో అవన్నీ యిప్పుడు నిర్భయంగా చెప్పవచ్చు. ఎక్కడ చూస్తే అక్కడ నీకో కథావస్తువు కనపడుతుంది" అన్నాడు. వోంగు.

నిజంగానే అది గొప్ప యుగమని 'కు' అంగీకరించాడు.

"నా చిన్నదనంలో నేనూ రచనలు చేస్తూండేవాడిని" అన్నాడు వోంగు దిగులుగా.

కమ్యూనిస్టు సిద్ధాంతాలమీద అప్పుడప్పుడే మోజు కలుగుతున్న వోంగు పాఠశాలా పత్రికలో ఎటువంటి విషయాలు వ్రాసివుంటాడో 'క' పూహించుకున్నాడు. కియాంగ్సు పట్టణంలో ఓ వార్తా పత్రికకు తను వ్యాసాలు వ్రాసిన సంగతీ, తరవాత దానికి సంపాదకుడుగా తను పని చేసిన సంగతీ వోంగు చెబుతూ ఉంటే 'క' మర్యాదకు విన్నాడు.

చలికాలంలో నదిలో నీళ్లు లోతుగా వుండవు. నది మధ్యన కనపడే గులకరాళ్ల గుట్టలు నదిలో కాంక్రీటు రోడ్డు వేస్తున్నారా అనిపించేటట్లు వుంటాయి.

అదృశ్యం చూడగానే తనకు కావలసిన కథావస్తువు 'క' మనస్సుకు తట్టింది. ప్రతి సంవత్సరమూ యీ నది పొంగి, పొలాలను నీటిలో ముంచి, పంట నాశనం చేస్తుందని అనుకుందాము. అప్పుడు ఆ వూరిలోని పెద్దలూ, పట్నంలోని యింజనీరు కలిసి ఆలోచించి నదికి ఆనకట్ట, ఆనకట్టలో తలుపు నిర్మిస్తే వరదల బాధ తీరిపోతుందని నిశ్చయిస్తారు. అధికార్లకు శాస్త్ర పరిజ్ఞానమున్నట్లూ, రైతాంగానికి వివేకమున్నట్లూ యీ సంఘటన నిరూపిస్తుంది. రైతుల సహాయం లేకుండా యింజనీరే పథకమంతా ఆలోచించినట్లు చూపితే విజ్ఞానులను గొప్ప చేసినట్లవుతుంది. తమ అనుభవం మీద ఆధారపడి రైతులు యింజనీరుకు తోడ్పడడానికి నిరాకరించినట్లు చూపితే రైతులు మూఢులని, చాదస్తులని తేలుతుంది. ఇద్దరినీ కలపడంవల్ల రెండు పక్షాలకూ న్యాయం జరుగుతుంది.

ఇంజనీరు, ఫాక్టరీ పనివాళ్ల నాయకులూ కలిసి సంప్రదించుకుని అద్భుతమైన పనులు సాధించినట్లు చూపే చిత్రాలు తీశారు. బాయిలరును మరమ్మత్తు చేయడం; పాతబడి, అరిగి, పనికిరాకుండా పోయిన 'లేత్'ను బాగుచేసి పనిచేయించడం, అమెరికా నించి దిగుమతి చేస్తేనేగాని సరిపోని దూది మరలోని యంత్రభాగాన్ని యిక్కడే సృష్టించడమూ, యిదివరకు తీసిన చిత్రాల్లో చూపించారు. ఇంతవరకు రైతాంగంతో సంబంధించిన కథ చిత్రించలేదు. తను యిప్పుడు యీ నూతన దృక్పథంతో చిత్రం తయారు చేస్తాడు.

ఈ ఆలోచన అతనిలో ఉద్రేకం కలిగించింది. వోంగుతో ముభావంగా వుండడం మానేసి "కామ్రేడ్ వోంగ్! యీ ప్రాంతాల ఎక్కడైనా ఆనకట్ట నిర్మింపబడ్డదా?" అని అడిగాడు 'క'.

తను చెపుతున్న వార్తాపత్రిక సంగతి చటుక్కున వదిలేసి ఆశ్చర్యంతో "ఆనకట్టా! ఈ ప్రాంతాల్లో లేదు. అయినా యిప్పుడు ఆనకట్ట సంగతి ఎందుకు? ఆనకట్ట చూడాలని ఉందా?" అని అడుగుతున్నప్పుడు ఆసక్తితో వోంగు కళ్లు మెరవడం, పెదవులు విప్పారడం చూసి వోంగు తనను అనుమానిస్తున్నాడని 'కు' గ్రహించాడు.

"ఏం లేదు. ఈ నది వేసవిలో పొంగి, పొలాలను ముంచివేసేట్లయితే యిక్కడ ఆనకట్ట కట్టడం మంచిదికాదా అని ఆలోచిస్తున్నాను" అన్నాడు 'కు'.

"ఈ నది ఎప్పుడూ పొంగనే పొంగదు."

"పొంగుతుందని అనుకుందాం. అట్లా అనుకుని ఒక కథ అల్లడానికి ప్రయత్నిస్తాను."

"సరేలే! ఈ శుభసమయంలో కథావస్తువుకు పనికివచ్చే సంఘటనలు అనేకం కళ్ళకు కనిపిస్తుండగా నువ్వు ఏదో కొత్తది సృష్టించడ మెందుకు? అదీగాక యీ నది అసలు పొంగనే పొంగదు" అన్నాడు వోంగు 'కు' ని ఆశ్చర్యంగా చూస్తూ. అతన్ని చూస్తే వోంగుకి నవ్వు కూడా వచ్చిందికాని నవ్వు ఆపుకున్నాడతను. అంతలో ఉన్నట్లుండి బాతుల గుంపొకటి నదిలో నీళ్ళ ప్రవాహం వెంబడి తేలుతూ, విలాసంగా పోవడం వాళ్లు చూశారు. తను ఆపేసుకున్న నవ్వు విచిత్రంగా ఆ బాతుల మీద వాలి, వాటితో ప్రవాహంవెంట కొట్టుకు పోయిందా అనిపించింది వోంగుకి. అతనూ, కూ బాతులను చూస్తూ తెల్లబోయారు.

# ఎనిమిదో ప్రకరణము

చలికాలమైనా ఉక్కగా ఉంది. భహుశా వాన కురుస్తుందేమో! మిడతల దండు ఒకటి చెట్టు చుట్టూ తిరుగుతోంది. మూన్ సెంటు ఆ దృశ్యం చూసి చెట్టు పొగ విడుస్తోందా యేం అనుకుంది.

"పంచాయితీ ఆఫీసులో సభ జరుగుతుంది. అందరూ తప్పకుండా రావాలి" అంటూ ఎవరో డప్పు వాయిస్తూ వూళ్లో ఒకవేపు నించి యింకో వేపుకు దండోరా వేస్తున్నారు.

సభకు వెళ్ళేటప్పుడు మూన్‌సెంటు తనతో కూడా కూతుర్ని కూడా తీసుకు వెళ్ళాలి. ఇంట్లో ఎవరూ లేరు. కూతురి చెయ్యి పట్టుకుని పక్క భాగంలోకి పోయి గోల్డుహావ్‌గాటు వదినను పిలిచింది మూన్‌సెంటు. గోల్డురూటు సభకు ఒంటిగా వెళ్ళాడు. మగవాళ్ళూ, ఆడవాళ్ళూ కలిసి సభలకు వెళ్ళినా విడి విడిగా కూర్చుంటారు. అలా విడిగా కూర్చోవాలన్న నిర్బంధం యేమీ లేదు.

కోపీష్ఠిపుత్తుడైన యోగి ఎవరో యిదివరకు నివసించిన గుడి యిప్పుడు పంచాయితీ ఆఫీసుగా మారింది. హాలుకు ఎదురుగా వున్న రాళ్లు పరిచిన ఖాళీస్థలంలో సభలు జరుగుతాయి. తెలిసిన వాళ్లను కేకలు వేసి పిలుస్తూ, మధ్యాహ్నపు ఎండకు కళ్లు మిటకరిస్తూ, ఒకరి నొకరు తోసుకుంటూ తిరిగారు అక్కడ చేరిన పల్లెప్రజ. రైతు సంఘాధ్యక్షుడు గొంతు సవరించుకుని మాట్లాడడం ప్రారంభించాడు.

మూన్‌సెంటుకు యీ సభలు యింకా కొత్తగానే ఉన్నాయి. పట్నంలో కన్నా పల్లెటూళ్ళలో యీ సభల సంరంభం ఎక్కువగా ఉన్నట్టు తోచిందామెకు. అధ్యక్షుడు సభికులను చేతులెత్త మన్నప్పుడు మూన్‌సెంటు నిదానంగా ఆఖరికి చెయ్యి ఎత్తేది. చేతులు ఎత్తమన్నప్పుడు స్త్రీలు ముసి ముసి నవ్వులు నవ్వేవారు. "చేతులెత్తడం సామాన్య విషయం. అది ఎంత పిచ్చిగా కనపడ్డా చేతులెత్తక తప్పదు" అంటున్నట్లుండేది వాళ్ళచూపు.

గోల్డురూటులేచి నిలబడి "కామ్రేడ్ వోంగు తన అభిప్రాయమేమిటో చెప్పాలని నేను ప్రతిపాదిస్తున్నాను" అన్నాడు. అధ్యక్షుడు చప్పట్లు కొట్టాడు. సభికులంతా అతన్ని అనుసరించారు. మూన్‌సెంటు గుండె దడదడ కొట్టుకుంది. ఇతరులు మాట్లాడడానికి లేచినపుడు ఎవరూ చప్పట్లు కొట్టలేదు. తన భర్త నిలబడి నోరు విప్పగానే అందరూ చప్పట్లు కొట్టారు. తనుకూడా చప్పట్లు కొట్టాలా? తనుకూడా చప్పట్లు కొట్టితే భార్య భర్త లేచినప్పుడు చప్పట్లు కొట్టిందని అందరూ నవ్వుతారు. చప్పట్లు కొట్టకుండా ఉంటే తనొక్కతె వ్యతిరేకత చూపుతున్నట్లవుతుంది. ఎటూ నిశ్చయించుకోలేని అవస్థలో ఆమె ఉండగా చప్పట్లు ఆగిపోయాయి. కామ్రేడ్ వోంగు మాట్లాడడానికి మెట్లు ఎక్కి గద్దెపైకి వెళ్లాడు.

సాంస్కృతిక ప్రదర్శనాల సంరంభాన్ని గురించి అతను దీర్ఘోప న్యాసం యిచ్చాడు. పల్లెటూరి ప్రజ ఉపయోగాని కన్నా 'కు' ను సంతోషపెట్టడానికే అతనా ఉపన్యాసం యిచ్చాడు.

చీకటి పడబోతుండగా 'కు' ను సభికులకు పరిచయం చేసి తను మాట్లాడిన విషయం మీదే అతనినీ మాట్లాడమని అడిగాడు వోంగు. ఇంత సేపూ సభికులు కాళ్లమీద నిలబడి ఉండడం వల్ల వాళ్ళకు కాళ్లేగాక, చేతులుకూడా పీక్కుపోతున్నాయి.

'కు' దయతలచి వుపన్యాసం త్వరగా ముగించాడు. సభ ముగిసిన తరవాత సభికులు ఏరువాక పాట పాడుతూ దేవాలయం బయట నాట్యం చేశారు. లాంతర్లు, కాగడాలు, ఎర్రని గోడలమీద సన్నని వెలుగు పరి చాయి. డప్పులు వాయిస్తూ అందరూ నాట్యం చేశారు.

గోల్డురూటుతో సహా యువకులు పసుపు పచ్చని రుమాళ్ళను తల చుట్టూ గట్టిగా కట్టుకున్నారు. రుమాళ్లు మొహాలమీద గట్టిగా కట్టు కోవడం వల్ల కనుబొమలు, కంటి కొసలు పైకి పీక్కుపోయి రాక్షసుల్లాగా కనపబడ్డారు వాళ్లు. ముందుకూ, వెనకకూ అడుగులు వేస్తూ, చేతులు వూపుతూ వాళ్లు నాట్యం చేశారు. మిగతా జనం నవ్వుముఖాలతో వాళ్ళను చూశారు. ప్రేక్షకులు ఒకరి నొకరు తోసుకుంటూ గల్లంతు ప్రారంభిం చారు. కొంత మందిని నాట్యం చేయమని ముందుకు తోశారు.

ఒక స్త్రీ బలవంతంగా ముందుకు తోయబడ్డపుడు "గోల్డురూటు వదినా! నువ్వుకూడా రా!" అంటూ మూన్‌సెంటుని చెయ్యిపట్టుకు లాగింది. మూన్‌సెంటు కిలకిల నవ్వుతూ కొంతసేపు పెనుగులాడింది కాని చివరకు నాట్యం చేసేవారి వరసలో కలిసి నిలుచోక తప్పింది కాదు. ఆమె యెప్పుడూ నాట్యంచేయలేదు. ఆమె పూర్వీకులు కూడా ఒక వెయ్యి సంవత్సరాల యీమధ్య ఎప్పుడూ ఆ ప్రాంతాల్లో నాట్యంచేయలేదు. వీళ్లు చేస్తున్న నాట్యం లాంటిదే షాంగాయ్ పట్నం వీధుల్లో బడి పిల్లలూ, ఫ్యాక్టరీ కార్మికులూ చేయడం చూసి చాలా బాగుందని అనుకున్న దామె. కాని తను నాట్యం చేయడానికి సిగ్గేసిందామెకు.

చివరకు కాగడాలు ఆర్పివేయబడ్డాయి. లాంతర్లు తెచ్చిన మనుష్యులు లాంతర్లు తీసుకు వెళ్లిపోయారు. అందరూ ఎవరిళ్లకు వాళ్లు వెళ్లిపోయారు. మూన్‌సెంటు తొడుక్కున్న లావుపాటి జాకెట్టుకింద చెమట కారు

తోంది. నాట్యం చేసిన అయాసంవల్లా, రాత్రి భోజనం చేయకపోవడం వల్లా ఆమెకు తల తిరిగింది. జనసమూహమంటే మూన్ సెంటుకు యిష్టమే. బెకన్ చెయ్యి పట్టుకుని గోల్డుహావ్ గాట్ వదిన వెనక్కే ఆమె నడిచింది. గోల్డురూటు దూరంగా ఎవరితోనో మాట్లాడడం ఆ చీకట్లో ఆమెకు విని పించింది. అతను తనకు కనపడక పోయినా, అతని మాటలు వింటూంటే ఆ మనిషి తన మనిషేకదా అన్న సంతోషం కలిగిందామెకు.

చంద్రుడు మబ్బుల వెనకకు పోయాడు. మబ్బుల అంచులమీద చంద్ర కిరణాలుపడి మెరుస్తూంటే అవి పెద్ద కొండ గుహల్లాగా కన పడ్డాయి. అంతలో సన్నగా వానచినుకులు పడడం ప్రారంభమైంది. పసుపు పచ్చని గుహలో వింతవెలుగు పుట్టినట్లు, మబ్బుల వెనకాల దాక్కున్న చంద్రుడు కనిపించాడు. గోల్డురూటు, మూన్ సెంటూ ఇంటికి చేరకముందే వాన పెద్దదయింది. తల దాచుకునేందుకు వాళ్లు పరిగెత్తారు.

గోల్డురూటు భార్యకంటే ముందు యింటికి చేరుకుని దీపం వెలి గించాడు. దీపంలోంచి పొగవచ్చింది.

"బెకన్ని మోసుకు వచ్చేటప్పటికి ప్రాణాలు పోయాయి. నువ్వు మాతోవస్తే కొంచెం సాయం చేసేవాడివికదా!" అంది మూన్ సెంటు కూర్చుంటూ.

"నేను మిమ్మల్ని చూడలేదు" అన్నాడు గోల్డురూటు.

మూన్ సెంటు కూర్చున్నదో లేదో యింతలో ఎవరో తలుపు దబదబ బాదారు.

ఇంటి కప్పుమీద వాన కురుస్తూన్న చప్పుడును మింగివేస్తూ "ఎవ రది?" అని అరిచాడు గోల్డురూటు. అతను వెళ్లి తలుపు తెరిచి చూస్తే గోల్డుహావ్ గాట్ తలుపు దగ్గర నిలబడి ఉంది.

"కామ్రేడ్ 'కు' గది కురుస్తోంది. నీళ్లు పట్టేందుకు మా దగ్గిర ఉన్న గిన్నెలు చాలవు. అతని వస్తువులన్నీ తడిసిపోతున్నాయి" అని చెప్పి ఒక మట్టికూజో, తొట్టో యివ్వమని ఆమె అడిగింది.

పెద్ద మట్టిజాడీ ఒకటి ఆమెకిచ్చి దానిని 'కు' గది దగ్గరకు మసుకుపోవడానికి మూన్ సెంటు ఆమెకు సహాయం చేసింది. వాళ్ళ యిళ్ళంతా చిందర వందరగా వుంది. 'కు' సామానులన్నీ ముసలి అత్త గదిలో చేర్చి పెట్టారు. పడుకోవడ మెక్కడా అన్న విషయం చర్చించుకుంటున్నారు

వాళ్లు. మూన్ సెంటు తిరిగి వచ్చి వాళ్లు పడుతున్న యిబ్బంది సంగతి భర్తకు చెప్పింది. ఆ రాత్రి తమ యింట్లో గడపమని 'కు' ని అడగడానికి వెళ్ళాడతను.

ముసలి దంపతుల ముఖాలమీద యిష్టమూ, అయిష్టమూ రెండూ ఒకేసారి కనపడ్డాయి. అతను తమ యింట్లోనించి వెళ్లుతున్నందుకు వాళ్లు ఎక్కువగా సంతోషించినట్లు లేరు.

"సరే! కప్పు మరమ్మతు చేయించేందుకు కొన్ని రోజులు పడుతుంది. అంతవరకు ఆయన మీ యింట్లో ఉంటాడు. వీలైనంత త్వరగా బాగు చేయిస్తాము" అంది ముసలి అత్త.

కాస్ట్రమేడ్ వోంగుతో సంప్రదించకుండా గోల్డురూటు యింటికి 'కు' ను పంపే ధైర్యం లేదు ముసలి అత్తకు. ముసలి మామ ఎత్తుపాటి బూడ్సులు వేసుకుని, ఒక చేతిలో లాంతరు, యింకో చేతిలో గొడుగూ పట్టుకొని జోరున కురుస్తున్న వానలో వోంగును కలుసుకోడానికి దేవాలయానికి బయలుదేరాడు. వోంగు అంగీకారం పొందికాని వాళ్లు 'కు' సామాను గోల్డురూటు యింట్లోకి చేర్చలేదు. ఇదివరకు గోల్డుఫ్లవర్ ఉండిన గది మూన్ సెంటు ఊడ్చింది. 'కు' పక్క గదిలో పరవటంలో ముసలి అత్త సహాయపడ్డది. ఆమె విధవ కోడలు అటువంటి పనులు చేయకూడదు. వాళ్ళ కుటుంబంలో వాళ్లంతా వచ్చి 'కు' గదిలో స్థిరపడటం చూసి వెళ్లారు. గది మారినందుకు 'కు' కూడా సంతోషంగానే వున్నాడు. కారు ఆ సంతోషం పైకి కనబడనీయలేదు. బెకను అతని సామాను దగ్గరే తిరుగుతూ అన్నిటినీ ముట్టుకు చూసింది. అందరి పిల్లలలోకీ బెకను అంటే 'కు' కు ఎక్కువ ముద్దు. ఆ పిల్లకు కూడా అతని దగ్గర బాగా చనువు.

చివరకు ముసలి అత్త, ముసలి మామ వెళ్ళడానికి లేచారు. కోడలు గోల్డుహీవ్‌గాటు వాళ్ళకు గొడుగుపట్టింది. వాళ్లు వానను తిట్టి నవ్వుకున్నారు. ఇంట్లో ఉన్న అతిథి వెళ్లిపోయినందు వల్ల వాళ్లు పెద్దగా మాట్లాడుకున్నారు. పెద్దగా దగ్గారు. గోల్డురూట్, అతని భార్య రహస్యంగా మాట్లాడుకోవలసి వచ్చింది. ఇంట్లో జబ్బు మనిషి వున్నట్లు వాళ్లు నెమ్మదిగా మాట్లాడుకోవడం 'కు' విన్నాడు. మధ్య మధ్య బెకన్ కీచుమంటూ అరవడం కూడా అతను విన్నాడు.

'కు' దీపంకేసి చూస్తూ పరుపుపైన కూర్చున్నాడు. ఇంటికి, భార్య దగ్గరకు పోవాలని ఉన్నట్లుండి అతనికి తహతహ కలిగింది. బల్లమీదవున్న వెదురుకర్ర సెమ్మాను జరిపి చోటుచేసి కాయితం, కలం తీసుకుని భార్యకు ఉత్తరం వ్రాయ ప్రారంభించాడు. తను యిదివరకున్న గది కప్పు కురిస్తుండడం వల్ల యింకో గదిలోకి మారిన సంగతీ, రైతులు తనమీద ఎంతో వాత్సల్యం చూపిస్తూ, తనకేం లోపం రాకుండా ప్రతి విషయమూ ఎంతో శ్రద్ధగా కనుక్కుంటున్న సంగతీ ఉత్తరంలో వ్రాశాడు. చలికాలంలో తను చేసే పనినిగురించీ, ఆ సాయంకాలం సాంస్కృతిక విలాసాల సంరంభం గురించి తనిచ్చిన ఉపన్యాసం సంగతీ కూడా వ్రాశాడు.

గాలి రొదచేస్తూ వీస్తోంది. వెదురు తడికలు గాలికి చప్పుడు చేస్తున్నాయి. గది మధ్య కట్టిన తడిక అవతల ముసలిమామ తాలూకు పంది అసహ్యంగా గుర్రు పెడుతోంది. గాలీ, వానా చేసే చప్పుడూ, తడిక సందుల్లోంచి పొడుగాటి చారలుగా నేలమీద పడుతున్న దీపపు కాంతీ ఆ పందిని భయపెట్టాయి.

చలికి కొంకర్లు పోయిన వేళ్ళను దీపం వేడిలో వెచ్చచేసుకునేందుకు ఉత్తరం వ్రాయడం ఆపాడు 'కు'. తలుపు కీచుమంటూ తెరుచుకుని గాలికి దీపం రెపరెప లాడింది. అతను తలుపు వేపు తిరిగి చూశాడు. మూన్‌సెంటు నవ్వుతూ లోపలికి వచ్చింది. దీపపు కాంతిలో ఆమె చాలా అందంగా వుంది. పుసంగ్ లింగ్ ఓ పాత కథలో వ్రాసినట్లు పుస్తకంలోంచి బయటికి వచ్చి పండితుణ్ణి రంజింప చేసిన అప్సరస లాగుందామె.

"కామ్రేడ్ 'కూ'! యింకా నిద్రపోలేదా?" అంటూ నిప్పులపైన బూడిద పోసిన ఒక వెచ్చని కుంపటి తెచ్చి అతని మంచంకింద పెట్టిందామె. ఇదివరకు ప్రతి రాత్రి ముసలి అత్త చేసేదీ పని. కుంపటి మంచం కింద పెట్టాలన్న ఊహ మొదట తట్టింది ఆమెకే. మొదట 'కు' కుంపటి అక్కర లేదన్నాడు. కాని తరవాత రాత్రి చలివేసినప్పుడు కుంపటి వెచ్చదనానికి సంతోషించాడు. ప్రతిరోజూ రాత్రి అతని మంచంకింద కుంపటి పెట్టమని ముసలి అత్త మూన్‌సెంటుకు చెప్పివుంటుంది. తన విషయం అంత శ్రద్ధగా కనుక్కుంటున్నందుకు ముసలావిడ మీద అతనికి కొంచెం కోపంకూడా వచ్చింది. ముసలి వాళ్లు, జబ్బువాళ్లు తప్ప మంచంకింద కుంపట్లు యింకెవరూ పెట్టుకోరు. ముసలి అత్త కుంపటి తెచ్చినపుడు

అతను అంత పట్టించుకోలేదు గాని మూన్ సెంటు కుంపటి తెచ్చినపుడు తనేం ముసలమ్మా అనిపించి మనస్సులో బాధపడ్డాడు.

"అయ్యో! ఇప్పుడది ఏం అవసరం!" అని గొణిగాడు 'కు'.

"ఇదేం ఓ పెద్దకష్టమా!" అంటూ అతనివేపు చూసి నవ్వి వెళ్ళి పోయింది మూన్ సెంటు.

మంచందగ్గర ఆ కుంపటి నల్లగా చూడడానికి అసహ్యంగా వుంది.

అతను మంచంమీద కూర్చుని చిరాకుగా కుంపటి వేపు చూశాడు. ఆ చలి కాలంలో చలికి అతను భయపడినంత యిదివరకెన్నడూ భయపడలేదు. సరైన పోషణ లేకపోవడం వల్లనే చలి తనకు అంత బాధ కలిగిస్తోంది. ఉత్తరం పూర్తిచేయడానికి అతను మళ్ళీ కలం తీశాడు. దీపం సన్నగా వెలుగుతోంది. ఒక వెదురు పుల్లతో వత్తి ఎగసన తోశాడు. దీపం ఆరిపోయింది. చీకట్లో అగ్గిపెట్టె కనిపించలేదు. సామాను సర్దేటప్పుడు అగ్గిపెట్టె తను ఎక్కడో పెట్టివుండాలి.

ఇక నిద్రపోవడం తప్ప అతను చేయగలిగిందేమీ లేదు. వాన కురుస్తోనే వుంది. ఆకలి వేస్తూ వుండడంవల్ల అతనికి నిద్రపట్టలేదు. మూన్ సెంటు జ్ఞాపకానికి వచ్చి చిరాకు వేసిందతనికి. లావుపాటి దుస్తుల్లో ఆమె అసహ్యంగా కనపడ్డది. ఎండాకాలంలో వాటిని విప్పేసినప్పుడు ఆమె ఎట్లా ఉంటుంది? అని ఆలోచించుకుంటూ పక్కమీద 'కు' అటూ యిటూ పొర్లాడు. కుంపటి బోర్లపడి, కంబళీ అంటుకుని, పెద్ద మంటలు లేస్తాయేమోనని భయపడ్డాడతను.

తెల్లవారుతుండగా అతనో నిశ్చయానికి వచ్చాడు. మర్నాడు వాన ఆగగానే ఉత్తరం పోస్టుచేయడానికి అతను పట్నంకి నడిచి వెళ్ళి, మామూలుగా హోటలులో భోజనం చేశాడు. పట్నంనించి బయలుదేరే ముందర కొన్ని సామాన్లు కొన్నాడతను. ఇది వరకు ఎప్పుడూ యింటికి సామాన్లు కొనే అలవాటు లేదతనికి. ఎండిన ఖర్జూరపు పళ్ళు, తేయాకు, సుగంధ ద్రవ్యాలు, ఊడకబెట్టిన కోడిగుడ్లు కొన్నాడతను. రైతులతో పాటుండి, వాళ్ళు తినేదే అతనూ తినాలని అతన్ని అక్కడకు పంపిన వాళ్ళ ఉద్దేశం. అందువల్ల ఆ వస్తువులు కొన్నందుకు తనేదో తప్పు చేస్తున్నట్లని పించిందతనికి.

ఆ రాత్రి 'కు' ఎర్రని ఖర్జూర పట్టుకూ అ పిల్ల సై[illegible] గుడ్డుపైనుండే పెచ్చులన్నీ పొట్లం కట్టాడు. ఉదయం [illegible]టప్పుడు అతనా పొట్లం తీసుకువెళ్ళాడు. పల్లెటూరి ప్రాంతాలు [illegible]గానూ, చిందరవందరగానూ ఉన్నా పనికిరాని చెత్త పారేసేందుకు అతనికి చోటు కనపడక పోవడం తమాషాగా ఉంది. కొండపైకి దూరంగా పోయి ఎత్తుగా పెరిగిన గడ్డిలోకి పొట్లం విసిరేశాడు.

అతని మేజోళ్ళు, చేతిరుమాళ్ళు మూన్ సెంటు ఉతికింది. సాయంత్రానికి అవి ఆరాయి. వాటిని జాగ్రత్తగా మడిచి అతని గదిలోకి తీసుకు వెళ్ళిందామె. కాసేపు అతని గదిలో కూర్చుని కబుర్లు చెప్పుకోవాలని ఆమె అనుకుంది. పట్నంనించి వచ్చిన 'కు' తో కొంచెం అల్లరి చిల్లరిగా వుండటానికి ఆమెకు అభ్యంతరం లేదుగాని ఆ సంగతి ఆమె ఒప్పుకోదు.

గదిలో చీకటిగా ఉంది. దీపం యింకా వెలిగించలేదు. మూన్ సెంటు గుమ్మంలో నిలబడ్డది. అతను తేయాకు నీళ్లలో ఉడకబెట్టిన గుడ్లు తింటూ ఉండడం మొదట ఆమె చూడలేదు. అది ఆమె కంటపడగానే యిద్దరూ కళవరపడ్డారు.

“కామ్రేడ్ 'కు'! మీ మేజోళ్ళు ఎండాయి” అంటూ వాటిని పరుపుమీద పెట్టి, తొట్రుపాటు చూపకుండా బయటకు వచ్చేసింది మూన్ సెంటు.

రాత్రి భోజనాల వేళ మిగిలిన రెండు గుడ్లూ తెచ్చి బల్లమీద పెట్టి భిడియపడుతూ వాళ్ళని తినమని అడిగాడతను. క్రిందటరోజు పట్నంనించి వాటిని తెచ్చాననీ, వాటి సంగతే మరిచిపోయాననీ చెప్పాడు 'కు'. తన మాటమీద నమ్మకం కలిగేట్లు చెప్పలేనందుకు తనమీద తనకే చిరాకు వేసిందతనికి. తిండికోసం మనుష్యులు నీచస్వభావం, రాక్షసత్వం ప్రకటిస్తారు. మనుష్యులలో ఆకలి పాడు కోరికలు పుట్టిస్తుంది. అటువంటప్పుడు తిండివిషయంలో అతను సజావుగా వుండడం చాలా కష్టం!

మూన్ సెంటు నవ్వుతూ తనకు గుడ్లు అక్కరలేదంది. గోల్డురూటు 'కు' చేతులు తోసివేస్తూ తనకూ గుడ్లు వద్దన్నాడు. 'కు' బలవంతపెట్టగా చివరకు అమర్యాదగా వుంటుందని వాళ్ళు గుడ్లు తినడానికి ఒప్పుకున్నారు. భోజనం చేస్తున్నంతసేపూ రోజూలాగా వాళ్ళు మాట్లాడుకోలేదు. గోల్డురూటు మర్యాదకి “ఔను. చాలా బాగుంది గుడ్డు” అన్నాడు. కాని

అతను అంత పట్టించుకోలేదు గాని వసువు అతిథితో చాలా సుభావంగానే తనేం మసలవు.

"ఆ రోజు తరవాత మూన్‌సెంటు 'కు' గదికి తరుచూ వచ్చేది కాదు. ఎప్పుడైనా రావలసివస్తే ఎవరితోనో పెద్దగా మాట్లాడుతూ తను వస్తున్న సంగతి 'కు' కు ముందు తెలియనిచ్చేది. అతను వేళ కాని వేళల్లో తింటూ వుంటాడని ఆమె అనుకోడం అతనికి చాలా న్యూనతగా వుంది.

బెకన్‌ని కూడా అతని గదిలోకి ఎక్కువగా వెళ్ళవద్దని చెప్పినట్లున్నారు. ఆ పిల్ల అతని గదివేపు ఆట్టే వచ్చేది కాదు. బెకను అతని గదిలోకి తొంగిచూస్తుండగా రెండు మూడుసార్లు తల్లి పట్టుకుంది. ఆమె ఆ పిల్లను పెద్దగా అరుస్తూ కోప్పడడం, కొట్టడం, ఆ పిల్ల ఏడవటం జరిగేవి.

'కు' ఏదో ఒక మిషమీద పట్నం తరుచూ వెళ్ళేవాడు. వచ్చేటప్పుడు ఖర్జూరపు కాయలు, రాళ్ళలాగుండే అరంగుళాల పొడుగాటి నువ్వుల కడ్డీలు, 'బంగారు నాణ్యం బిళ్ళలు' అనే పేరుగల చిన్న నువ్వు జీడీలు కొని తెచ్చేవాడు. ఇదివరకు నువ్వుల జీడీలు తిన్నాడు కాని, అవి నోట్లో సాగుతూ పళ్ళకు అతుక్కుంటాయని అతనికి తెలియదు. తలుపుకు వీపు ఆనించి దొంగచాటుగా తినడం చాలా అసహ్యమనిపించింతతనికి. కాని ఆకలి ఉపశమించి, మనస్సు కుదుటపడి, వ్రాత బాగా కొనసాగేది.

ఆనకట్టను గురించిన కథ అల్లుతూ ఎండకి వీపుపెట్టి యింటిముందు సావిట్లో ఒకరోజు కూర్చున్నాడు 'కు'. మూన్‌సెంటు చెట్ల నీడన కూర్చొని ఏమో అల్లుకుంటోంది. బెకన్ తల్లి పక్కన నిలబడి ఉంది. 'కు' తన పనిలో నిమగ్నుడై ఉండి వాళ్లు ఏం చేస్తున్నదీ కొంతసేపటిదాకా చూడలేదు. బెకను బుంగమొహం పెట్టుకుని మొండిగా తల్లిని తోస్తోంది. మూన్‌సెంట్ కూతురిని చూడలేదేమో ఆ తోపుడుకు కొంచెం తూలిపడ్డది. ఆ పిల్ల గొంతులో గురగురమంటూ, ముక్కుతో ఎగపీలుస్తూ చిన్న శబ్దాలు చేసింది. తల్లిని జాకెట్టు పట్టుకుని ఉండుండి లాగింది.

కూతురిని అవతలకు తోసివేస్తూ "ఎందుకా దుఃఖం? ఏం కావాలి? వేధించుకు తింటున్నావు! పక్కన కొత్తవాళ్లు ఉన్నారన్న మాటన్నా లేదు. రోజూ యిదే వరస. పోయిన జన్మలో నీకేం ఋణపడ్డానో నాకు తెలియటం లేదు. చావన్నా రాదు నీకు! చావరాదూ! ఎందుకూ కొరగావు. నిర్భాగ్యురాలా!" అని అరిచింది మూన్‌సెంటు.

చొక్కా చేతులతో కళ్లు తుడుచుకుంటూ ఆ పిల్ల పెద్దగా ఏడ్చింది. కూతురివేపు చూడకుండా కుట్టుకుంటూ యింకా తిట్టింది మూన్ సెంటు. కోపం చల్లారే సమయానికి యింకేదో జ్ఞాపకం వచ్చి ఆమె కోపం రెచ్చిపోయింది. కుట్టుతున్న గుడ్డ కింద పెట్టి, సూదిని జాగ్రతగా గుడ్డకు గుచ్చింది. ఏం జరగబోయేదీ ఆ పిల్ల గ్రహించుకుని చేతులు నలుపుకుంటూ భయంతో చుట్టూ తిరగడం ప్రారంభించింది. ఆ లేత ముఖం భయంవల్ల ముదిరిపోయినట్లు కనపడ్డది. ఉన్న దానికంటే ఎక్కువ బాధ, భయం ఆ పిల్ల ముఖంలో కనపడ్డప్పుడు ఏదో మృగంలాగుంటా పిల్ల. 'కు' నిర్ఘాంతపోయిచూశాడు. తనకంటే బలవంతుడైన శత్రువు తనమీదకు వస్తున్నట్లు 'కు' కు అక్కడనించి పారిపోవాలనిపించింది.

బెకన్ని తల్లి కొట్టింది. ప్రతి దెబ్బకూ ఆ పిల్ల ఏడుస్తూ అరిచింది.

"గోల్డురూట్ వదినా చాల్లే! యింక ఊరుకో!" అంటూ 'కు' వచ్చి వాళ్ళను విడదీయడానికి ప్రయత్నించాడు. "అపు! ఇంక చాల్లే! ఆ చిన్న పిల్లను పెద్దవాళ్లమల్లే ఉండమంటే ఎట్లా ఉంటుంది? యింక వదిలిపెట్టు" అన్నాడతను.

మూన్ సెంటు అతని మాటలు వినిపించుకో లేదు. అతను అడ్డు రావడంవల్ల ఆమెకు మరింత కోపం వచ్చింది. కూతురిని కొట్టడం అయినాక మూన్ సెంటు మళ్లీ కుట్టుకోడం ప్రారంభించింది. బెకన్ ముందు సావిట్లో నిలబడి కుళ్లి కుళ్లి ఏడ్చింది.

"కళ్లూ, ముక్కూ తుడుచుకో" అని మూన్ సెంటు కేకలేసింది.

'కు' వెళ్లి తన స్థానంలో కూర్చున్నాడు. సూర్యుడు అస్తమించగానే అతను కుర్చీ తీసుకుని తన గదిలోకి వెళ్లాడు. మూన్ సెంటు ఒకసారి కూడా తలెత్తి అతన్ని చూడలేదు.

బెకన్ బెదిరిపోయి మూతి ముడుచుకు కూర్చుంది. కొంచెంసేపట్లో ఆ పిల్లకు నిద్రవచ్చింది. కూతురిని పక్కమీద పడుకోబెట్టి పరుపుదగ్గర కూర్చుని మూన్ సెంటు కుట్టుకుంటోంది. కూతురిని కొట్టినందుకు విచారం వేసింది ఆమెకు.

"సంవత్సరాదికి పందిమాంసం కొని బెకన్‌కు కూరవండి పెట్టాలి" అంది మూన్ సెంటు భర్తతో.

మూన్ సెంటు తలతో పక్క గుమ్మం చూపిస్తూ "ఎవరితో పోట్లాడు తోంది?" అని భర్తను అడిగింది. గోల్డురూటు అయోమయంగా చూశాడు. ముసలి అత్త అరుపులు మూన్ సెంటు విన్నది. గోల్డురూటు బాధతో ముఖం ముడుచుకున్నాడు. మూన్ సెంటు అతని ముఖం చూడలేక పోయింది. భర్తకు బాధ కలిగించినందుకు ముసలి అత్తను చూస్తే ఆమెకు కోపమూ, అసహ్యమూ కలిగాయి.

"అత్తా! ఎందుకట్లా అరుస్తావు! నీ మాటలు మేం వింటే యిబ్బంది లేదు కాని యింకెవరన్నా విని నీమీద ఫిర్యాదు చేస్తే ఏం కాను! అపుడు నేరమంతా మాదని చెపుతావు. అవును! మేం తప్పించుకోలేము" అంది మూన్ సెంటు.

"నామీద ఫిర్యాదు చేస్తే నాకేం భయమా! నావంటి ముసలది యీ లోకంలో ఉట్టి కట్టుకుని కూర్చుంటుందా! గాలిలో దీపంలాగా, కప్పుమీది మంచులాగా నిమషంలో మాయమైపోతాను. పడుచువాళ్లు మీరు మీకు ముందుఆలోచన వుండాలి. మనస్సులో కుచ్చితం పెట్టుకుని యితరులకు హాని చేయకండి. మీరే చెడిపోతారు" అని అరిచింది అత్త.

"ఊరుకో! ఊరుకో! అనవసరంగా నోరు పారేసుకోక!" అన్నాడు ముసలి మామ.

"ఊరికే అందర్నీ తిటి పోస్తావెందుకు? ఏళ్లొచ్చి ఏం లాభం! ఏ కోశానన్నా పెద్దరికం ఉంటేగా! నీకంటే కుక్కనయం!" అని మూన్ సెంటు అరిచింది.

"నన్ను అనడానికి నీకెంత గుండె ధైర్యమే! నేను నీకంత లోకువగా కనపడుతున్నానా! నీకేమైనా యివాళ పిచ్చిపట్టిందా? నువ్వు తినేది అన్నమా, అశుద్ధమా?" అంటూ కోపంతో కేక లేసింది ముసలి అత్త.

"చాలు! నోళ్లు పారేసుకోవడం మానండి యింతటితో!" అన్నాడు ముసలి మామ యిద్దరినీ బతిమాలుతూ.

"అంతటితో పోనీ!" అన్నాడు గోల్డురూటు భార్యతో.

"ముసలి దెయ్యం! చావరాదూ దెయ్యం!" అని గొణుగుకుంది మూన్ సెంటు.

"ఏం! ఊరుకోమంటే ఊరుకోవా!" అన్నాడు గోల్డురూటు విసుగుతో.

"వెళ్లండి! నామీద ఫిర్యాదు చెయ్యండి. కావలిస్తే నా కోడల్ని కూడా పిలుచుకు వెళ్లి నామీద మహిళా సంఘానికి ఫిర్యాదు చేయించండి? పొండి!" అని అరిచింది ముసలి అత్త.

"నోరు మూసుకోమంటే మూసుకోవూ!" అన్నాడు ముసలి మామ పళ్లు బిగించి.

కొట్టుతున్నట్టూ, పోట్లాడుతున్నట్లూ చప్పుడు వినిపించింది.

"సరే! కొట్టు! అట్లాగే కొట్టు! ఈ వయస్సులో—మనమల్ని ఎత్తుకునే యీ వయస్సులో నన్ను కొట్తావా? ప్రాణం పోయేదాకా కొట్టు. నాకు బ్రతకాలనేం లేదు. ఏ మొహం పెట్టుకుని యింకా బ్రతుకుతాను" అంటూ ముసలి అత్త ఏడ్చింది.

ముసలి అత్త ఏడుస్తూ గదిలో ఒక వేపునించి యింకో వేపుకు దొర్లుతూంటే సామాన్లు చప్పుడౌతూ కిందపడ్డాయి.

"వెళ్లు! వెళ్లి వాళ్ళను సమాధాన పరచు" అన్నాడు గోల్డురూటు భార్యతో.

"నేనేం వెళ్ళను" అంది మూన్‌సెంటు.

చివరకి గోల్డురూటే వెళ్ళాడు.

"మామా! చాల్లే! ఊరుకో! పెళ్లిఅయిన యిన్ని ఏళ్ళకు యీ వయస్సులో! ఎవరైనా చూస్తే నవ్విపోతారు!" అంటూ ముసలి మామను అవతలకు లాగాడు గోల్డురూటు.

ముసలి అత్త ఒగరుస్తూ నేలమీద కూర్చుంది. తెల్లని ఆమె పొట్టి వెంట్రుకలు చెంపలమీద పడ్డాయి.

ముసలావిడ మూన్‌సెంటుని ఏమీ అనలేదనీ, ఉన్నట్లుండి ఆమెకు పిచ్చికోపం వచ్చిందనీ ముసలిమామ గోల్డురూటుతో ఆయాస పడుతూ, ఒగరుస్తూ, జాలిమొహం వేసుకుని చెప్పాడు. గోల్డురూటు ముసలాయన్ని వదిలించుకు వచ్చేశాడు. అతను వచ్చేటప్పటికి గదిలో మూన్‌సెంటు లేదు. ఆవిడ మహిళా సభకు వెళ్లింది.

ఆరోజు మొదలుకొని ముసలి అత్తా, మూన్‌సెంటూ మాట్లాడుకోడం మానేశారు.

# పదో ప్రకరణము

'క' ప్రతిరోజూ పంచాయితీ ఆఫీసుకు వెళ్ళేవాడు. అక్కడ కాగితాల మీద ఎక్కాలు వ్రాయడం అతని పని. ఆ కాగితాలను చుట్టలుగా చుట్టి కొత్త సంవత్సరం రాగానే రైతులకు అమ్ముతారు. ప్రతి సంవత్సరం ఎక్కాల కాయితాలు కొత్తవి కొని గృహ యజమానులు వాళ్ళ యిళ్ళ తలుపులమీద అంటిస్తారు. కాగితాలమీద వ్రాసిన అక్షరాలనుబట్టి వాటి ధరలు నిర్ణయింపబడేవి. పూర్వపు రోజుల్లో వాటిలో యీ విధంగా వ్రాయబడేది.

"దేశం సుఖప్రదంగా ఉంటుంది. ప్రతి యింట్లో కొడుకులు పుడతారు. ఈ యింట్లో భాగ్య భోగాలు తులతూగుతాయి."

కాని యిప్పుడు "మేయో అధ్యక్షుడు చిరకాలము వర్ధిల్లుగాక! కమ్యూనిస్టు పార్టీ చిరకాలము వర్ధిల్లుగాక!" అనే మాటలు సాధారణంగా వ్రాయబడుతున్నాయి.

వాటిలోని అక్షరాలు చక్కని దస్తూరిలో వ్రాయబడ్డాయి. ఎర్రని రంగు కాయితంమీదో, ముత్యంమల్లే మెరిసే తెల్ల కాయితం మీదో నల్ల సిరాతో వ్రాయబడిన అక్షరాలు వెనకటిలాగే తళతళ మెరిసేవి. కాని వెనకటి కాగితాలకూ యీ కాగితాలకూ చాలా తేడావుంది.

మంచు కురుస్తూ, అమితంగా చలివేస్తున్న చీకటి రాత్రి [illegible] బయలుదేరి గోల్డుహాట్ చెల్లెలు గోల్డుఫ్లవర్ పుట్టింటికి వచ్చింది. ఆమె వచ్చేటప్పటికి 'క' యింట్లోనే ఉన్నాడు. ఇంట్లో అందరూ ఒకచోట చేరి ఆ సంగతులూ, యీ సంగతులూ మాట్లాడారు. ఇంట్లో పరాయి మనిషి ఉండడంవల్ల ముఖ్య విషయాలేవీ వాళ్ళు మాట్లాడుకోలేదు. 'క' వెళ్ళిపోగానే గోల్డుఫ్లవర్ అత్తవారింట్లో తన కష్టాలగురించి చెప్పడం ప్రారంభించింది. తను కొత్తగా రావడంవల్ల మొగటా [illegible] తనను అత్త ప్రేమగా చూసేది. వాళ్ళకు కోపం వచ్చి తనమీద [illegible]. తనను గురించి చెడ్డగా మాట్లాడడం ప్రారంభించారు వాళ్ళు. [illegible]లనీ, తిండిపోతనీ, భర్త కడుపు కాల్చి అంతా తనే తింటుందనీ వాళ్ళు అన్నారు. తన అత్త వాళ్ళ మాటలు నమ్మింది. ఆమెకు చాలా కోపంవచ్చి

కొడుకుని చివాట్లు పెట్టింది. వాళ్లు చెప్పిందంతా అబద్ధం. తన అత్త వారింట్లో సరిగా అందరికీ తిండిలేక పోవడం మాత్రం నిజమే.

"మూన్‌సెంటు వదిన పొంగాయ్ పట్నంనించి వస్తూ, దోవలో నాకు తువ్వాలు, వాసన సబ్బు బహుమతి చెయ్యడం గురించి వాళ్లు చాలా చెప్పుకున్నారు. పుట్టింటికి వెళ్లి నేను డబ్బు అప్పు తీసుకురావాలని నా తోడికోడళ్లు మాచాయగా అనేవాళ్లు. మా అత్త బాహాటంగా నోరు తెరిచి అడగనే అడిగింది. అప్పు తేకపోతే కొత్త సంవత్సరం గడవడం కష్టమని చెప్పిందామె" అంది గోల్డుఫవర్.

"అయ్యో కర్మ! పల్లెటూళ్ళలో స్థితిగతులు అంత ఘోరంగా ఉన్నాయని నాకు తెలిసి ఉంటే నేనా వస్తువులు తీసుకు వచ్చి అనవసరంగా నీకు యిబ్బంది కలిగించేదాన్ని కాను" అంది మూన్‌సెంటు.

జాకెట్టు జేబుల్లో చేతులు పెట్టుకుని, నేలచూస్తూ గోల్డుఫవర్ ఒకే ధోరణిలో తన కష్టాలను గురించి చెప్పింది. గదిలో చాలా చలిగా వుంది. అంతా కిటికీలలో కూర్చున్నారు. ఊపిరి విడుస్తుంటే తెల్లని పొగ వాళ్ళ నోళ్లల్లోంచి బయటకు వస్తోంది.

"వదినా! కొంచెం ఓపిక పట్టు! నీ భర్త నిన్ను దయగా చూడడం నీ అదృష్టం! ఈ రోజుల్లో అందరి బ్రతుకులూ భారంగానే వున్నాయి. దానికి ఎవరేం చెయ్యగలరు! మేము యీ యింట్లో ఎలా గడుపుకొస్తున్నదీ ఎవరికి తెలియక పోయినా నీకు బాగా తెలుసు" అంటూ మూన్‌సెంటు తమ యింటి కష్టాలను ఏకరువు పెట్ట ప్రారంభించింది.

గోల్డురూటు వింటూ ఊరుకున్నాడు. అతని భార్య దగ్గర యింకా ఏమైనా మిగిలివుంటే అది కాస్తా చెల్లెలికి యివ్వాలని అతని అభిప్రాయం కాదు. తనూ, తన చెల్లెలూ గడిపిన చిన్ననాటి రోజులు తలుచుకున్నప్పుడు అతని కడుపు తరుక్కుపోయింది. తనకో చక్కని మిడత దొరికితే ఆమెకిచ్చేవాడు. చాంద్రాయణంలో తనియవాడు పట్నవాసులు వాళ్ళ పూర్వీకుల సమాధులను దర్శించడానికి పల్లెలకు వచ్చినపుడు వాళ్లు పంచిపెట్టిన ఉండ్రాళ్ళకోసం తను ఒక సమాధిదగ్గర నుంచి యింకో సమాధికి పరిగెత్తి బోలెడన్ని ఉండ్రాళ్లు సంపాదించేవాడు. అవి తనకీ, తన చెల్లెలికీ ఎక్కీ తొక్కీ సరిపోయేవి. వేసవి కాలంలో పొలాల్లో తను తూనీగలు పట్టుకునేవాడు. వాటిని గడ్డిపరకతో కట్టి వాళ్ళ అమ్మకు యిచ్చి, వాటి

వన్నిటినీ కరకరలాడుతూ కమ్మగా ఉండేట్లు నూనెలో వేయించమనే వాడు. తాము ఎప్పుడూ బీదగానే ఉండేవాళ్లు. తన తల్లి మట్టిజాడీలోంచి బియ్యం కొలుస్తున్నప్పుడు తను పక్కమీద పడుకుని కొలతపాత్ర జాడీ అడుగున చప్పుడు చేయడం వినేవాడు. కర్రు కర్రుమనే ఆ చప్పుడు విన్నప్పుడు తనకు విచారమూ, బాధా కలిగేవి.

ఓ రోజు తినడానికి యింట్లో ఏం లేకపోయింది. భోజనాల సమయానికి "ఆడుకుందాం రా చెల్లీ!" అని చెల్లెల్ని తను పిలిచాడు. గోల్డ్‌షవర్ అప్పుడు పసిపిల్ల. అందువల్ల ఎంత పొద్దెక్కినదీ ఆ పిల్లకు తెలియలేదు. పొలాల్లో తామిద్దరూ చాలాసేపు ఆడుకున్నారు. తమ తల్లి "గోల్డ్‌రూటూ, గోల్డ్‌షవరూ! రండి! భోజనానికి రండి!" అని పిలిచింది. తను ఆశ్చర్యపోయాడు. ఇంట్లోకి వెళ్లి చూస్తే, తన తల్లి విస్తినాలను కాచిన చిక్కుడు గింజలు తీసి ఉడకబెట్టింది. ఆ ఉడకబెట్టిన చిక్కుడు గింజలు చాలా రుచిగా ఉన్నాయి. తనూ, చెల్లెలూ అవి తింటూంటే తన తల్లి సంతోషంతో చూస్తూ నిలబడ్డది.

ఇప్పుడు తను పెద్దవాడయ్యాడు. సొంతానికి కొంత భూమి కూడా ఉంది. అయినా పరిస్థితులు బాగాలేవు. వెనకటిలాగా యిప్పుడూ తను నిస్సహాయుడే. తన చెల్లెలు కంట తడిపెట్టుకుని తన దగ్గరకు వస్తే [illegible] చేతులతో ఆమెను పంపివెయ్యవలసి వచ్చింది.

ఈ విధంగా మనస్సులో ఆలోచనలు పరిగెత్తుతూంటే కాళ్ళెడంగా పెట్టుకుని, నడుం వంచి, ఒక చెయ్యి మెడమీద వేసుకుని కూర్చున్నాడు గోల్డ్‌రూటు. గోల్డ్‌షవర్ తన కష్టగాథ చెప్పడం పూర్తయిన తరువాత యూన్‌సెంటు వంట చేయడానికి వెళ్లింది.

గోల్డ్‌రూటు కూడా భార్య వెనకాలే వెళ్లాడు. యూన్‌సెంటు మట్టి జాడీలోనించి బియ్యం కొలుస్తోంది.

"ఇవాళ గంజి చెయ్యొద్దు. శుభ్రంగా అన్నం వండు. మెతుకులు పొడిపొడిగా లెక్కపెట్టేందుకు వీలుగా వండు" అన్నాడు గోల్డ్‌రూటు.

"సరేలే! వెళ్లు! నా వెనకాలే యిలా వస్తే నీ చెల్లెలు ఏమనుకుంటుంది!" అంది నెమ్మదిగా యూన్‌సెంటు తల తిప్పకుండా.

గోల్డ్‌రూటు చెల్లెలి దగ్గరికి వచ్చాడు. ఆమె కళ్లు తుడుచుకొని బెకన్‌తో ఆడుకుంటోంది. ఆ పిల్ల చెయ్యిపట్టుకుని లేచి వెళ్లి 'వు' గదిలోకి తొంగిచూసి "నా పాతగది ఒకసారి చూడనీ" అంది గోల్డ్‌షవర్.

"లోపలికి వెళ్లకూడదు. వెళితే అమ్మ కొడుతుంది" అంది బెకన్.

"ఎందుకని ?" అడిగింది గోల్డ్‌ఫ్లవర్.

"ఆయన గదిలో ఉన్నప్పుడు గదిలోకి చూడకూడదు. ఆయన ఎప్పుడూ ఏదో తింటూంటాడు. అందువల్ల గదిలోకి వెళితే అమ్మ కొడుతుంది" అన్నదా పిల్ల.

అత్త చెయ్యి పట్టుకుని యింట్లో తిరగడం బెకన్‌కి బావుంది. అంతలో భోజనాల వేళ అయింది. ఎప్పటిలాగా పలచటి గంజి, గంజిలో తేలుతూ ఏవో కూరముక్కలూ వడ్డింపబడ్డాయి. గోల్డ్‌రూటుకు చాలా కోపం వచ్చింది. ఏమీ మాట్లాడకుండా గంజితాగి, దభీమని గిన్నె బల్ల మీద పడేసి బైటకుపోయి పైపు కాల్చుకున్నాడతను.

మంచుపడడం ప్రారంభమయింది. మొదట నల్లని కొండమీద తెల్లని మంచు కనపడ్డది. తరవాత తెల్లని ఆకాశంమీదనించి ముద్దలు ముద్దలుగా మంచు కురిసింది. గోల్డ్‌ఫ్లవర్ అత్తవారింటికి బయలుదేరుతానన్నది. మంచుపడడం ఆగేదాకా ఉండమని మూన్‌సెంటు అడిగింది కాని గోల్డ్‌ఫ్లవర్ త్వరగా వెళ్లాలని ఆతురత చూపుతూ లేచి నిలబడ్డది.

"అత్తా! వెళ్లొద్దు! మా దగ్గిరే ఉండు!" అంటూ బెకన్ అత్తని వదల్లేదు.

"అత్తని వెళ్లనివ్వకపోతే మామ వచ్చి నిన్ను కొడతాడు" అంది మూన్‌సెంటు నవ్వుతూ.

గోల్డ్‌రూటు తన పెద్ద మైనంకాయితం గొడుగు తెచ్చి ఆమెకిచ్చాడు.

గోల్డ్‌ఫ్లవర్ అన్నవేపు కాకుండా వదినను చూస్తూ "నీకిది అవసరముండదూ?" అంది.

ఎప్పుడైనా చాపల్లె మీదగా తామెవరైనా వెళ్లవలసి వచ్చినపుడు గొడుగు తెచ్చుకోవడం ఏమంత కష్టంకాదని చెప్పింది మూన్‌సెంటు. వీధి చివరదాకా మూన్‌సెంటు కూడా ఆమె వదినతో గొడుగులో వెళ్లింది. చెల్లెలి వెనక వూరి చివరదాకా గోల్డ్‌రూటు వెళ్లాడు. ఊరి సరిహద్దు చేరాక మాటామంతీ లేకుండా వెనక్కి తిరిగి వచ్చేశాడు.

యాంగ్‌టజ్ దక్షిణాన మంచు కురవడం ప్రారంభించి క్రమంగా వానగా మారుతుంది. అలాగే ఆ రోజు జరిగింది. మూన్‌సెంటు గొడుగు

లేకుండా ఇంటికి రావడంవల్ల వానలో తడిసింది. ఆమె వళ్లూ, తలా తుడుచు కుంటూండగా గోల్డ్‌రూటు వచ్చి ఆమెమీద విరుచుకుపడ్డాడు.

"గంజి వండవద్దని నీకు చెప్పాను. నా చెల్లెలు లేకపోతే అది నీ మొహంమీద పోసేవాణ్ణి" అన్నాడు గోల్డ్‌రూటు పట్టరాని కోపంతో.

"మనం రోజూ తినేదే ఇవాళా తిన్నాం. వదిన ఏం సరాయిదా!"

"నా చెల్లెలు ఎప్పుడో కాని రాదు. వచ్చినప్పుడు శుభ్రమైన వరి అన్నం పెట్టడానికి ఏడుస్తావేం?"

"ఆవిడకోసం ప్రత్యేకంగా యివాళ వరి అన్నం వండితే మనం రోజూ వరి అన్నమే తింటున్నామనీ, మనం ఏ యిబ్బందీ లేకుండా సుఖంగా వుంటూ కూడా తనకు డబ్బు అప్పు ఇవ్వలేదనీ అనుకుంటుంది."

గోల్డ్‌రూటు కొంచెం ఆగి ఆలోచించుకుని "మనల్ని గురించి ఎప్పుడూ అట్లా అనుకోదు" అన్నాడు.

"నీ చెల్లెలికి యింకా పసితనం పోలేదు. మన సంగతి మొగుడితో చెపుతుంది. అతను మిగతా వాళ్ళకు చెపుతాడు. అప్పుడు వాళ్లేమను కుంటారో ఆలోచించు."

"అది ఎవరికీ చెప్పదు."

"నేనైతే నీకు చెప్పకుండా ఉంటానా?"

తరవాత గోల్డ్‌రూటు మాట్లాడలేదు.

సాయంత్రమంతా వాన కురిసింది. చీకటివల్ల గది మసక మసకగా ఉంది. తడిసిపోయిన గుడ్డ చెప్పులు వాసనకొడుతున్నాయి. గోల్డ్‌రూటు వెళ్లి పక్కమీద పడుకున్నాడు. కొంచెంసేపుండి ఉన్నట్లుండి లేచి కూర్చుని మాసికలేసిన బొంతను చుట్టి బుజంమీద వేసుకుని తలుపుదగ్గరకు నడిచాడతను.

"ఏమిటిది? ఎక్కడకు వెళుతున్నావు?" అని అడిగింది మూన్ సెంటు.

"ఈ బొంత కుదవపెట్టి, ద్రాక్షరసం కొనుక్కుని తాగుతాను."

"ఏమైనా పిచ్చి పుట్టిందాయేం! అదిపోతే చలికి చచ్చి వూరు కుంటాం" అంటూ మూన్ సెంటు బొంతను గట్టిగా పట్టుకుంది.

"చస్తే చస్తాం. ఇట్లా బతికేకంటే చావడమే మంచిది."

"ఎక్కడయినా ఉంటా యిది; చలికి వణికిపోతూంటే ఉన్న బొంత కాస్తా కుదవపెట్టడం ఎక్కడన్నా ఉందా! చలితో చచ్చి పోవలసిందేనా!"

"డామినోస్ ఆడి గెలుస్తాను. ఆ డబ్బుతో బొంత విడిపిస్తాను."

"వీల్లేదు. వీల్లేదు" అని మూన్ సెంటు ఒగర్చింది.

ఆమె బొంతను పట్టుకుని లాగింది. అతను బొంతను విడవకుండా పట్టుకున్నాడు. ఆవిడకు ఆయాసం వచ్చి ఏడ్చింది. ఉన్నట్లుండి అతను పట్టు వదిలేసి, విసుగుతో వెనక్కి తిరిగాడు. ఆమె దబాలుమని నేలమీద పడ్డది. నెమ్మదిగా లేచి ఏడుస్తూ బొంతకు అతుక్కున్న దుమ్ము దులిపింది మూన్ సెంటు.

"అయితే నేనేం చెయ్యాలని ఈయన ఉద్దేశం; తోడి కోడళ్లనూ, బావగార్లనూ తృప్తిపరిచేందుకు చెల్లెలికి నేను డబ్బు యివ్వాలా! మేమేమో పస్తులుండి చావాలా!" అనుకుంది మూన్ సెంటు తనలో.

ఆ సంగతే ఆలోచించుకుంటూ కోపం పెంచుకుందామె. న్యాయం తన పక్షాన ఉన్నా తనేదో తప్పు చేసినట్లనిపించిందామెకు. గోల్డురూటు కుమిలి కుంగిపోవడం చూసి ఆమె భయపడ్డది.

రాత్రి భోజనాలయినాక మూన్ సెంట్ త్వరగా పడుకున్నది. బొంత కూతురికి కప్పి తను కప్పుకొంది. తరవాత గోల్డురూట్ వచ్చి పడుకుని బొంత కప్పుకోబోతే మూన్ సెంట్ బొంతను గట్టిగా పట్టుకుని "నీకు చలిలేదుగా! బొంత నీకెందుకూ!" అంది.

గోల్డురూట్ బొంత పట్టుకుని బలంగా లాగడంవల్ల మూన్ సెంట్, ఆమె కూతురూ కింద పడేటంతపని అయింది. దీపం ఆర్పేసి తొడుక్కున్న బట్టలతోటే మాట్లాడకుండా అతను పడుకోడం చూసి ఏది ఎట్లాపోయినా అతనికేం పట్టేట్లు లేదని ఆమె ఆశ్చర్యపోయింది.

గోల్డురూట్ చాలాసేపు మేలుకునే పడుకున్నాడు. ద్రాక్షరసం ఎట్లాగూ లేదు. దానికి బదులు భార్యను చేతుల్లోకి తీసుకుని తన కష్టాలు ఆమెకు చెప్పుకుందా మనుకున్నాడుగాని సిగ్గేసిందతనికి. ఖాళీ కడుపుతో వుండికూడా శృంగారం మానక భార్యచేత ఎగతాళి చేయబడ్డ బీదవాడి సంగతి చెప్పుకుని నవ్వుకోవడం చైనాలో మామూలు.

అర్ధరాత్రి అవుతుండగా భర్త నిద్రపోతున్నాడని నిశ్చయంగా తెలుసుకుని బొంత అతనిమీదకు కూడా లాగి, చీకట్లో తడిమి అతని వీపు కింద దాని అంచు దోపింది. అలవాటు ప్రకారం ఆమెను నిద్రలో అతను కావిలించుకున్నాడు.

# పదకొండో ప్రకరణము

పల్లెవాసులు చుట్టుపక్కల నున్న సైనికుల కుటుంబాలను కొత్త సంవత్సరారంభంలో సందర్శించి, సంవత్సరాది అభినందనలు తెలిపి, వారికి బహుమతులు యివ్వాలని రైతు సంఘం తీర్మానించింది. ప్రతి కుటుంబమూ ఒక పందిలో సగభాగమూ, సంవత్సరాది రోజున చేసే రొట్టెలు నలభై యివ్వాలని నిర్ణయింపబడ్డది. తామిచ్చే బహుమతులకు అందరూ ఎర్ర రంగూ, ఆకుపచ్చ రంగూ గుడ్డపీలికలు అందంగా చుట్టాలి. ఏగురాళ్ళ [illegible] పాడుతూ, నాట్యం చేస్తూ సైనికుల కుటుంబాలు వుండే యిళ్లకు వెళ్లి వాటిని యివ్వాలి. ఏ తలితండ్రుల కొడుకులు సైన్యంలో పనిచేస్తున్నారో వారి యిళ్ల తలుపులకు "కీర్తి చెందిన కుటుంబం" అనే వాక్యం వ్రాయబడ్డ ఎర్ర కాయితాలు అంటించాలి. అలా అంటిస్తున్నప్పుడు బాణ సంచా కాల్చాలి.

పందులు పెంచని గృహస్థులు పందికి బదులు డబ్బు యివ్వాలి. బాణసంచా కోసరం అందరూ తలా కొంచెం డబ్బు యివ్వాలి. పన్నెండో నెల యిరవై అయిదో తేదీలోగా అందరూ తమవంతు చందాలను పంచాయితీ ఆఫీసులో చెల్లించాలి. ఈ విధంగా తీర్మానింపబడ్డా యిరవై అయిదో తేదీకి ఒక్కరూ చందాలు చెల్లించలేదు. తీర్మానప్పుడే రైతులందరూ చేతులెత్తి ఏకగ్రీవంగా అంగీకరించారు గాని వాళ్లు చేయవలసిన పనేమిటో వాళ్లకు తెలియదు. ప్రతిరైతూ తన పొరుగు రైతు ఏం చేస్తాడో చూసి అతన్ని అనుసరిద్దామని అనుకున్నాడు.

రైతు సంఘం అధ్యక్షుడూ, మహిళాసభ అధ్యక్షురాలైన అతని భార్యా సభలు జరిపి, ప్రతి కుటుంబంతోనూ ప్రత్యేకంగా సంప్రదించారు గాని ప్రయోజనం లేకపోయింది. కామ్రేడ్ వోంగు యింటింటికీ వెళ్లి

రైతులను వొత్తిడి చేయవలసి వొచ్చింది. అతను గోల్డురూటు యింటికి వచ్చి "గోల్డురూట్! నువ్వు ఆదర్శ కర్షకుడివి. ఈ పల్లెలో కల్లా చెప్పుకో తగ్గ వాడివి. మిగతా వాళ్ళకు నువ్వు మార్గదర్శకుడివిగా ఉండాలి. ఈ పని మనం జయప్రదంగా కొనసాగించాలి. ఇది రాజకీయ వ్యవహారం. రాజకీయంగా యిది చాలా ముఖ్యమైన విషయం. నువ్వు పట్టించుకోక పోతే ఎట్లా? ప్రజోద్ధరణకు పని చేస్తున్న సైన్యాలలో వున్న సిపాయీల కుటుంబాలను మనం కనిపెట్టి వుండాలి. ప్రజోద్ధరణ సైన్యం లేకపోతే నీకు భూమి దక్కేదా? వెనకటి రోజుల్లో సైనికులు ప్రజలను కష్టాల పాలు చేసేవారు. ఇప్పుడట్లా కాదు. ఇప్పటి సైన్యం ప్రజలది. ప్రజలు, సైనికులు ఏక కుటుంబీకులుగా మెలగాలి" అని చెప్పాడు.

చందా కట్టేందుకు డబ్బుగాని, సంవత్సరాది రొట్టెలు చేయడానికి బియ్యంగాని తను ఎక్కడా పుట్టించలేక పోయాననీ, రెండు నెలలనించీ తాము గంజితాగి బ్రతుకుతున్నామనీ గోల్డురూటు చెప్పాడు.

కట్టె విరిచినట్లు గోల్డురూటు మాట్లాడడం వల్ల అతని భార్యకు భయం కలిగింది. ఆమె అడ్డువచ్చి జాలి గొలిపే మంచి మాటలతో తమ కష్టాలను గురించీ, యిబ్బందులను గురించీ వోంగుకి చాలాసేపు చెప్పింది.

"ప్రతి కుటుంబంలోనూ ఏవో కొన్ని కష్టాలు ఉంటూనే ఉంటాయి. మిగతా పల్లెల్ని చూడండి! మీకంటే వాళ్లు ఏమంత మంచిస్థితిలో లేరు. అయినా వాళ్లు సైనికులకు కొత్త సంవత్సరం బహుమతులు కొనియిచ్చారు. వాళ్ళకున్న దేశభక్తి మనకు మాత్రం లేదూ!" అని వోంగు నవ్వుతూ చెప్పాడు. అతను బల్లమీద ఒక కాలు పెట్టి వాళ్ళతో కాసేపు బాతాఖానీ చెయ్యడానికి సిద్ధపడ్డాడు.

గోల్డురూటు తనదగ్గర డబ్బుగాని, బియ్యంగాని లేవని మూడోసారి చెప్పాడు.

"మీ స్థితిగతులు బాగాలేవని నాకు తెలుసు. కొందరు మీకంటే మరీ అధ్వాన్నమయిన స్థితిలో వున్నారు. నీ భార్య పట్నంలో పని చేసింది. మీ యిద్దరూ పొలం పండిస్తున్నారు. మీ కుటుంబం చిన్నది. మిగతా వాళ్లు తినే తిండికన్నా మీరు తింటున్న తిండి ఎన్నో రెట్లు నయం" అన్నాడు వోంగు.

గోల్డురూటు ముఖం చిట్లించుకున్నాడు. అతని భార్య యింటికి వచ్చిన రోజున వోంగు వాళ్ళ యింటికి వచ్చాడు. అప్పుడతను మిగతావాళ్ళు తాగే గంజికన్నా చిక్కని గంజి వాళ్లు తాగడం చూశాడు. ఆ విషయం వోంగుకు జ్ఞాపకం ఉంది. తన లోపంవల్లే అప్పుడది జరిగింది. ఆ విషయం మనస్సుకు తట్టి గోల్డ్‌రూటుకు ఒళ్లు తెలియని కోపం వచ్చింది. అతను పట్టలేని కోపంతో "కామ్రేడ్ వోంగు! చుట్టుపక్కల ఎవరినైనా అడుగు. మేం ఏం తింటున్నదీ వాళ్లు చెబుతారు. ఎవరికీ తెలియకుండా మేమేం దొంగతిళ్లు తినటం లేదు. మాకున్న బియ్యం అయిపోవచ్చాయి. సంవత్సరాదివస్తోంది. మా గతి ఏం కావాలని ఆలోచించినపుడు నాగుండె తరుక్కుపోతోంది" అన్నాడు.

భర్తని ఆపాలని మూన్ సెంటు చాలా ప్రయత్నించింది. కామ్రేడ్ వోంగు నవ్వుతూ అతనితో వాదించాడు. వోంగుకి వాదించడం బాగా అలవాటు. గంటలకొద్దీ వాదించాడు గాని తను చెప్పేది ఒకటీ, గోల్డ్ రూటు చెప్పేదొకటీ కావడంవల్ల ఆ వాదనకు అంతంటూ లేకపోయింది. తను చాలా అధమాధమైన స్థితిలో వున్నానని గోల్డ్‌రూటు వాదించాడు. సైనికుల కుటుంబాల పట్ల గోల్డ్‌రూటు విధిని గురించి వోంగు గుక్క తిప్పుకోకుండా చెప్పాడు.

ఉన్నదానికి యింకింత కల్పించి చెప్పక ముందు విషయం కొంచెం ఆలోచించు!" అన్నాడు వోంగు.

"రేపు వసంత కాలం వచ్చేటప్పటికి తినడానికి మాకు ఏమీ వుండదే. మేమేం చెయ్యాలి? ఉమ్మడి వంట ఏర్పాటు చేస్తారా?" అని అడిగాడు గోల్డ్‌రూటు.

ఉమ్మడి వంట సంగతి ఎత్తేటప్పటికి వోంగు గాభరా పడ్డాడు. రైతులదగ్గరున్న బియ్యం అన్నీ పోగుచేసి కమ్యూనిస్టులు ఉమ్మడివంటలు ఏర్పాటు చేస్తారని దేశవిముక్తికి పూర్వం రోజుల్లో నేషనలిస్టులు చెప్పి ప్రజను భయపెట్టేవారు. ఉమ్మడి వంట అంటే రైతులకు అప్పుడు అమితమైన భయం. ఇప్పుడు ఉమ్మడి వంటలు ప్రభుత్వం ఏర్పాటు చేస్తే బాగుంటుందని రైతులు ఎంతో కోరుకుంటున్నారు.

"ఉమ్మడి వంట గురించి కలలు కనకుండా, ఎక్కువ పంట పండించడానికి ప్రయత్నిస్తే మీరు బాగుపడతారు" అన్నాడు వోంగు మొహం

చిట్లిస్తూ. ఎప్పుడూ చిరునవ్వుతో వెలిగే అతని ముఖం ముడతలు పడి భయంకరంగా వుంది.

"ఆయన మాట వినిపించుకోక వ్రాన్మేడ్ వోంగ్! నిన్న మా కంబళీ కుదువపెట్టి తాగుతానంటే వీలులేదని అడ్డుపడ్డాను. అందువల్ల ఆయనకు కోపంగా ఉంది" అంటూ నీళ్ళు నమిలింది మూన్ సెంటు.

వ్రాన్మేడ్ వోంగూ, గోల్డ్ రూటూ కూడా ఆమె మాటలు వినిపించుకోలేదు.

"వసంతకాలం కరువు తరవాత వేసవికాలం కాటకం వస్తుంది. అప్పుడు మాగతేం కాను!" అని అరిచాడు గోల్డ్ రూటు.

"నీ తరహా యేం బాగాలేదు గోల్డురూట్! నువ్వు కష్టపడి పొలం బాగా పండించావని యింతసేపు ఓపిక పట్టాను. మితిమీరవద్దు. నిన్నెవరో వెనకనించి పురిగొల్పుతున్నట్లుంది" అన్నాడు వోంగు బల్ల గట్టిగా గుద్దుతూ.

వాళ్ళు మాట్లాడుతుండగా మూన్ సెంటు అక్కడనుంచి చల్లగా జారుకుంది. ఆమె అతన్ని పురిగొల్పుతోందని వోంగు ఉద్దేశం. మూన్ సెంటు మంచంపక్కన ఉన్న చీకటి గూడు దగ్గరికి వెళ్ళి ఏదో పట్టుకు వచ్చింది. "వ్రాన్మేడ్ వోంగ్! నా దగ్గర కొంచెం డబ్బుంది. ఆ సంగతి ఆయనకు తెలియదు. నాదగ్గర మిగిలివున్నదంతా యిదే. ఈ డబ్బు తీసుకుని మా పంతు బాణసంచా కొనండి. సైనికుల కుటుంబాలకు బహుమతి యివ్వవలసిన సగం పంది ఖరీదు కూడా తీసుకోండి" అంటూ మూన్ సెంటు నవ్వు ముఖంతో వోంగుకు డబ్బు యివ్వబోయింది. కాని ఆమె మనస్సులో మాత్రం గాభరాగానే ఉంది.

మూన్ సెంటు మాటలు వినిపించుకోనట్లు బల్ల గట్టిగా గుద్దుతూ యంగు గోల్డ్ రూటుమీద అరిచాడు. అంతసేపూ మూన్ సెంటు చూస్తూ ఊరికే నిలబడి వుంది. గోల్డ్ రూటు ఆమెని చంపేసేటట్లు చూశాడు.

చివరకి వోంగు మూన్ సెంటువేపు తిరిగి "ఈ సంగతి నువ్వు మొదటే యెందుకు చెప్పలేదు! ఒక్క దమ్మిడీకూడా లేదంటూదొంగవేషాలు వేసి ప్రజా ప్రభుత్వాన్ని ప్రజలే మోసం చేయడమా!" అన్నాడు కఠినంగా.

"అవును. తప్పునాదే! నాదగ్గిర డబ్బువున్నట్లు ఆయనకు తెలియదు. నిజంగా ఆయనకు తెలియదు" అన్నది మూన్ సెంటు.

"కొత్త సంవత్సరం రొట్టెలు ఎల్లుండికల్లా తయారు చెయ్యి. వ్యవధి లేదు. నీ భర్తతో మాట్లాడి అతన్ని సరైన దోవకు తీసుకురా. ఇవాళ అతని ధోరణి ఏం బాగాలేదు" అన్నాడు వోంగు.

కార్మేడ్ వోంగు వెళుతూంటే గుమ్మందాకా మూన్ సెంటు అతనితో వెళ్లింది. వోంగు కంటికి మరుగయ్యేదాకా మర్యాదకు గుమ్మంలో నిలబడ్డాదామె. అంతలో ఎవరో వెంట్రుకలు పట్టుకుని తనను వెనక్కు లాగినట్లనిపించిందామెకు.

గోల్డ్‌రూటు భార్యను ఎడాపెడా చెంపలు వాయించాడు. ఆమె అతన్ని కాళ్ళతో తన్నుతూ ఆడపులిలా పోట్లాడింది. వోంగుకు వినపడుతుందన్న భయంతో ఆమె కేకలు పెట్టలేదు.

గోల్డురూటుకు కోపం ఆగలేదు. "నీదగ్గర డబ్బు వుందన్న మాట. దాన్ని విరజిమ్ముతున్నావు. నీపాడు డబ్బు ఎవరికి కావాలి. నన్ను అబద్ధాలకోరు చేశావు. అందుకు నీకు తగిన శాస్తి చేస్తానుండు" అన్నాడు గోల్డురూటు.

అరవకూడదనుకున్నా అతని దెబ్బలకు ఆగలేక ఆమె కేక పెట్టింది. ముసలి మామా, అత్తా గబగబా వచ్చారు. మూన్ సెంటూ ముసలి అత్తా పోట్లాడడం, ముసలి మామ భార్యను కొట్టడం జరిగినప్పటి నుంచీ ముసలి అత్తకూ, మూన్ సెంటుకూ మాటలు లేవు. అయినా ముసలి అత్త మనస్సు మెత్తనిది కావడం వల్లా, ఎవరికే కష్టం వచ్చినా ఆదుకునే స్వభావం కలది కావడం వల్లా ఆమె వచ్చి జోక్యం కల్పించుకుంది. అదీగాక తనకు జరిగినట్లే తన విరోధికీ అందరి యెదటా అవమానం జరగడం వల్ల మూన్ సెంటు మీద ఆమెకు కచ్చ తగ్గింది.

"ఏ విషయమూ నెమ్మదిగా మాట్లాడుకునే అవకాశం లేదీ గోల్డురూట్‌కి. పెద్దమనుష్యులు పెదవులు కదల్పారా, వెధవలు చేతులెత్తుతారు" అన్నాడు ముసలి మామ.

"గోల్డురూట్! యింతటితో ఆగు. కార్మేడ్ వోంగు వింటాడు" అంది ముసలి అత్త. ఆ మాట తెలివి తక్కువగా అందో కావలనే అందో తెలియదు.

"కార్మేడ్ వోంగు పేరు చెప్పి నన్ను భయపెట్టచూడకండి. కావ

లిస్తే వెళ్లి మహిళా సంఘానికి చెప్పుకోమను. నాకేం భయంలేదు" అంటూ గోల్డురూటు భార్యను మరో రెండు దెబ్బలు గట్టిగా వేశాడు.

ఎట్లాగో చివరకి ముసలివాళ్లిద్దరూ కలిసి వాళ్లను విడదీశారు. గోల్డు రూటు సావిట్లోంచి బయటకు వెళ్లిపోయాడు.

"గోల్డురూటుకు వున్న చెడ్డగుణమల్లా యీ పిచ్చికోపమే! నే నెప్పుడు యీ మాటలు చెపుతూనే ఉంటాను. తన కోపమంతా పెళ్లాం మీద చూపించకూడదు" అంది ముసలి అత్త.

మూన్‌సెంటు ఏమీ మాట్లాడలేదు. ముసలి అత్త ఆమెను చెయ్యి పట్టుకుని లోపలకు తీసుకువెళ్లింది. మూన్‌సెంటు పక్కమీద పడుకుని కుళ్లి కుళ్లి ఏడవడం మొదలు పెట్టింది.

ముసలి అత్త ఆమె పక్కన మంచం మీద కూర్చుని "మొగుడూ పెళ్ళాం పోట్లాడుకోడం సామాన్యమే. నువ్వు దీన్ని అంతగా మనస్సులో పెట్టుకోక! 'భార్యాభర్తల మధ్య మర్నాటిదాకా ఉండే కినుక వుండదు' అన్న సామెత నువ్వు వినలేదూ!" అంది ముసలి అత్త.

ఆమె మూన్‌సెంటు చెవిదగ్గరకు వంగి "కష్టాలు అనుభవిస్తున్నది మీ కుటుంబం ఒక్కటే కాదు. మేము మీకంటే ఎక్కువ కష్టాలు పడు తున్నాము. మా పందిని మేము చంపేశాము. 'మీదగ్గర డబ్బులేకపోతే చుట్టాలెవరిదగ్గరన్నా అప్పు తీసుకోండి. మీ కోడలి చెల్లెలు మొగుడికి పట్నంలో షాపు ఉందికదూ!' అన్నాడు వోంగు. ఆ తాబేలుగుడ్డు తల కాయవాడికి అన్నీ తెలుసు. చెల్లెల్ని డబ్బుఅడగటానికి మాకోడలు పట్నం వెళ్లింది. వాళ్లు డబ్బు అప్పుయివ్వకపోతే ఏం జరుగుతుందో నాకేం తెలి యటం లేదు" అంటూ వంగి తొడుక్కున్న జాకెట్టు కొసతో కళ్లు తుడుచు కుంది. మూన్‌సెంటు ఎక్కెక్కి ఏడ్చింది. గోల్డురూటు తనను అపార్థం చేసుకోవడం వల్ల ప్రపంచమంతా అంధకారంగానూ, కొండవిరిగి మీద పడ్డట్లూ, దానికింద తను వూపిరాడక ఉక్కిరి బిక్కిరి అవుతున్నట్లూ వుంది మూన్‌సెంటుకు.

మర్నాడు పొద్దున్న సంవత్సరాది రొట్టెలు చెయ్యడానికి అందరూ బియ్యం పిండి విసిరారు. ముసలి అత్త యింట్లో పాత తిరగలి నెమ్మదిగా తిరుగుతూ కీచుమని చప్పుడు చేసింది. నెలలూ, సంవత్సరాలూ దొర్లి పోతుండగా ధృవాలనే యిరుసుమీద భూమి తిరుగుతూ కీచుమని చప్పుడు చేస్తున్నదా అనిపించింది.

సాయంకాలం గోల్డుగూటు యింటిముందు ఆవరణలో ఒక బల్లవేసి దానిమీద ఒక మూల కొవ్వొత్తి వెలిగించి పెట్టారు. అందరూ బల్ల చుట్టూ చేరి సంవత్సరాది రొట్టెలు తయారుచేశారు. గోల్డుగూటు రెండు చేతులతోనూ పుచ్చకాయంత బియ్యం ఉండచేసి దానిని నిప్పులలో కాల్చాడు. పెదిమలమీద చిరునవ్వు చిందులాడుతుండగా ఆ వుండను బల్లమీద పెట్టి త్వర త్వరగా దొర్లించాడతను. అప్పుడు భూమి ఉద్భవించిన సమయంలో మండే కొండలలోంచి ఏదో సృష్టించడానికి ప్రయత్నించే వాడిలో వుండే నిష్ఠా, తదేక ధ్యాస అతనిలో కనపడ్డాయి. ఉండుండి ఆ పెద్ద ఉండలోంచి కొంచెం పిండితీసి తన భార్యమీదకు విసిరేశాడతను. ఆమె దాన్ని ఒక కొయ్య అచ్చులో పెట్టి నొక్కి, అచ్చును బల్లమీద కొట్టి, రొట్టెతీసి బల్లమీద పెట్టింది. అయిదు బాతు యీకలు ఒకటిగా కలిపి కట్టిన కుంచెను పక్కన వున్న ఎర్రనీళ్ళ డబ్బాలోముంచి ప్రతి రొట్టెమీదా మూడుసార్లు రాసిందామె. అచ్చులో పెట్టి నొక్కినపుడు రొట్టెమీద అచ్చుపడ్డ పువ్వులకు రంగు పూయడంవల్ల అవి ఎర్రని పుష్పాలలాగా కనిపించాయి. మికను రంగువేయడం తనకు చేతనవునని అల్లరి చేసిందిగాని బల్ల ఎత్తుగా ఉండడంవల్ల రొట్టెలు ఆమెకు అందలేదు.

ఎలాగయితేనేం రొట్టెలు తయారైనాయి. ఆరడానికి గదిలో వాటిని పరిచిపెట్టారు. వాటిని లెఖపెడుతూ, సరైన తూనికలో ఉన్నాయా లేవా అని తూస్తూ అందరూ చాలాసేపు గడిపారు. ముందు సావిట్లో ఎవరూ లేరు. కొవ్వొత్తి బల్లమీద వెలుగుతోంది. బల్లమీద డబ్బా ఒకటీతప్ప మరే వస్తువులూ లేవు. ఆ డబ్బాలో నీళ్లు, నీళ్ళలో ఎర్రటి దూది వున్నాయి.

మూన్‌సెంటు ముందు సావిట్లోకి వచ్చి, నీళ్లు కారుతున్న దూది డబ్బాలోంచి తీసి, చెంపలమీదా, కనురెప్పలమీదా రాసుకుంది. అవి ఎర్రగా అయినాయి. రంగును చేతులతో తుడిచింది.

దీన్ని వృధాచెయ్యడ మెందుకనుకుంది మూన్‌సెంటు తనలో తను నవ్వుకుంటూ. కూతురిని పిలిచి ఆ పిల్ల ముఖానికి కూడా ఎర్రరంగు పులిమింది. తల్లీ, కూతురూ ఆ సాయంకాలమంతా నాటకంలో రంగు పూసుకున్నట్లు ఎర్రని చెంపలతో తిరిగారు. సంవత్సరాది పండగ అంతా వాళ్లింట్లోనే ఉన్నట్లుంది.

# పన్నెండో ప్రకరణము

ఉదయం కాకమునుపే సైనికుల కుటుంబాలకోసరం పల్లెలోని కొన్ని పందులను చంపారు. తుప్పుపట్టిన యీలలను ఊదేటప్పుడు అయ్యే శబ్దం లాగా కీచుమంటూ రాసుకుపోయిన వాటి కంఠాలలోంచి వచ్చిన అరుపులు వినపడ్డాయి.

పొద్దు పొడిచిన కాసేపటికి ముసలి మామ వాళ్ళ పందిని యింటి ఆవరణలో వదిలిపెట్టాడు. చుట్టుపక్కల వున్న యిళ్ళ మెట్లన్నీ ఆ ఆవరణ లోకే ఉన్నాయి. అవి గతుకులుగా ఉన్న నలుచదరపు మట్టి నేల. వాన కురియడంవల్ల యిళ్ళ తెల్లని గోడలమీద పొడుగాటి బూడిదరంగు చారలు పడ్డాయి.

“పందిని ఆవరణలో చంపక. ముందు సావిట్లో చెయ్యాలని. బయటయితే జనం గుమిగూడుతారు. ఎవరన్నా నష్టజాతకం మాట అంటారు. సంవత్సరాది దగ్గరకొచ్చింది. జాగ్రతగా ఉండాలి” అంది ముసలి అత్త హడావిడిగా.

“ఏం ఫరవాలేదు. పందిని చంపుతున్నది మనకోసం కాదుగా! సంవత్సరాది ముందు శాస్త్రరీత్యా చంపాలంటే చంపేముందు కొవ్వొత్తులు వెలిగించి, ధూపం వెయ్యాలి” అన్నాడు ముసలి మామ విసుగ్గా.

కడుపు ఖాళీగా ఉండేందుకుగాను ఒక రోజంతా పందికి తిండి పెట్టలేదు. నేలలో ఏమైనా దుంపలు దొరుకుతాయేమోనని అది తడిగా ఉన్న నేలను వాసన చూసింది. ముసలి మామ ఇంటి పక్కన కాపుర మున్న ఒకతను పంది వెనక కాళ్లు గట్టిగా పట్టుకున్నాడు. అది పెద్దగా అరిచింది. ఇంకో మనిషి వచ్చి అతనికి సహాయం చేశాడు. ముసలి అత్త ఆ పంది ముందు కాళ్లు, వెనక కాళ్లు గట్టిగా పట్టుకుంది. సామానుబుట్టలో ఉన్న కత్తి అందుకోడానికి ముసలి మామ వంగాడు. నోట్లో వున్న పొడు గాటి పైపు తీసి అతనా బుట్ట కొక్కానికి తగిలించాడు. అది అందమైన బుట్ట. ఆ బుట్ట అల్లినవాడు కోసి వెయ్యకుండా విడిచిన వెదురుబద్ద ఒకటి పొడుచుకు వచ్చి చిత్తరువులో అందంగా కనపడే చెట్టు ఆకులాగుంది.

పంది గొంతుకలో చురకత్తి దిగవేసిన తరవాత కూడా అది పెద్దగా అరుస్తూనే వుంది. గుర్రపు సకిలింతకన్నా అసహ్యంగా ఒకే స్థాయిలో కీచుమంటూ అరిచిందది. పంది ఎక్కువగా అరవడం నష్టదాయక మంటారు. అందువల్ల ముసలి మామ చేత్తో దాని నోరుమూశాడు. వీళ్లతో వాదించి లాభం లేదన్నట్లు ఒక్కసారి గురకపెట్టి ప్రాణం వదిలిందా పంది.

చాలా చలిగా ఉండడంవల్ల దాని ముక్కులలోంచి తెల్లని పొగ బయటకు వచ్చింది. ముసలి మామ కెచ్చదనానికి కాళ్ళకు నారసంచులు తొడుక్కున్నాడు. ఆ నారలాగే పసుపు పచ్చగానున్న కుక్క ఒకటి వచ్చి పందిని చంపినప్పుడు నేలమీద కారిన రక్తాన్ని నాకింది. ఇంకా ఎక్కడైనా రక్తం ఉందేమోనని నేల వాసనచూస్తూ తల పైకెత్తిందది. నిలుక్కుపోయివున్న పంది కాలు దాని తలకు తగిలింది. ఆ కాలును వింతగా వాసన చూసిందది. వాసన చూడడంవల్ల దానికేం తోచిందోగాని చాలా సంతోషంగా కనపడ్డదా కుక్క. పంది చుట్టూ తిరుగుతూ దాని కాళ్ళ సందుల్లో దూరుతూ తారట్లాడిందది.

గోల్లుహావ్‌గాట్ వదిన వేడినీళ్ళ తొట్టెలు కావిడిలో మోసుకువచ్చి నీళ్ళు ఒక కొయ్యపీపాలో పోసింది. పందిని ఆ పీపాలో పడేసి దాని తలను నీళ్ళల్లోకి అదిమారు. దాని తల నీళ్ళల్లోంచి బయటకి వచ్చినపుడు స్నానం చేసిన పిల్లవాడి జుట్టుమల్లే దాని వెంట్రుకలు తలనిండా కుచ్చులాగా ముద్దగా ఉన్నాయి. ముసలి మామ గులివి తెడ్డుతో దాని చెవులు బాగు చేశాడు. చెవులు బాగుచెయ్యడం బతికివుండగా అది ఎన్నడూ ఎరగదు. రెండు వేపులా ముడుచుకునే పెద్ద మంగలి కత్తితో దాని వంటిమీద బొచ్చు గొరిగాడితను. తరవాత ఒక చిన్న ఉలితో దాని కాలివేళ్ళకున్న గోళ్ళు సులభంగా పీకివేశాడు. తెల్లని శిలమండకింద వుండే ఎర్రని స్త్రీ పాదం వేళ్ళన్నీ ముడుచుకు పోయేట్లు గుడ్డతో బిగించి కట్టితే ఎట్లా ఉంటుందో అట్లా ఉంది ఆ పంది పాదం.

పంది శరీరం ఉబికేందుకు ముసలి మామ దాని పాదం నోట్లో పెట్టుకుని గాలివూదాడు. శరీరం ఉబికితే వెంట్రుకలు పీకివెయ్యడం సులభం. అతను యీ పని యిదివరకు అనేకసార్లు చేశాడు. ఎప్పటిలాగా పందికాలు నోట్లో పెట్టుకునే ముందు ఆ రోజు ఎందుకో అతను కొంచెం తటపటాయించాడు.

పంది చుట్టూ జనం పోగయ్యారు. కిందటి రోజు ఒక కుటుంబం వారు చంపిన పందికంటే యీ పంది ఎంత ఎక్కువ బరువు వుంటుందనీ, క్రిందటి సంవత్సరం ఒక కుటుంబంవాళ్లు చంపిన పంది చాలా పెద్దదనీ, దానికంటే యిది ఎక్కువ తూగుతుందా అనీ జనం మాట్లాడుకున్నారు.

"ఈ పందికి ముందు భాగమే బలిసి వుంది" అన్నాడు పొడుగాటి అంగరకా వేసుకున్న ఎత్తు బుజాల ముసలాయన ఒకడు. అతను పొడుగ్గానూ, చూడడానికి క్రూరంగానూ ఉన్నాడు. ఎవరూ అతని మాటకు బదులు చెప్పలేదు. అందరూ స్వగతాలుగానే మాట్లాడారు.

ఆ పొడుగాటి మనిషి తన యింట్లోకి వెళ్లి, నీలం అంచు గిన్నె, రెండు పుల్లలూ తీసుకువచ్చాడు నిలబడి చూస్తూ పొగలు కక్కుతున్న గంజి తాగడం ప్రారంభించాడతను.

గోల్డుహోవ్ గాట్ ఒక పాత్రలో పొంగుతున్న నీళ్లు తెచ్చి పందిమీద పోసింది. కాని తలమీద ఒక పాచికతప్ప మిగతా బొచ్చంతా కీకేశారు. దాన్ని తొట్టెపక్కన బోర్ల బొక్కలా పడుకోబెట్టినపుడు అది భయంకరంగా మనిషిలా కనపడ్డది. తలమీద వున్న కొంచెం వెంట్రుకలు తప్ప మిగతా శరీరమంతా వెంట్రుకలు లేకుండా తెల్లగా ముద్దలాగుంది. చివరికి ముసలి మామా, అత్తా కలిసి ఆ పంది శరీరాన్ని పైకి ఎత్తి పొర్లించారు. వెంట్రుకలు లేకుండా తెల్లగా వున్న దానిముఖం నవ్వుతున్నట్లు కనిపించిందప్పుడు. వంకర గీతలలాగున్న దాని కళ్లు నవ్వుతున్నాయి.

తరవాత ఆ పంది శరీరాన్ని యింట్లోకి మోసుకుపోయి ఒక బల్లమీద పెట్టారు. అవి చాంద్రాయణం ఆఖరి రోజులు కావడంవల్ల చలి ఎక్కువగా ఉంది. చలికి ఆ పంది శరీరం చాలా చల్లగా వుంది. దాని తల కోసేశారు. కోసేసిన పెద్ద ముట్టె బల్లమీద కదలకుండా పడివుంది. అనుమాయితీ ప్రకారం—మొరటు వేడుక సూచించే అనుమాయితీ అది—చంపిన పందినోట్లో దాని వంకర తోకను పెట్టి ఆనందించారు వాళ్లంతా.

పందుల దొడ్డిని వాళ్లు మరుగుదొడ్డిగా కూడా ఉపయోగించుకునే వాళ్లు. పందిని పెట్టే గుంట చుట్టూ ఎత్తుపాటి కొయ్య తొట్టెలు ఉంటాయి. మధ్యాహ్న సమయంలో ముసలి మామ తొట్టెలలోని ఉచ్చ పారబొయ్యడానికి వెళ్లినపుడు గుంటలోకి ఒక నిమషం తొంగిచూశాడు. పంది అటూ యిటూ తిరుగుతూ పెట్టే గుర్రుశబ్దాలు లేవు. గుంట నిశ్

బ్బంగా వుంది. ఆ ఖాళీ గుంటదగ్గరనించి వస్తూండగా సన్నగా కాస్తున్న పచ్చని ఎండవేడి అతనికి తగలగానే ఆయాసంతో వణికిపోయాడు ముసలి మామ. అతని కోడలు సావిట్లో కొయ్యతొట్టెపై పట్టిన పాచి కడుగుతోంది. అతని భార్య గుమ్మంమీద కూర్చుని కత్తీ మొదలైన పనిముట్లను గుడ్డపీలికతో తుడిచి బుట్టలో పెడుతోంది. పనిచేసేటప్పుడు ముసలి మామ నీలం లాగు వేసుకుంటాడు. లాగును పైకి లాక్కుంటూ అతను చెట్లనీడన నిలబడ్డాడు.

"ఇంకెప్పుడూ నేను పందిని పెంచను" అన్నాడు ముసలి మామ పెద్దగా.

"ఈ మాట నువ్వు యిదివరకూ అన్నావు" అంది అతని భార్య.

అతను ఆ మాటకు ఏం జవాబు చెప్పక పోయేటప్పటికి నిర్దయగా రెట్టిస్తూ "పోయినసారీ నువ్వు అట్లాగే అన్నావు" అందామె.

ముసలి మామ భార్యవేపు చూడకుండా "ఈసారి పందిని పెంచిన వాళ్లు కుక్కకు పుట్టినట్లే!" అని ఒట్టేసుకున్నాడు.

గోల్డ్‌వావ్‌గాటు వదిన ఏడ్చింది. ఆమె చేతులు జిడ్డుగా వుండడం వల్ల బుజం పైకెత్తి కళ్లు బుజానికి తుడుచుకుంది. కళ్ళెంబడి కారుతున్న కన్నీళ్లు వెంటనే గాలికి చల్లబడ్డాయి.

జపానువాళ్లు కొన్ని ఏళ్ళక్రిందట దేశం ఆక్రమించుకున్నప్పుడు జరిగిన ఓ సంఘటనను గురించి వాళ్లు ముగ్గురూ ఆలోచిస్తున్నారు.

వాళ్లు యిప్పుడుంటున్న యిల్లు ఉద్యోగాలుచేసి బాగా సంపాదించిన వాళ్ళ పూర్వీకులు కట్టించారు. శిథిలమవుతున్న ఆ తెల్లని భవనంలో ఉంటున్న తాము వాళ్ల సంతతే. ఆ యింటి తల వాకిలికి బంగారు పూత పూసిన పలక ఒకటి వేల్లాడుతోంది. ఆ పలకమీద "షింగ్‌షిగారి యిల్లు" అని వ్రాసి ఉంది. ప్రభుత్వం జరిపే పరీక్షలలో కల్లా పెద్దపరీక్షలో ఉత్తీర్ణులైనవారిని 'షింగిషీ' అంటారు. యుద్ధపు రోజుల్లో ఆ పలక వాకిలి ముందు వేల్లాడుతోంది. కమ్యూనిస్టులు వచ్చిన తరవాతే ఆ పలక తీసివేయబడ్డది.

ఆ భవనంలో ఎన్నో ముంగిళ్లున్నాయి. ఒక ముంగిట్లోనించి యింకో ముంగిట్లోకి పోయే రాళ్లు పరిచిన దారులు చీకటిగా ఉండేవి. ఆ దారుల మీద కప్పులుండేవి. అవి సన్నని సందుల్లాగుంటాయి. సరుకులు అమ్ము

కునే వారు బళ్ళమీద సరుకులు తెచ్చి ఆ సందులగుండా అమ్ముకుంటూ వెళ్లేవాళ్లు. ఒక గుడ్డివాడు రాళ్ళమీద కర్ర టకటక కొట్టుకుంటూ ఆ భవనంలో ముష్టి అడుగుతూ తిరిగేవాడు. అతన్ని ఎవరూ ఆటంక పెట్టేవారు కారు. ముందు రాబోయే సంవత్సరంలో ఆ యింటిలోని స్త్రీలకు శుభం కలుగుగాక అని దీవిస్తూ పెద్దగా మంత్రాలు వల్లించేవాడు ఆ గుడ్డి మనిషి.

"కొత్త సంవత్సరం రొట్టెలు చేసే తల్లుల్లారా మీరు వేసే అడుగల్లా సుఖప్రదం, ప్రతి అడుగూ ఉన్నతికి మార్గం" అని దీవించేవాడతను.

గుడ్డివాడి వెనక నువ్వుల నూనె అమ్ముతూ ఒక బేహారి వచ్చేవాడు. అతని భుజంమీదనించి వేలాడుతున్న కావడిలో రెండువేపులా రెండు మట్టికూజాలుండేవి. "ఘుమ ఘుమ లాడే నూనె, ఘుమ ఘుమ లాడే నూనె" అంటూ అతను నూనె అమ్మేవాడు.

సాయంకాలం ఆ బేహారి వెళ్లిపోగానే ఆ యిల్లూ, యిల్లుమల్లే ఆ పల్లె నిశ్శబ్దమై పోయేవి.

మొక్కజొన్నలు పిండి విసురుతూ ముసలి అత్త ఒక్కతే ముంగిట్లో వుంది. నీడన నుంచుని ఎండలో వున్న తిరగలి విసురుతూ చేత్తో అప్పు డప్పుడు గింజలు సరిచేసేది ఆమె. మొక్కజొన్న పిండి ఎడారిలో యిసుకలాగా సన్నని ధారగా తిరగలి నించి కింద పడుతోంది.

సందులో అడుగులచప్పుడు అవడంవిని ఆమె తలపైకెత్తింది. గుడ్డివాడి కర్ర చప్పుడు కాదది. రాళ్ళమీద బూట్సు కాళ్ళతో నడుస్తున్న చప్పు డది. నామ మాత్రంగా ఉన్న ప్రభుత్వంయొక్క శాంతి సైన్యంలోని సైనికులు భైరవుడి గుళ్ళో విడిది దిగారు. వాళ్లు తరుచూ పల్లెలోకి వచ్చేవారు.

ఆమె వింటూండగానే ఎవరో వెనక సందులోంచి తలుపు తెరుచుకుని లోపలికి జొరబడ్డారు. ఆమె ఉన్న గదికి వెనక ఉన్న గదిలో ఎవరో ఆవేశంతో పెద్దగా మాట్లాడడం ఆమె విన్నది.

"నన్ను కాసేపు యిక్కడ తల దాచుకోనివ్వండి" అంటూ బేహారి నూనె జాడీలను తలుపుకు కొట్టుకుంటూ ముంగిట్లోకి చరచరా వెళ్ళాడు.

"జాగ్రత! జాగ్రత!" అన్నాడు ముసలి మామ.

ముసలి అత్త వెర్రిమొహం వేసి "వాళ్లు వస్తున్నారు" అంది భర్తతో రహస్యంగా. ఆమె త్వరగా ఒక గంతులో బయటికి పోయి ఎండబెట్టిన

బియ్యం వుండలను వంగి పోగుచేసింది. చూడడానికి నేలమీద చిన్న గడ్డి గూళ్ళలాగున్నాయి ఆ బియ్యపుటుండలు.

"వాటి సంగతి వదిలేసి పందిని దాచేందుకు నాకు సహాయం రా!" అని ఒగరుస్తూ ఆమె వెనకాలే ముసలి మామ వచ్చాడు.

"దాన్ని ఎక్కడ దాచాలో నాకు తెలుసు. గదిలోకి తీసుకురా!" అని నెమ్మదిగా ఉద్రేకం అణుచుకుంటూ అంది ముసలి అత్త.

మామా, అత్తా పంది వుండే గుంటదగ్గరకి పరిగెత్తారు. ముసలి మామ పందిని ఎత్తడానికి ప్రయత్నించాడు. బలిసిన ఆ పంది ముసలి మామ చేతుల్లో ఋమడక గింజుకుంది. పిల్లకు పాలిస్తూ కూర్చున్న కోడలు పరుగెత్తుకొచ్చి, పిల్లను అత్తచేతికిచ్చి మామకు సహాయం చేయడానికి గుంటలోకి వొంగింది.

"ఇంకా నువ్విక్కడ యేం చేస్తున్నావు. పరిగెత్తుకు పోయి దాక్కో. త్వరగా పో!" అంటూ ముసలి అత్త చిందులు తొక్కుతూ కోడల్ని ఆజ్ఞాపించింది.

"త్వరగా దాక్కో!" అంటూ ముసలి మామ కోడలివేపు వణికి పోతూ భయంతో చూశాడు.

"ఏయ్! పిల్లని యిక్కడే మరిచిపోయావు" అని కోపంతో ముసలి అత్త అరుస్తూ కోడలి వెనకే పరిగెత్తి పిల్లను ఆమె చేతుల్లోకి తోసింది.

కోడల్ని చూడగానే కొడుకు సంగతి ముసలి మామకు జ్ఞాపకం వచ్చింది. "గోల్డువాన్ గాట్ ఏడీ! వాళ్ళకంట పడకూడదు వాడు. కన పడితే రెక్కలు విరిచికట్టి సైన్యంలో చేర్చడానికి తీసుకుపోతారు" అని అరిచాడు ముసలి మామ.

"త్వరగా పోయి దాక్కోమని చెప్పు వాడికి. పిల్లాడిని యిట్లా యియ్యి. వాడు ఏడ్చి నువ్వు ఎక్కడున్నదీ బయట పెడితే కొంప మునుగు తుంది" అంది కోడలితో ముసలి అత్త వణికిపోతూ.

పిల్లాడిని గోడకు జారగిలా కూర్చోబెట్టి ముసలి మామకు సహాయం వెళ్లింది అత్త. ఇద్దరూ కలిసి పందిని తమ పడక గదిలోకి మోసుకు పోయారు. పంది అంత బలిసినందుకు ఆ కష్టసమయంలో కూడా వాళ్లు సంతోషించారు.

"పరుపుమీద! దాన్ని పరుపుమీద పడుకోబెట్టి కప్పదాం" అంది అత్త వగరుస్తూ.

పంది గుర్రుమంటున్నా వాళ్ళు దాన్ని పక్కమీద పడేసి కప్పారు. పంది ఒళ్ళూ, తలా పూర్తిగా బొంతతో కప్పి బొంత అంచులు పక్కకింద దోపింది ముసలి అత్త. మంచంకింద దూరి ఓ చెప్పుల జత బయటకు తెచ్చి మంచం ముందు పెట్టింది వాటిని.

వాకిలి తలుపు దగ్గర ఎవరో మాట్లాడుతుండడం వినిపించింది వాళ్లకు.

"నువ్వు తలుపు గడియ వేయలేదు కదా! గడియవేయడంవల్ల లాభమేమీ వుండదు. వాళ్ళకు కోపం వస్తుంది కూడా?" అంది ముసలి అత్త.

ఓ కోడి పెట్టను తరుముకుంటూ సైనికులు యింట్లో ప్రవేశించారు.

"ఏయ్! ఇంట్లో ఎవరూ లేరా? అందరూ చచ్చారా?" అని అరిచాడు ఓ సైనికుడు.

ముసలి దంపతులు త్వరగా వెళ్లి నవ్వు ముఖాలతో వాళ్లను ఆహ్వానించారు. ఉత్తరాదినించి వచ్చిన ఆ ముగ్గురు సైనికులు మాట్లాడే భాష వీళ్లకు సరిగా అర్థం కాలేదు.

"చెవుడు నటిస్తున్నారా?" అన్నారు వాళ్ళు వేగిర బాటు చూపుతూ.

ఇంట్లో తినడానికి ఏమైనా వుందా అని వాళ్లు అడుగుతున్నట్లు చివరకు ముసలి దంపతులు గ్రహించారు. పంటలు పండలేదనీ, తిండిలేక మలమలా మాడుతున్నామనీ, తమ కష్టాలు వర్ణించింది ముసలి అత్త. స్ఫోటకం మచ్చలతో ముఖం బాగా గుంటలు పడ్డ సైనికుడు ముందు సావిట్లో యింకో వేపు వెతికాడు. అక్కడ వున్న తలుపుమీద అంటించిన పసుపు పచ్చని కాగితం ఆ యింట్లో యిటీవల ఎవరో మరణించినట్లు స్పష్టపరిచింది. ఒక నెల కిందట గోల్డురూటు తల్లి పోయింది. శవపేటిక యింకా గదిలోనే వుంది. దానికి రంగు పూయనే లేదు. ఆ పెట్టెలోపల శవం వుంది. సైలపోగానే శవాన్ని భూస్థాపితం చేస్తారు. గోల్డురూటు, గోల్డుఫవరు తల్లీ, తండ్రీ లేని అనాథలైనారు. వాళ్లిద్దరూ వెదురు మొక్కలు తవ్వి తెచ్చేందుకు కొండమీదకు వెళ్లారు. స్ఫోటకం మచ్చలసైనికుడు వాళ్ల గదిలోకి వెళ్లి శవపేటిక చూశాడు. శవపేటిక చూడడం అపశకునం. కీడు సోకకుండా

వుం డేందుకు అతను నేలమీద గతుక్కున వుమ్మేసి వెనక్కి తిరిగి యింకో గదిలోకి వెళ్ళాడు. అది ముసలి మామ పంది వుండేగది.

"ఏయ్! ముసలాయనా! నీ పంది యేదీ?" అని లోపల్నించి కేక వేశాడు సైనికుడు.

"కాప్టెన్! నేను దాన్ని అమ్మేశాను" అని ముసలి మామ జవాబు చెప్పాడు.

"దొంగమాటలు. పంది లేకపోతే యిక్కడ యింత రోతగా ఎందుకు వుంటుంది?" అన్నాడా సైనికుడు. సైన్యంలో చేరకముందు అతను రైతు.

"ఈ పల్లెటూరి వాళ్లంతా దొంగ వెధవలు. అన్నీ అబద్ధాలే" అన్నాడు యింకో సైనికుడు. అతను మిగతా యిద్దరికంటే బాగా పెద్ద వాడు. అతని బుగ్గలు లోతుగా పీక్కుపోయాయి. ముఖం పాలిపోయింది. సగం మూతపడ్డ అతని కళ్లు వెల వెల పోతున్నాయి. ఆ కళ్లను ముసలి మామ వేపు తిప్పి "ఏమయ్యోయ్! పంది ఏదీ?" అని అడిగాడతను. అతనట్లా అడిగినప్పుడు చైనా భాష తెలియని విదేశీయుడు అతని భాషలో ఓ మొరటు పదం వుపయోగించినట్లు వినిపించింది. ముసలి మామకు. అట్లా మాట్లాడడం వల్ల ఒక్కొక్కప్పుడు మంచిఫలితాలు కలుగుతాయని ఆ సైనికుడికి తెలుసు.

ముసలి మామ భయంతో వణికిపోయాడు. అత్త మొహం చేటంత చేసుకుని నవ్వుతూ వచ్చి "కాప్టెన్! నిజంగా పందిని అమ్మేశాం. అది బలిసి లేనందువల్ల మంచి ధర రాలేదు. ఏం చెయ్యం మరి! మాకు డబ్బు అవసరమైంది. యింట్లో బియ్యం లేవు. దాన్ని అమ్మడానికి తీసుకు వెళుతూ వుంటే నేను ఏంతో ఏడ్చాను. మా పల్లెటూరి ప్రజ బ్రతుకు ఏం బ్రతుకు నాయనా! కనిష్టపు బ్రతుకు" అంది.

"ఆవిడ మాటలు వినండి" అన్నాడు సైనికులలో పెద్దవాడు.

వాళ్ళల్లో ముఖం ఎర్రగా వున్న యువక సైనికుడు, రెండు చంకల్లో రెండు కోడిపెట్టలను పెట్టుకుని ముసలి మామ జబుసుకు నేట్లు అతనిమీదకు దూకాడు. తుపాకి పైకి ఎత్తి "చెపుతావా? చెప్పవా!" అన్నాడతను. అంతలో ఒక కోడిపెట్ట రెక్కలు టపటప కొట్టుకుంటూ, పెద్దగా కూస్తూ

చంకలోంచి తప్పించుకుని, గడపదాటి అవతల గదిలోకి పారిపోయింది. నేలమీదంతా దాని యీకలు పడ్డాయి.

"దీని దుంప తెగ!" అని తిట్టుతూ, నవ్వుతూ కోడిపెట్టను తరిమాడా సైనికుడు. అది బల్లమీదకు ఎగిరింది. బల్లమీద వున్న గిన్నెలూ, సీసాలూ నేలమీద పడిపగిలాయి.

మిగతా యిద్దరు సైనికులూ అతని వెనకాలే వెళ్ళారు. కోడిపెట్టను పట్టుకునేందుకు మొదటి సైనికుడు తంటాలు పడుతూ వుంటే వెనక వచ్చిన యిద్దరూ తుపాకులమీద ఆనుకుని నిలబడి పెద్దగా నవ్వారు.

"మెడ నలిపిపెయ్యి. చచ్చేదాకా నలుపు. లేకపోతే రెట్టలువేసి నీ దుస్తులు పాడుచేస్తుంది" అన్నాడు స్ఫోటకం మచ్చల సైనికుడు.

సైనికులలో పెద్దవాడు తలుపుకు వేలాడుతున్న మందపాటి తెర పైకెత్తి గదిలోకి తొంగి చూశాడు. ముసలి అత్త అతని దగ్గరకు పరుగెత్తు కొచ్చి "కాప్టెన్! ఈ గదిలో జబ్బు మనిషి ఉన్నాడు. గది రోతగా వుంది. వచ్చి యిట్లా కూర్చోండి. ఇక్కడ కూర్చో కేప్టెన్!" అంది.

ఆవిడ మాటలు లెఖచెయ్యకుండా అతను గదిలోకి వెళ్ళాడు. మిగతా యిద్దరూ అతని వెనకే వెళ్ళారు. ముసలి అత్త కూడా వాళ్ళతో గదిలోకి వెళ్ళింది.

"చాలా జబ్బుగా వున్నాడు. జ్వరం మండిపోతోంది. చలిగాలి ఏంతమాత్రం తగలకూడదు. ఈ స్థితిలో చలిగాలి తగిలిందా ప్రమాదం" అంటూ సణిగింది ముసలి అత్త.

ఆమె ఒకసారి మంచంవేపు చూసి తను సర్దివెళ్ళినట్లే ఏం చెదర కుండా వుండడం గమనించి లోపల సంతోషపడ్డది.

సైనికులు అదీ యిదీ తీసి చూస్తూ గదంతా తిరిగారు.

"కానీండి! అన్నీ చూడండి! బీదవాళ్ల యింట్లో చూడడానికి ఏముంటాయి?" అంది అత్త నవ్వుతూ చేయగలిగిందేమీలేక. ఆమె ఆ మాటలు అంటూ వుండగా పందికి కప్పిన బొంత కదలడం చూసి ఆమె గుండెలు దడదడ కొట్టుకున్నాయి. బొంతలోపల వున్న పంది ఉండబట్ట లేక కదిలింది.

ముసలి అత్త త్వరగా వెళ్లి మంచం తలదగ్గర నిలబడి బొంత గట్టిగా పట్టుకుంది. గాలికోసం ముట్టె బయట పెట్టడానికి పంది తంటాలు పడు తోంది. అత్త బొంత బలంగా లాగి ముట్టె బయట పడకుండా కప్పింది.

"బుద్ధి లేదూ! చలిగాలి తగిలితే చస్తావు. చెప్పినమాట విను. తల కనపడకుండా కప్పుకో. బాగా చెమటపట్టనీ. చెమటపట్టితే జ్వరం జారిపోతుంది. కొంచెం ఓపికపట్టు. చెమట పూర్తిగా అరిపోయేదాకా చలిగాలి తగలకూడదు. చాలా ప్రమాదం తెలుసా!" అని కోప్పడ్డది అత్త.

ఆమె పందిచుట్టూ వున్న బొంత గట్టిగాలాగి పక్క కింద దోపింది. పంది కదలకుండా పడుకున్నందుకు ఆమె ఆశ్చర్యపడ్డది.

సైనికులలో పెద్దతనికళ్లు గది నాలుగు మూలలా వెదికాయి. నేల ఎక్కడన్నా కొత్తగా తవ్వబడి వుందేమోననీ, మట్టి గోడలో కొత్తగా కన్నం పూడ్చిన గుర్తులు ఎక్కడన్నా కనపడతాయేమోననీ, డబ్బు ఎక్కడైనా వాళ్లు పాతిపెట్టారేమోననీ అతను పరీక్షగా చూశాడు. మిగతా యిద్దరూ కోడిపెట్టలను వండడం ఎట్లా అనే విషయం మాట్లాడుకుంటున్నారు.

"ఒకటి ఊరేద్దాం. ఒకటి ఉడకపెడదాం" అన్నాడు యువక సైనికుడు.

"ఊరేస్తే బాగుండదు. చాలా ముదిరిపోయాయి" అన్నాడు స్ఫోటకం మచ్చల సైనికుడు.

అలా అంటూ అతను మంచం దగ్గిరికి వెళ్లాడు. ముసలి అత్త గుండె ఆగిపోయినట్లయింది. అతను వంగి మంచంకింద పెట్టెలేమైనా వున్నాయేమోననీ, నేలతవ్విన గుర్తులు ఏమన్నా కనపడతాయేమోననీ చూశాడు. ఏమీ కనపడక అతను లేచి వెళ్లబోతూండగా అతని దృష్టి మంచంముందు వున్న కాలిజోళ్లమీద పడ్డది. అవి నీలం గుడ్డతో యింట్లో చేయబడ్డ జోడు. మడమదగ్గర పట్టీవుంది. వయస్సులో వున్న ఆడదాని జోళ్లు అవి. గుడ్డతో బిగించిన ముసలి అత్త పాదాలకు అవి చాలా పెద్దవి.

ఆ జోడు చూడగానే అతని ముఖం వికసించింది. వికసించిన అతని ముఖం చూసి సర్వనాశనం యిక తప్పదన్న భయంతో ముసలి అత్త గుండె దిగజారింది.

"ఏయ్ మచ్చలాడా! ఇక్కడ పుష్పంలాంటి యువతి ఒకతె వుంది" అని అరిచాడు ఓ సైనికుడు నవ్వుతూ.

స్ఫోటకం మచ్చల సైనికుడు మంచం దగ్గిరికి ఒక గంతేసి బొంత

లాగాడు. ఆశ్చర్యంతో ఒక నిమషం నిశ్శబ్దంగా నిలబడి తరవాత కడుపుబ్బ నవ్వి తిట్లు ప్రారంభించాడు.

“తస్సదియ్యా! మంచంమీద పందిని దాచారయ్యా! వీళ్లు ఎలా ఆలోచించారీ పని” అన్నాడు స్ఫోటకం మచ్చల సైనికుడు.

అతను తుపాకీ చూపించి ముసలి అత్తను బెదిరిస్తూ “నువ్వు నీ దేశాన్నే మోసం చేస్తావుగా! ఏం! బ్రతుకుమీద రోతపుట్టిందా?” అన్నాడు.

బొంతలో వున్న పంది కిందకి దూకి వాకిలి దగ్గరకు పరిగెత్తింది. దాని వెనక కాళ్లు పట్టుకునేందుకు యువక సైనికుడు ప్రయత్నిస్తూ వుంటే చంకలో వున్న రెండు కోడిపెట్టలూ తప్పించుకున్నాయి. ఆ పెట్టలు భయంతో రెక్కలు కొట్టుకుంటూ గదంతా తిరిగి వున్న గంద్రగోళం ఎక్కువ చేశాయి.

“ఎవరన్నా వచ్చి నాకు సహాయం చేయండి! చూస్తూ అలా నుంచుంటారేం! తలుపు మూసేయండి” అంటూ యువక సైనికుడు అరిచాడు.

స్ఫోటకం మచ్చల సైనికుడు సహాయం చేయగా పందిని పట్టుకున్నాడతను. యువక సైనికుడు దానిని వీపుమీద వేసుకున్నాడు. దాని బరువుకు అతను అటూ యిటూ తూలుతూ వుంటే, గంతులేస్తూ, తొడలు చరుస్తూ స్ఫోటకం మచ్చల సైనికుడు నవ్వాడు.

“చూడండి! చూడండి! విన్ విక్టరీ లీ వీపుమీద తల్లిని మోసుకు వస్తున్నాడు” అని అరిచాడతను.

విన్ విక్టరీ లీ పట్టలేని కోపంతో పట్టు వదిలాడు. పంది అతని వీపుమీదనించి జారి పెద్ద చప్పుడు చేస్తూ నేలమీద పడ్డది. యువక సైనికుడు స్ఫోటకం మచ్చల అతనిమీద పడి అతనితో పెనుగులాడాడు. వాళ్లిద్దరూ పోట్లాడుతూ వుంటే మూడో సైనికుడు పందిని పట్టుకో ప్రయత్నించాడు.

“ఏయ్! ముసలి అవ్వా! చచ్చినట్లు అలా నుంచుంటావేం! తాడు తీసుకువచ్చి పంది కాళ్లు కట్టు. కాళ్లు కట్టి దాన్ని కావిడికి వేళ్లాడ కట్టు. లేకపోతే మేమెలా ఆ మురికి పందిని మోసుకు పోవడం!” అన్నాడతను.

ముసలి దంపతులు తాడు తెచ్చి పంది కాళ్లు బిగించి కట్టారు. అంతలో స్ఫోటకం మచ్చలతను యువక సైనికుణ్ణి తప్పించుకుని మంచం దగ్గర వున్న కాలిజోడు ఒకటి చేతిలోకి తీసుకుని "ఏదీ ఈ అమ్మాయి?" అని ముసలి అత్తను అడిగాడు.

"ఇవి నీ జోళ్ళేనని అబద్ధాలు చెప్పకే. నీ నోట్లోనించి యింకో అబద్ధం వచ్చిందా చావ చితకకొడతాను తెలుసా!" అన్నాడతను.

"అవును. ఏదీ? ఎక్కడుందా అమ్మాయి?" అని అడిగాడు వాళ్లల్లోకి పెద్దవాడైన మూడో సైనికుడు ఆతురత చూపిస్తూ.

"ఎవరో అమ్మాయి కాదు—నా కోడలే! వాళ్ళ అమ్మను చూడటానికి పీచ్‌క్రీక్ పల్లెకు వెళ్లింది" అని జవాబు చెప్పింది ముసలి అత్త.

"మళ్లీ అబద్ధాలా!" అంటూ స్ఫోటకం మచ్చల అతను అత్త ముఖంమీద చేతులో ఉన్న చెప్పుతో కొట్టాడు.

"ముసలి ముండా! నోటివెంబడి నిజమంటూ రాదూ! ఇవాళ నీ ప్రాణాలు నీకు దక్కితే చూడు!" అంటూ చెప్పుతో ఆమెను యింకా కొట్టాడతను.

దెబ్బలతో ముసలి అత్త చెంప ఎర్రబడ్డది. అయినా ఆమె చిరునవ్వుతో "కొప్పడకు కాప్టెన్! మా కోడలు యిక్కడ లేదు. లేని మనిషిని సృష్టించేందుకు నేనేం యక్షిణిని కాదు. నేను అబద్ధం చెప్తున్నట్లయితే పిడుగుపడి చస్తాను."

"పిడుగు చేసేపని నేను చేస్తానులే" అన్నాడు స్ఫోటకం మచ్చల సైనికుడు.

విన్ విక్టరీ లీ, పెద్ద సైనికుడూ ముసలి మామ మీదకు వెళ్లి ఆతన్ని చెంపలు వాయకొట్టారు. ఎంత కొట్టినా, తుపాకులు చూపించి బెదిరించినా కోడలు వాళ్ళ అమ్మను చూడడానికి వెళ్లిందనే మాట మీదే నిలబడ్డాడు ముసలి మామ.

"మనం వెళ్లి యిల్లంతా వెదుకుదాం రండి" అన్నాడు స్ఫోటకం మచ్చల అతను.

"ఆ అమ్మాయి యిక్కడెక్కడన్నా వుందా నీ ప్రాణాలు నీకు దక్కవు జాగ్రత" అన్నాడు పెద్ద సైనికుడు.

ముసలి మామ యికిలించాడు. ముసలి అత్త నవ్వింది. కోడలు యిరవై మైళ్ళ దూరాన వున్న పీచ్‌క్రీక్ పల్లెకు వెళ్లిందనీ, తాము నిజమే చెబుతున్నామనీ అన్నారు ఆ ముసలి దంపతులు.

"అయితే యిక్కణ్ణించి పారిబోకండి!" అంటూ వాళ్లిద్దరినీ వెంట బెట్టుకుని యిల్లంతా వెతికారు సైనికులు. ముంగిళ్లూ, ఖాళీగా వున్న గదులూ అన్నీ చూశారు. ఓ ముంగిట్లో గడ్డివామి వుంది. పెద్ద సైనికుడు తుపాకీతో గడ్డివామి చుట్టూ పొడిచి చూశాడు. లోపలినించి సన్నని మూలుగు వినిపించింది.

"పిల్ల యిందులో దాక్కుంది" అన్నాడు పెద్ద సైనికుడు నవ్వుతో.

"ఇక పొడవక. చచ్చిపోతుంది. గడ్డిలాగేద్దాం పట్టండి" అన్నాడు స్ఫోటకం మచ్చల అతను.

"ఏం భయంలేదులే! బయటికిరా! కోడలు గాయపడ్డదని అతని గుండెలు ఎట్లా కొట్టుకుంటున్నాయో చూడు! ఇలా దాక్కోడం ఎక్కడా చూడలా! వెర్రివేషం!" అన్నాడు పెద్ద సైనికుడు.

కింద పడేట్లు ముసలి మామను స్ఫోటకం మచ్చల సైనికుడు ఒక తోపు తోశాడు.

"బయటికిరా! వెంటనే బయటికిరా! లేకపోతే తుపాకీ పేలుస్తాం" అన్నాడు పెద్ద సైనికుడు.

గడ్డివామిలోంచి పంట్లాం వేసుకున్న ఒక కాలు బయటికి వచ్చింది. తరవాత యింకో కాలు కనబడ్డది. ముసలి దంపతులు చూస్తూ నిలబడ్డారు. వాళ్ళకొడుకు గోల్డువాన్ గాటు గడ్డివామిలోంచి బయటకు దూకాడు. అది చూసి ముసలివాళ్ల హృదయాలు కొంచెం కుదుటపడ్డాయి.

"ఇదెవరు?" అని అరిచాడు స్ఫోటకం మచ్చలతను ఆశాభంగంతో.

"మీ కొడుకా?" అడిగాడు పెద్దతను.

"అవును కాప్టెన్!" అంది ముసలి అత్త.

"వీణ్ణి మనతో తీసుకుపోదాం విన్‌విక్టరీ లీ! పందిని మోసుకువస్తాడు" అన్నాడు పెద్ద సైనికుడు.

"వద్దు వద్దు కాప్టెనూ! మామీద దయచూపు. మాకు వీడు ఒక్కడే కొడుకు. నా వయస్సు ఎనభై ఒకటి, అతని తండ్రికి ఎనభై. వాణ్ణి మీరు తీసుకుపోతే మేము చచ్చినపుడు మాకు నీళ్లు వదిలేదెవరు?" అంటూ

ముసలి అత్త పెద్దగా ఏడుస్తూ వాళ్ల కాళ్ళమీద పడి కాళ్ళు గట్టిగా పట్టుకుంది. ముసలాయనను కూడా అలాగే చేయమంది.

"బతిమాలు! వీళ్లు మంచివాళ్ళు! దయగలవాళ్ళు! మనమీద జాలి చూపుతారు" అందామె.

విన్ విక్టరీ లీ తుపాకి గోల్డువావ్ గాటు వీపుకు ఆనించి పెట్టాడు. తనతో యింట్లోకి వచ్చి పందిని ఎత్తుకోమన్నాడు.

గోల్డువావ్ గాటు అంత పొడుగూ, పొట్టీ కానిమనిషి. [illegible]గా సన్నగా ఉంటాడు. అతను ఒకసారి ఆగి కొంచెం వంగి ఎడం భుజంమీద రక్తంతో తడిసిన చొక్కాను తడిమి చూసుకున్నాడు.

"ఏమంత పెద్దగాయం కాదులే! పర్వాలేదు. శిబిరానికి వెళ్ళాక కట్టు కట్టిస్తాము" అంటూ విన్ విక్టరీ లీ అతన్ని ఒక తన్ను తన్నాడు.

వీధిలో సైనికుల వెంట వెళుతున్న కొడుకును చూస్తూ నిలబడ్డారు ముసలి దంపతులు. అదే వాళ్లు అతన్ని ఆఖరుసారి చూడడం. అతని భుజం మీద వున్న కావడి బద్దకు నాలుగు కాళ్ళు బిగించి కట్టబడిన పంది [illegible] లాగా వేళ్లాడుతోంది. గోల్డువావ్ గాటు చేతికి ఒక తాడు కట్టి దాని రెండోకొస విన్ విక్టరీ లీ పట్టుకున్నాడు. అప్పటికి సూర్యుడు అస్తమిస్తున్నాడు. ఆ వెలుగులో కొడుకు గుడ్డలకు అంటుకున్న గడ్డి పరకలు కూడా దూరాన్నించి ఆ ముసలి దంపతులకు కనపడ్డాయి.

ఆ అమ్మాయి కనపడితే గాని ఆక్రమించి కదలనన్నాడు స్ఫోటకం మచ్చల సైనికుడు.

"రా! త్వరగా రా! త్వరగా వెళ్ళకపోతే ఆ పంది మనకు దక్కదు. అది మన శిబిరాల్లోకి పోయిందా సార్జంటు తన వంతు యివ్వమంటాడు. మన అధికారి తన భాగం యివ్వమంటాడు. వంటవాడు అతని భాగ్యాన్ని, బంధువులకు చాలా భాగం పెట్టాడు. పెరుగుతో కలిపి వండుకు తినేందుకు దాని రక్తం మనకు కొంచెం దక్కితే అక్కడికి మనం అదృష్టవంతుల మన్నమాట" అన్నాడు పెద్దసైనికుడు.

స్ఫోటకం మచ్చలతను గుణుస్తూ ఆక్రమించి బయలుదేరాడు.

పందినీ, గోల్డువావ్ గాటునీ సైనికులు తీసుకువెళ్లిన రెండు రోజులకు ఒక తెల్లవారు జామున పటాలం ఆక్రమించి ముకాం ఎత్తివేసింది. వేరే కొన్ని పటాలాలు అప్పుడప్పుడు వచ్చి వెళ్ళాయి. సైనికులకు పట్టుబడ్డ

పల్లెవాసులు కొందరు తప్పించుకుని యిళ్లకు వచ్చారు. గోల్డుహాన్‌గారు కూడా తప్పించుకు వస్తాడని ముసలి మామ, అతని కుటుంబం ఆశపడ్డారు. ఒకరోజు ఉదయం పల్లెకు కొంచెం దూరంలో వున్న బయలులో సైనికులు విన్యాసాలు చేయడం వూళ్ళో వినిపించింది. విన్యాసాలు ఆగగానే చెవులు బద్దలయేటట్లు పెద్దగా ఏడ్వడం, అరవడం ఊళ్లోవాళ్లకు వినిపించింది. మధ్య మధ్య ఏడుపులు ఆగేవి. పెద్దగా అరుపులు వినిపించేవి. పారిపోయిన పల్లెవాసులను పట్టుకుని సైనికులు వాళ్ల చెవులు కోశారనీ, ఏడుపులూ, అరుపులూ వాళ్ళవేననీ వూళ్లో రహస్యంగా చెప్పుకున్నారు. అందుకు నిదర్శనంగా వాళ్ళకు బయలులో పెద్ద రక్తం మరకలు కనిపించాయి.

ఈ విషయం జనం ఒకళ్లతో ఒకళ్లు చెప్పుకుని నవ్వుకున్నారు. సైనికులు చెవ్వులు కోసెయ్యడం వాళ్ళకి తమాషాగా ఉంది. ముసలి మామ కుటుంబానికి చెవులు కోయడం తమాషాగా కనపడలేదు. తమ చెవులనే కోస్తున్నట్లూ, చెవుల బదులు రక్తం చిమ్ముతున్న రంధ్రాలు అక్కడ వున్నట్లూ బాధ పడ్డారు. వాళ్లు, తమ కొడుకు చెవులను చేతులతో మూసుకుని వచ్చినట్లూ, గాయాలకు మందు వేయడానికి చేతులు తియ్యమని ఎంత బతిమలాడినా అతను చేతులు తియ్యనట్లూ, ముసలి అత్తకు కల వచ్చింది. తనకొడుకు చిన్నప్పటినించీ మొండివాడే అయినట్లూ, ఎలాగయినా డబ్బు కూడబెట్టి అతనికి చెవులటోపీ ఒకటి కొనాలని తను తంటాలు పడ్డట్లూ కూడా కల వచ్చిందామెకు. టోపీ పెట్టుకుంటే చెవులు లేని బాధ పోతుందా అని కొడుకుని తలుచుకుని మెలుకువ వచ్చిన తరవాత ఆమె వెక్కి వెక్కి ఏడ్చింది.

ఈ కథంతా ముసలిదంపతులు ఎవరికీ చెప్పేవాళ్లు కారు. చెపితే తమ కోడలి శీలాన్ని సందేహిస్తారని వాళ్ళ భయం. సైనికులు కోడలు ఎక్కడున్నదీ కనుక్కున్నారనీ, అపనింద తప్పించుకునేందుకే కోడలు సైనికులకు కనపడలేదని వాళ్లు అబద్ధాలు చెబుతున్నారనీ జనం అనుమానిస్తారు.

రోజులు గడిచాయి. కొడుకు అతీగతీ లేదు. ముసలి అత్తకు కొడుకు మీద బెంగ ఎక్కువయింది. అతను బ్రతికి లేడేమో అని ఎవరన్నా ధైర్యంచేసి ఆమెతో అంటే వాళ్ళమీద విరుచుకుపడేదామె.

ఈ సంఘటన జరిగి ఏడేళ్ళయింది. ఈ రోజు యింకో పంది పోయింది. ముంగిట్లో ఉన్న కొయ్య తొట్టెలోకి తొంగిచూస్తూ నిలబడ్డది కోడలు.

ముసలి అత్త ఎముకగాలికి గొంతు చించుకుంటూ "ఎందుకూ ఉన్నట్లుండి ఏడుపు ప్రారంభించావు. సంవత్సరాది యింత దగ్గరుండగా నట్టింట్లో ఏడవడం నష్టదాయకం. నేనూ, నీ మామా ముసలాళ్లమైనా యింకా బ్రతికే ఉన్నాముగా! మేము చచ్చేదాకా ఆగు. తర్వాత నీ యిష్టమొచ్చినట్లు ఏడుస్తువుగాని" అని అరిచింది.

కోడలు అత్తమాట నిర్లక్ష్యం చేసింది యిది ఒక్కసారే. ఇంకా ఎక్కువగా వెక్కి వెక్కి ఏడ్చిందామె.

"ఇంతటితో ఊరుకో! నా కొడుకు ఎక్కడైనా యింకా బ్రతికి వుంటే నీ ఏడుపు శాపం తగిలి చచ్చి వూరుకుంటాడు. వాడి పీడవదలిపోతే యింకోణ్ణి పెళ్ళి చేసుకోవచ్చని చూస్తున్నట్లున్నావు" అని విసిగిపోయి మళ్ళీ అరిచింది ముసలి అత్త.

అత్త అనవసరంగా తనను నిందించినందుకు గుండె పగిలినట్లయి మరీ పెద్దగా ఏడ్చింది గోల్డుహోవ్ గాట్.

"నాయనా! నీ కెంత రాతిగుండెరా! ఇన్నేళ్ళయినా యింటికి ఒక ఉత్తరం ముక్కయినా వ్రాశావు కావు. ఓ రాతిగుండెవాడా! నువ్వు త్వరగా రాకపోతే నన్ను మళ్ళీ చూడలేవురా! నీ కోసమని యింకా ఎన్నేళ్ళని బ్రతుకుతానురా!" అంటూ అత్తగూడా ఏడవటం ప్రారంభించింది.

"చాల్లే! యిక ఊరుకో! కామ్రేడ్ 'కహ్' యివాళ్ యింట్లోనే ఉన్నాడు" అని నెమ్మదిగా ముసలాయన భార్యకు జ్ఞాపకం చేశాడు.

"నీ కెందుకు భయం. మనకి కీడు చేసింది హోపింగ్ కాన్ సైనికులు కదా! వాళ్ళేకదా మనవాణ్ణి లాక్కుపోయింది" అన్నది ముసలి అత్త.

"యుద్ధం ముగిశాక హోపింగ్ కాన్ సైనికులను చాలామందిని జాతీయ సైన్యంలో చేర్చుకున్నారు. మనవాడు బతికివుంటే జాతీయ సైన్యంలో యుద్ధం చేస్తూ వుంటాడు" అన్నాడు ముసలిమామ.

ముసలి అత్తకు ఓ క్షణం భయంతో నోట మాటరాలేదు. కొడుకు జాతీయ సైన్యంలో చేరివుంటే తమ కుటుంబం విప్లవ విరోధిగా పరిగణింపబడుతుంది.

ముసలి అత్త కొంచెం తేరుకుని "ఎవరికి తెలుసు? మనవాడు కమ్యూనిస్టులకు పట్టుబడి విముక్తి సైన్యంలో చేర్చుకోబడి ఉండవచ్చు. అలా అయితే మన కుటుంబం సైనిక కుటుంబం అవుతుంది. మనకు సగం పందీ, నలభై సంవత్సరాది రొట్టెల పొట్లాలు వస్తాయి" అంది.

"ఏమిటా పిచ్చిమాటలు! పందిమాంసం, సంవత్సరాది రొట్టెలు తలుచుకుని మతిపోయింది నీకు" అన్నాడు ముసలి మామ.

# పదమూడో ప్రకరణము

తెల్లవారేటప్పటికి కావిళ్ళలో పందులు, బుట్టలతో సంవత్సరాది రొట్టెలు పంచాయితీ ఆఫీసుకు వచ్చాయి. కూతురి పెళ్ళి అయిపోయిన మర్నాడు చుట్టాలందరూ వెళ్లిపోగా అలరీ, హడావిడీ లేకుండా సద్దు మణిగిపోయిన యిల్లులా దిక్కూ లేకుండా, ఖాళీగా ఉంది ముసలి అత్త యిల్లు. మూన్ సెంటుకు నిత్యకృత్యాలు చేయడానికి మనస్కరించలేదు. పక్క యింటి గుమ్మంలోకి వెళ్లి ముసలి మామ యింటికి తిరిగి వచ్చాడా అని అడిగింటావేం.

"ఇంకా తిరిగి రాలేదు" అని అత్త బదులు చెప్పి రహస్యంగా "కావిళ్లు బుజాల వేసుకుని వరసగా నిలబడి తీసుకువెళ్లిన వస్తువులు అధికార్లకు యిచ్చేటప్పుడు నవ్వుతూ, మంచిగా యివ్వమని చెప్పాను. మొహం ముడుచుకుని యిస్తే వస్తువులు పోవడమే గాక నిందకూడా వస్తుంది" అంది.

"మా ఆయన కూడా నవ్వడం మరిచిపోకుండా ఉంటే చాలా బాగుండును" అంది మూన్ సెంటు ఆదుర్దాగా. మగవాళ్ళకోసం ఎదురు చూస్తూ వాళ్లిద్దరూ మాటల్లో పడ్డారు.

"మా ఆయన చోక్కా కాస్తా కుదువపెట్టి తాగడానికి పోలేదు కదా! ఈ మధ్య ఆయనకు మతి స్థిమితమే లేదు. టీ షాపుకు పోయి అక్కడే వున్నాడేమో చూస్తాం మంచిదనుకుంటాను" అంది మూన్ సెంటు.

"అతనికోసం నువ్వు వెళ్లకే. నువ్వు వెళ్లితే వాళ్ళందరిలో అతనికి చిన్నదనంగా ఉంటుంది. మళ్లీ పోట్లాడుతాడు. బెకన్ని పంపు" అంది అత్త.

మూన్ సెంటు బెకన్ని కేకేసింది. ఆ పిల్ల పలకలేదు. అక్కడంతా వెదికింది గాని బెకన్ కనపడలేదు.

"టక్కరి పిల్ల! కావడి వెనక వాళ్ళ నాన్నతో వెళ్లడం చూశాను. లొట్టెల వెనకాలే ఆఫీసు దాకా వెళ్లినట్లుంది" అంది మూన్ సెంటు.

ముంగిట్లో అత్తా, మూన్ సెంటు మాట్లాడుకుంటున్నారు. ముసలి మామ ఆవేశపడుతూ త్వరగా వచ్చాడు అక్కడికి.

"త్వరగా తలుపు మూసెయ్యి. గడియపెట్టు. త్వరగా! పిల్ల లెక్కడ? అంతా యింట్లో వున్నారా? మీరంతా త్వరగా లోపలికి పొండి" అని పరవళ్లు తొక్కాడతను.

"ఏం జరిగిందేం?" అడిగింది ముసలి అత్త.

ముసలి మామ తలుపు గడియపెట్టుతూ "వాళ్లు పోట్లాడుతున్నారు" అన్నాడు.

"ఎవరు?" అని అడిగింది ముసలావిడ.

"గోల్డురూట్ ఏడీ?" అని అడిగింది మూన్ సెంటు.

"నా దగ్గర వాడిమాట ఎత్తక. వెధవ కోపమూ వాడూనూ! ఎప్పుడో ఒకప్పుడు ఆ కోపం కొంపమీదకు తెస్తుందని నేను అంటూనే ఉన్నా. గోల్డురూటు తెచ్చిన సంవత్సరాది లొట్టెలు తూచి, తూకం తక్కువగా వుందన్నాడు వోంగు. గోల్డురూటు పెద్దగా అరిచాడు. అందరూ గోల్డురూటుతో చేరి అరిచారు. పెద్ద గోల అయింది. నేను తప్పించుకు బయట పడ్డాను. కావడీ,బుట్టలూ ఆ గంద్రగోళంలో పోయాయి. ఇంతటితో బయట పడడం అదృష్టమే" అన్నాడు ముసలి మామ.

మూన్ సెంటుకు భయం వేసింది. "మామా! నువ్వు బెకన్ని చూశావా?" అని అడిగిందామె.

ముసలి మామ మనిషి బిగుసుకుపోయి వేలుపెట్టి చూపుతూ "ఆఫీసు దాకా తండ్రి వెనకాలే వచ్చింది. త్వరగా వెళ్ళి తీసుకురా!" అన్నాడతను.

మూన్ సెంటు వెళ్లడానికి తలుపు గడియ తీయవలసి వస్తుందనీ మళ్ళీ ఆమె వచ్చినపుడు యింకోసారి గడియ తీయవలసి వస్తుందనీ అదుర్దా పడుతూ నణిగాడు ముసలి మామ.

గుడివేపు పరిగెత్తింది మూన్ సెంటు. ఆమె మనస్సు గాలిపటంలాగా రెపరెప లాడింది. లేత గులాబీ రంగులో వున్న గుడి గోడలు దూరాన్నించి కనపడ్డాయి. అరుస్తూ, అల్లరి చేస్తున్న మనుషుల కేకలు వినపడీ, వినపడకుండా వున్నాయి. మూన్ సెంటు నూటిగా గుడిద్వారం దగ్గిరికి పరిగెత్తింది. గుడి ముందున్న ఖాళీస్థలంమీద ఎండ పడుతోంది. అక్కడ మనుష్యులెవరూ లేరు. చెట్లమీద పక్షులు ఎగురుతున్నాయి. విల్లంబులాటి శూలం పట్టుకుని తూర్పువేపునించి ఒక సైనికుడు ఒక్కడు దూకుదూకాడు. రంగస్థలం మీదనించి వురికినట్లు ఆ సైనికుడు ఉరకడం మధ్యాహ్నపు ఎండలో వింతగానూ, ఏదో కలలాగూ ఉంది. ఆ సైనికుడు గుమ్మంలోంచి దూసుకుని తన పక్కగా పరిగెత్తి మాయమవడం చూస్తూ మూన్ సెంటు నిలబడ్డది.

రాతి మెట్లమీదనించి పైకి వెళ్ళి చీకటిగా ఉన్న హాల్లోకి తొంగి చూసింది మూన్ సెంటు. ఆ హాలుగోడలు చాలా ఎత్తుగా వున్నాయి. హాల్లో ఎవరూ లేరు. వెనక్కి తిరిగి గుడిలోంచి బయటికి పరిగెత్తిందామె. జనం కోపావేశంతో అరుస్తున్నారు. వాళ్ళ కేకలు షెన్ టాలంబరు కంపెనీ వేపునించి వస్తున్నట్లు ఆమెకు స్పష్టంగా వినపడ్డాయి. ప్రభుత్వం ఆ కంపెనీని వశపరుచుకుని గిడ్డంగిగా ఉపయోగించుకుంటోంది. "బెకన్! బెకన్!" అని అరుస్తూ మూన్ సెంటు అటువేపు పరిగెత్తింది.

లంబరు కంపెనీ వున్న యింటి గోడలు పొట్టిగా ఉన్నాయి. తెల్ల గోడమీద కంపెనీ పేరు ఎనిమిది తొమ్మిది అడుగుల ఎత్తు అక్షరాల్లో వ్రాయబడ్డది. ప్రభుత్వం ఆ కంపెనీని వశపరుచుకున్న తరవాత ఆ అక్షరాలు చెరిపి వేయబడ్డాయి కాని యింకా బూడిదరంగు గుర్తులు గోడమీద కనబడుతున్నాయి. ఆ గిడ్డంగి తలుపు దగ్గిర ఒక పెద్ద గుంపు పోగయింది.

"బెకన్ యింటికిరా! బెకన్ తండ్రీ యింటికి రా!" అని మూన్ సెంటు అరిచింది.

ఇద్దరు సిపాయీలు గుంపుముందు నిలబడి ఎర్రకుచ్చు ఉన్న బల్లాలు తిప్పుతూ "పొండి! యిళ్లకు వెళ్ళండి! యింక చాలు. అందరూ యిళ్ళకు పొండి" అని అరిచారు.

"సంవత్సరానికి మాకు బియ్యం అప్పు కావాలి."

"పంటలేమో బాగా పండాయి. సంవత్సరాది రోజున కూడా మేము మాడవలసిందేనా?"

"బియ్యం అప్పు అడగడం చట్ట విరుద్ధం కాదుగదా!"

"అప్పు అడగడ మేమిటి నీ మొహం! మనదేగా ధాన్యం."

అంటూ ఒకళ్ళ తరవాత ఒకరు గబగబా మాట్లాడారు. వాటిల్లో తన భర్త గొంతు ఏదో మూన్‌సెంటు గుర్తించలేక పోయింది. ఆమెలో కూడా ఆవేశం పెరిగింది. భర్తకోసం, కూతురి కోసం అదుర్దా పడటం మానేసింది. కూతురిని, భర్తను యింటికి రమ్మని పిలిచినందుకు సిగ్గుపడ్డది.

"బాబుల్లారా! మీరు చెప్పదలుచుకుంది నిదానంగా చెప్పండి. ఆ విషయం మనం ఆలోచించుకుందాం. మీ సమస్య లేవో చెపితే మనం సంప్రదించుకుని వాటిని పరిష్కరించుకుందాం. అందరూ ముందర యిళ్ళకు పొండి. మీకు నేను హామీ యిస్తున్నాను......" అంటూ వోంగు పెద్దగా అరిచాడు. కావడి బద్దలు తీసుకుని జనం తలుపు బాదారు. ఆ చప్పుడులో వోంగు చెప్పిన మిగతా మాటలు వినిపించలేదు.

గుంపులోంచి ఒక పిల్ల భయంతో ఏడ్చింది. "బెకన్! బెకన్!" అంటూ అరుస్తూ మూన్‌సెంటు గుంపులో జొరబడ్డది.

"అమ్మా! అమ్మా!" అంటూ బెకన్ పెద్దగా కేకలు పెట్టింది.

సిపాయీలు బల్లాలు, కర్రలు ఉపయోగించి గుంపును వెనక్కి నెట్టారు. గుంపులో ఒకతను "వీళ్ల దుంపతెగ! చంపుతారా ఏమిటి!" అంటూ బాధతో అరిచాడు.

కావడి బద్దలతో తలుపును యింకా ఎక్కువగా బాదారు జనం. తలుపు పగిలి చప్పుడు చేస్తూ విరిగి కిందపడ్డది.

"బాబుల్లారా! శాంతించండి: ఇది ప్రజల ఆస్తి. ఏవరూ ముట్టుకో కూడదు. అందరం కలిసి దాన్ని కాపాడుదాం" అని పెద్ద గొంతుతో వోంగు అరిచాడు.

గుంపులో ఒక మనిషి వోంగుని తలవెనక కొట్టాడు. ముగ్గురు సిపాయీలు తుపాకులు గుంపువేపు గురిపెట్టారు. టాన్ సోదరులలో ఒకడు ఒక తుపాకీ లాక్కో బోయాడు. సిపాయి అతని పొట్టలో తుపాకీ పేల్చాడు. మిగతా యిద్దరు సిపాయీలు తుపాకులతో తూటాలు పెట్టి

పోనేందుకు వెనక్కి తిరిగారు. జనం బుసలు కొట్టుతూ వాళ్ళమీద తోసుకు పడ్డారు.

"బుద్ధిహీనుల్లారా! ఇంటి కప్పు పైకి ఎక్కండి. అక్కణ్ణించి తుపాకులు కాల్చండి" అని అరిచాడు వోంగు. అతనికి గోరిల్లా యుద్ధంలో అనుభవముంది.

"అమ్మా! అమ్మా!" అంటూ ఒకే స్థాయిలో బెకన్ కేకలు పెట్టింది.

"బెకన్! బెకన్!" అని తల్లి అరిచింది. కూతురు ఆమెకు అట్టే దూరంలో లేదు కాని గుంపులో ఒక్క అంగుళమైనా అటూ యిటూ కదిలే అవకాశం లేదామెకు. జనం తొక్కిసలాడుతున్నారు. వాళ్ళమధ్య ఆమె యిరుక్కుపోయింది. ఆ భయంకర క్షణాల్లో తల్లీ, కూతురూ ఒకర్నొకరు అనంతంగా పిలుస్తున్నట్లున్నది.

వోంగు సవ్వుబురు స్వాక్ పాంగు భయంతో వణికిపోయాడు. వోంగు అతని చేతిలో వున్న తుపాకీ లాక్కున్నాడు. విరిగిపోయిన తలుపులోంచి జనం లోపలకు ప్రవేశిస్తున్నారు. వోంగు తుపాకీ కాలు కానించి పెట్టి లోపలికి వస్తున్న జనంమీద వాళ్ళూ వీళ్ళని చూడకుండా కాల్చాడు. తూటాలు అయిపోగానే మళ్ళీ తుపాకీలో తూటాలు పెట్టి కాల్చాడు. జనం చెల్లా చెదరైనారు. వాళ్ళ మధ్యనించి వోంగు దూసుకుపోయాడు. జనం అతని గుడ్డలు పట్టుకుని లాగారు. తుపాకీ నాలుగు వైపులా కాలుస్తూ జనాన్నుంచి తప్పించుకు బయట పడ్డాడతను. వోంగుకి బాగా గాయాలు తగిలాయి. రక్తం చిమ్ముతున్న అతని ముఖం పాలిపోయింది. గుడ్డలు చిరిగి పోయాయి. టోపీ ఎగిరి పోయింది. గుళ్ళో పడమటి వైపున వున్న తన గదిలోకి పరిగెత్తుకు వెళ్ళాడు వోంగు. అప్పుడు 'కు' అతని గదిలో కూర్చుని ఉన్నాడు. దొమ్మి ప్రారంభ మయినప్పుడు "కీర్తి చెందిన కుటుంబం" అనే గోడ కాయితం తయారు చేస్తున్నాడతను. బల్ల వెనక నిలబడి పట్టుబడ్డ దొంగలా చూశాడు 'కు'.

"వాళ్లకు తుపాకులు ఎక్కణ్ణించి వొచ్చాయి?" వణుకుతూ అడిగాడు 'కు'.

వోంగు జవాబు చెప్పకుండా కుర్చీలో కూలబడ్డాడు. తుపాకీ కాళ్లమీద అడ్డంగా పెట్టుకుని, నూనె ఓడుతున్న కోటుమీద గెడ్డం ఆనించి కూర్చున్నాడతను.

"నువ్వు గాయపడ్డావా కామ్రేడ్ ?" అని తెచ్చిపెట్టుకున్న ఆదుర్దాతో అడిగాడు 'కు'

"లేదు. బాగానే ఉన్నాను" అన్నాడు వోంగు నీరసంగా.

"వాళ్ళకి తుపాకులున్నాయే!" అని అన్నాడు 'కు'.

"గిడ్డంగి రక్షిస్తున్న మన సిపాయీల తుపాకులవి" అన్నాడు వోంగు ముక్తసరిగా.

"అట్లాగా!" అన్నాడు 'కు' కొంచెం తటపటాయిస్తూ.

దూరాన వినపడుతున్న గోల చాలావరకు సద్దుమణిగింది. కాని యింకా అప్పుడప్పుడు తుపాకులు పేల్చిన చప్పుడు వినపడుతోంది. వోంగు నడుం పటకాకు వేలాడుతున్న తువ్వాలు తీసి మొహంమీదా మెడమీదా కారుతున్న చెమట తుడుచుకున్నాడు.

"పరాజితులమయాం!" అన్నాడు వోంగు విచారంతో.

"పరాజితులమయాం! మన ప్రజమీద మనమే తుపాకులు కాల్చవలసి వచ్చింది" అన్నాడు మళ్లీ కొత్తగా ఆ మాట అప్పుడే చెపుతున్నట్లు.

'కు' అతని వేపు చూడలేదు. ఆ సమయంలో మనోబలం సన్నగిల్లి పరాజయం పొందినట్లు తను ఒప్పుకోవడం పార్టీ పట్ల ద్రోహం చేసినట్లవుతుందని వోంగు గ్రహించుకోలేక పోయాడు. పార్టీలో తనకు విశ్వాసం పోయిందనీ పార్టీకి అపచారం చేశాడనీ నేరం మోపి తనను పార్టీ శిక్షించే అవకాశం యిచ్చానని అతనికి అప్పుడు తెలియదు. వెంటనే కాకపోయినా, తరవాత అయినా వోంగు ఆ విషయం గ్రహించక పోడు. అప్పుడు తన నేరం ఋజువు పరచగల ఒక సాక్షిని అతను హతమార్చ ప్రయత్నించడం సహజంగా జరుగుతుంది. ఉద్యోగ రీత్యా వోంగు పదవి చిన్నదైనా, పల్లెలో అతని అధికారానికి అడ్డులేదు. ఇంతమంది చచ్చినప్పుడు యింకోడు చస్తే మాత్రం మునిగిపోయేదేముంటుంది!

ఉన్నట్లుండి వోంగు లేచి నిలబడ్డాడు. అతని ఒళ్ళో వున్న తుపాకీ నేలమీద పడి చప్పుడయింది. 'కు' గంతేసి తప్పుకున్నాడు.

"ఈ సంఘటనకు వెనక జనాన్ని ప్రోత్సహిస్తూ ఎవరో గూఢచారులుండి వుంటారు. లేకపోతే జనం ఎన్నటికీ యిట్లా తిరుగుబాటు చేయరు. దీని అంతు మనం కనుక్కోవాలి!" అన్నాడు వోంగు ఆవేశంతో. అతని ముఖం ఎర్రబడ్డది. కళ్లు ఎటో చూశాయి.

# పద్నాలుగో ప్రకరణము

సైనికులు జరిగిన సంఘటనను గూర్చి జిల్లా అధికారులకు చెప్పడానికి వెళుతూ చౌ పల్లెలో ఆగి ఆ వూరి కరణాన్ని జాగ్రతగా ఉండమని హెచ్చరించారు. కరణం పల్లె అంతా తిరిగి విప్లవవిరోధులు కొంతమంది తప్పించుకు పోయారనీ, వాళ్లు తమ ఊరికి రావచ్చుననీ, శ్రద్ధగా కనిపెట్టి ఉండమనీ, ఎవరైనా అనుమానాస్పదంగా కనపడితే వెంటనే వచ్చి తనకు చెప్పమనీ ప్రజను హెచ్చరించాడు.

కరణం చెప్పినదంతే అయినా టాన్ పల్లెలో అల్లర్లు జరిగాయన్న సంగతి నలుగురికీ తెలిసింది. తన పుట్టింటివారి ఊరిలో అల్లర్లు జరిగిన సంగతి విని గోల్డ్‌ఫ్లవరు చాలా ఆదుర్దా పడ్డది. అక్కడ ఏం జరిగిందోననీ, తనవాళ్ళకు ఎవరికైనా ఏమైనా అపాయం కలిగిందేమోననీ ఆమె గాభరా పడ్డది.

పొద్దుగూకుతుండగా గోల్డుఫ్లవర్ నీళ్లు తేవడానికి కాలవకు వెళ్లింది. బుజంమీద కావడిబద్ద వేసుకుని పరధ్యానంగా రాతిమెట్లు దిగి కాలవ దగ్గరకు వెళ్లిందామె. కాలవకు అవతల గట్టుమీద ఆమె పుట్టింటివాళ్ళ ఊరు వుంది. ఆమె కళ్లు అవతల గట్టుమీదే ఉన్నాయి. ఒక బుజం కొంచెం కిందకు వంచి నీటిలో ఒక కడవ ముంచింది. ఆకాశంమీద చీకట్లు అలుముకుంటున్నాయి. కొండలమీదా, పొదల్లోనూ చీకటి దట్టంగా వుంది. నీళ్లుమాత్రం తళతళలాడుతూ, తెల్లగా మెరుస్తూ, వెడల్పాటి బద్దిలాగు కనపడ్డాయి.

ఆమె వీపుకు ఒక రాయివచ్చి తగిలింది. వెనక్కి తిరగకుండానే "ఎవరా వెధవ!" అని అరిచింది గోల్డుఫ్లవర్. ఆమె బయటికి వచ్చినపుడు ఆ ఊరిలోని పిల్లలు 'పెళ్లి కూతురూ!' అంటూ ఏడిపిస్తూ ఆమె వెంట పడడం మామూలే.

ఇంకోరాయి బుజంమీదగా పోయి కాలవలోపడి చప్పుడయింది. రెండో కడవకూడా నింపుకుని, కావడి బుజాన వేసుకుని, నడుంమీద చేతులు పెట్టుకుని రాళ్లు వేసిన తుంటరి ఎవరో చూడడానికి వెనక్కి తిరిగింది ఆమె. ఎవరూ కనపడలేదు.

"అక్కా! అక్కా! గోల్డ్‌ఫ్లవర్!" ఎవరో నెమ్మదిగా పిలిచారు.

తల ఎత్తి చూసింది గోల్డ్‌ఫ్లవర్. కావడిబద్ద ఊతగా పెట్టుకుని ఒక నిమిషంలో గట్టుపైకి వచ్చిందామె. ఎదురు పొదదగ్గర తన కెదురుగా దూరాన తన వదిన నిలబడి వుండటం కనిపించిందామెకు. ముతక లాగుమీద తెల్లచొక్కా తొడుక్కుని, మొహంమీదనించి వేలాడుతున్న చింపిరి జుట్టుతో దెయ్యంలాగుందామె.

"ఏమిటి? ఏం జరిగింది?" అడిగింది గోల్డ్‌ఫ్లవర్ తడబడుతూ.

పళ్లు చలికి కరుచుకు పోవడంవల్ల మూన్ సెంటుకూ మాటలు తడబడ్డాయి. భయంవల్ల తనకు మాటలు తడబడుతున్నట్లు కనబడుతుందని మూన్ సెంటుకు చిరాకువేసింది.

"నీ బొంత జాకెట్టేమయింది?" అని అడిగింది గోల్డ్‌ఫ్లవర్.

"మీ అన్నయ్యకు యిచ్చాను. గాయాలనించి రక్తం కారి నీరసించి పోయాడు. జాకెట్టు అతనికి తొడుక్కోడానికి యిచ్చా" అందామె.

"గాయాలెందుకు తగిలాయి? ఏం జరిగింది?" అని ప్రశ్నించింది గోల్డ్‌ఫ్లవర్.

"వాళ్లు తుపాకులు కాల్చారు. కాలికి గాయం తగిలింది. ప్రాణానికి మోసం కలగలేదు, అంతవరకూ అదృష్టమే!" అంది మూన్ సెంటు సమర్థించుకుంటూ.

"ఇప్పుడెక్కడున్నాడు"?"

"దూరంగా కొండపైన."

"నన్ను అక్కడికి తీసుకు వెళ్లు. చూస్తాను."

మూన్ సెంటు తటపటాయించింది. "నువ్వు కడవలు ఇక్కడ వదిలి పెట్టి వస్తే ఎవరన్నా వాటిని చూసి ఏమనుకుంటారు!" అంది మూన్ సెంటు.

"అసలు వాళ్లెందుకు అన్నమీద తుపాకులు కాల్చారు?" అని గట్టిగా అడిగింది గోల్డ్‌ఫ్లవర్.

"గిడ్డంగుల దగ్గర పోట్లాట జరిగింది. సంవత్సరానికి బియ్యం అప్పు యివ్వమని అడిగారు మా వూరివాళ్లు. వాళ్లు తుపాకులు పేల్చారు" అని

"బెకన్ చచ్చిపోయింది. జనం తొక్కేశారు" అని చులాగ్గా చెప్తూ గోల్డుఫ్లవరును వికశించిన ముఖంతో చూసింది మూన్ సెంటు.

"ఏమిటీ!" అంది గోల్డుఫ్లవర్ తనా విషయం నమ్మనట్లు.

"మేమూ నమ్మలేదు. మాతో కొండమీదకు దాన్ని మోసుకు వచ్చాం. పైకి వెళ్లి చూస్తే అది చచ్చిపోయి ఉంది" అని చెప్పింది మూన్ సెంటు.

కాల్పులు జరిగిన విషయమూ; జనం తొక్కిసలాటలోంచి బయట పడగానే బెకనుకోసరం గిడ్డంగి దగ్గరకు తను పరిగెత్తిన సంగతీ చెప్పింది మూన్ సెంటు. తోసుకు వస్తున్న గుంపులోంచి బయట పడేందుకు తను తంటాలు పడుతుండగా తన భర్త వచ్చి తన చెయ్యిపట్టుకుని లాగుతూ త్వరగా పరిగెత్తాడు. అతని బుజంమీద బెకన్ పడివుంది. తమ పక్కగా రయ్యిమంటూ తుపాకీ గుళ్లు దూసుకు పోయాయి. గుళ్ల మధ్యనించి తాము పరిగెత్తారు. ఆ సమయంలో ఒంటిమీద గుడ్డ లేనట్లూ, ఒళ్లంతా గాయాలు అయినట్లూ అనిపించింది తనికి. తన శరీర విషయం ఎప్పుడూ లేనంత అదుర్దా కలిగిందప్పుడు. భర్తా, తనూ చెయ్యా చెయ్యా పట్టుకుని పరిగెత్తుతున్నప్పుడు తమకేం ప్రమాదం కలగలేదని తోచిందామెకు.

పరిగెత్తుతూ తన భర్త బోర్ల బొక్కలా పడ్డాడు. తుపాకీ గుళ్లు తగలకుండా తప్పించుకునేందుకు అతను అలా పడ్డాడనుకుంది మొదట్లో. కాని అతను గాయపడ్డాడని తనకు తెలియగానే బెకన్ కళేబరాన్ని తను తీసుకుని, అతన్ని లేవదీసింది. తనను ఆనుకుని నడిచాడతను.

"ఇంటిదగ్గర కొచ్చాం" అని తను అతనికి ధైర్యం చెప్పింది.

"వద్దు. మనం యింటికి వెళ్ళవద్దు. ఇంటికి వెళ్ళడానికి వీలులేదు. ఈ గోల అణిగిపోయేదాకా కొన్నాళ్లు ఎక్కడైనా తల దాచుకుందాం" అన్నాడు గోల్డుమాటు.

తన తల్లి యింటికి వెళదామా అనుకుంది తను. కాని అతను అంత దూరం నడవలేడు. అందువల్ల చౌ సల్లికు వెళ్ళడం మంచిదని అనుకుంది తను. తన భర్తా అందుకు ఒప్పుకున్నాడు. కొండలమీదగా అడ్డదారిలో పడి వచ్చారు కనుక ఎవరన్నా తమని చూస్తారన్న భయంకూడా లేక పోయింది.

ఆ రోజు సాయంకాలం మబ్బుపట్టి చలివేస్తోంది. కొండమీది చెట్ల వేళ్లు దూరదూరంగా భూమిలోంచి తొంగి చూస్తున్నాయి. కొండమీద తడిలేక పోవడంచూసి చెట్లు కొండదిగి నడిచి పల్లెలోకి రాదలచుకున్నాయా అన్నట్లు కనపడ్డాయి. తమ కోసమే మెట్లు చెక్కినట్లు కొండలు ఒకదాని వెనక ఒకటి నిలబడి వున్నాయి. ఆ కొండలు పురుషులే ఎక్కడం కష్టం. గోల్డురూటును తన వెంట నడిపించుకుంటూ మూన్‌సెంటు కష్టపడి కొండ ఎక్కింది. తన బుజంమీద వేలాడుతున్న తన కూతురు చచ్చిపోయిందని తనకు మొదటి నించీ తెలుసు.

పూర్తిగా అలిసిపోవడం వల్ల చేసేది లేక కూతురి దేహాన్ని వాళ్లు అక్కడే వదిలివెయ్యవలసి వచ్చింది. ఏ ఉద్దేశంతో కూడా వ్యవధి, ఓపిక లేవు వాళ్లకి. ఆ చిన్న మృతదేహాన్ని ఒక చెట్టు మొదట్లో దాచారు. వాళ్లు దూరంగా వెళ్లేవరకూ ఎవరూ వచ్చి ఆ కళేబరం చూడరని వాళ్ళ ఆశ.

వంతెనదాటి వూళ్లోకి రాబోయేముందు మూన్‌సెంటు గుండె భయంతో దడదడ కొట్టుకుంది. పొద్దు కూకుతోందప్పుడు. కాలిబాట లాగా సన్నగా ఉన్న ఆ వంతెన తెల్లగా ఉన్నవాగు నీటిలోకి పాతిన నల్లటి కర్రలపైన నిలబడి వుంది. చలి కాలంలో వాగులో నీరు తక్కువగా వున్నప్పుడు నీటిపైన ముప్ఫయి అడుగుల పొడుగుంటాయి ఆ కర్రలు. ఆ కర్రల మీద రెండు వరసల్లో పొడుగ్గా చెక్కలు పరిచి వున్నాయి. నాని పోయి కదులుతున్న ఆ చెక్కలమీద నించి అంత బరువుగా వున్న భర్తను కష్టపడి ఎట్లాగో దాటించింది తను. తాము వంతెన దాటుతున్నప్పుడు వేడిగాలి మెల్లిగా వీచింది. ఆ గాలి జాగ్రత్తగా నడవమని తమను హెచ్చరిస్తున్నట్టా అనిపించింది. తమ పాదాలకింద వున్న వెడల్పాటి వాగులోని నీరు తెల్లగా, మెల్లగా పారుతోంది.

ఆ రోజు జరిగిన అపూర్వ సంఘటనలను గూర్చి చెప్పుకోడానికి ఓ మనిషి కనపడినందువల్ల మూన్‌సెంటుకు కొంచెం మనశ్శాంతి కలిగింది. ఆమె వాటిని గూర్చి చెపుతున్నప్పుడు గోల్డు ఫ్లవర్ ముఖంలో కోపమూ, భయమూ కనపడ్డాయి. తను కథంతా చెప్పి ముగించిన తరవాత పరిస్థితి ఆమె సరిగా అర్థం చేసుకోలేదని మూన్‌సెంటు గ్రహించింది. మూన్‌సెంటుకు కలిగిన యీ అనుభవం వల్ల వాళ్లిద్దరి మధ్యా ఒక గోడ కట్టినట్లు

యింది. వెదురు పొదలమీద నించి చలిగాలి వీలుస్తోంది. ఆ చలిలో అలుముకుంటున్న చీకట్లలో పాలిపోయిన ముఖాలతో వాళ్ళిద్దరూ ఒకరి నొకరు చూసుకున్నారు.

"అయితే వాళ్లు మిమ్మల్ని పట్టుకునేందుకే వచ్చారన్న మాట. విప్లవ విరోధులన్నారు వాళ్లు" అంది గోల్డు ఫ్లవరు వున్నట్టుండి తనకేదో స్ఫురణకు వచ్చినట్లు.

"విప్లవ విరోధులన్నారా! మేము విప్లవ విరోధుల మెట్లా అయాం?" అని మూన్ సెంటు వాళ్లన్న మాట సరి కాదని చెప్పింది. కాని విప్లవ విరోధి అంటే ఏమిటో ఆమెకు సరిగ్గా తెలియదు.

"మేం యిక్కడనించి వెళ్లిపోవాలి. షాంగాయ్ పట్నంకి వెళ తాము. షాంగాయ్‌లో ఎక్కడేన్నా తలదాచుకో వచ్చు" అంది మూన్ సెంటు ఆ విషయం నిశ్చయించుకున్నట్లు. అంతలోనే "అయితే యిప్పుడు కాదు. ఆయన నడిచే స్థితిలో లేడు. మీ యింట్లో కొన్ని రోజులుండాలి" అంది మళ్ళీ.

గోల్డు ఫ్లవరు పళ్లు పెదిమల మధ్య చీకట్లో మెరిశాయి. ఏదో మింగ డానికి ప్రయత్నిస్తున్నట్లు నోరు మూసుకుందామె.

"మా యింట్లో ఎక్కడ దాచను? నా తోడికోడళ్లూ, వాళ్ల పిల్లలూ యిల్లంతా తిరుగుతుంటారే!" అంది గోల్డు ఫ్లవర్.

"ఏదో వంకన వాళ్ళు నీ గదిలోకి రాకుండా చెయ్యాలి."

"పిల్లల్ని ఆపడం సాధ్యం కాదు. పొద్దస్తమానం బయటికీ, లోపలికీ తిరుగుతారు వాళ్లు."

మూన్ సెంటు కొంచెంసేపు వూరుకుని "సరేలే, గర్భం పోయిందని చెప్పు. నీ గది మైలపడ్డదని వాళ్లు కొన్ని నెలలదాకా అటురారు. పిల్లల్ని కూడా రానీరు" అంది.

"నేను గర్భంతో లేనని వాళ్లకు తెలుసు కదా!"

"సిగ్గువల్ల నువ్వు ఎవరికీ చెప్పలేదు. అంతే!"

ఈ ఎత్తు బాగానే ఉందనిపించింది గోల్డుఫ్లవర్‌కి. ఇంకో మార్గం లేదు. ఈ భయంకర సంఘటన తన నిత్యజీవితానికి అవరోధం కలిగిస్తోంది. ఇంటి కోడలుగా తను నిర్వర్తించవలసిన విధులు కొన్ని వున్నాయి. భార్యగానూ, కోడలుగానూ తను ఆ యింట్లో తన హోదా జాగ్రతగా

కాపాడుకుంటున్నది. ఏ పని చేసినా తను చాలా జాగ్రత్తగా చేయాలి. లేకపోతే ఎప్పుడూ తనలో తప్పులు వెదకడానికి చూసే తన తోటి కోడండ్లమధ్య తను తల ఎత్తుకు తిరగలేదు. ఇప్పుడు తను చిన్నపిల్ల కాదు. ఆ మాట కొస్తే తన అన్నా చిన్నవాడు కాదు. క్రిందటిసారి [illegible] అడగటానికి తను పుట్టింటికి వెళ్లినప్పుడు తన అన్న ప్రవర్తన తెలుసుకుంటే తనమీద అతని కున్న ప్రేమ అడుగున పడ్డదనీ, అతను పెద్దవాళ్ళ [illegible]నీ తనకు స్పష్టంగా తెలిసింది.

మనస్సులో అనేకమైన ఆలోచనలు దొర్లుతూ వుండగా దగ్గర వున్న వెదురు బొంగు మీద చెయ్యివేసి పైకీ, కిందికీ రాస్తూ నిలబడ్డది గోల్డు ఫ్లవర్. చల్లగా, పొడుగ్గా వున్న ఆ బొంగుమీది కణుపులు చేతికి వేసుకున్న గాజుల లాగున్నాయి.

“గోల్డు ఫ్లవరు వదినా! నీకు చాలా యిబ్బంది కలుగుతుందని నాకు తెలుసు. ఏం చెయ్యమంటావు! ఈ ఆరుబైట రాత్రంతా వుంటే మా అన్న జీవించడం అసంభవం. చచ్చిపోతాడు” అని మృదువుగా అంది మూన్ సెంటు తన వదిన చెయ్యి అందుకుంటూ.

“పల్లెలోకి రావడం మా అన్నకే అపాయం కాదూ! తప్పనిసరిగా జనం చూస్తారు” అంది గోల్డు ఫ్లవర్ చిరాకుతో. ఆమె మొహం కంద గడ్డ లాగుంది.

“చీకటి పడ్డది. ఆయన నీ బుజంమీద ఆనుకొని వస్తాడు. తాగి వున్న భర్తను యింటికి తీసుకు వొస్తున్నట్లు నటించు” అన్నది మూన్ సెంటు.

“ఆయనను తీసుకువస్తున్నట్లు నటించి లాభంలేదు. ఇవాళంతా ఆయన యింట్లోనే వున్నాడు. ఆ సంగతి అందరికీ తెలుసు” అంది గోల్డు ఫ్లవర్ తన భర్త సంగతి ఎత్తినందుకు యిబ్బంది పడుతూ.

అయితే నీ మొగుణ్ణే పంపి మా అన్నయ్యను తీసుకురమ్మను. అన్నను. నీకంటే నీ భర్త అయితేనే బావుంటుంది. వీధి కుక్కలకు మీ ఆయన బాగా అలవాటు. అవి అట్టే మొరగవు. ఒక బొంత వెంట తీసుకు రమ్మని చెప్పు నీ భర్తకి. దాన్ని మా అన్నకు తల దగ్గిర నించి, కాళ్ల వరకూ కప్పి లోపల వున్నది నువ్వని చెప్పమను. మా పుట్టింటి వాళ్ళంతా తిరుగుబాటులో చంపబడడం వల్ల నువ్వు వాగులో దూకావనీ, నిన్ను బయటకు తీసి, యింటికి తీసుకువస్తున్నాననీ నీ భర్తను చెప్పమను” అంది మూన్ సెంటు.

నోట మాటలేకుండా నిశ్చేష్టురాలై చూసింది మూన్ సెంటుని ఆమె వదిన.

"అవును ఇదే చాలా బాగుంటుంది. బొంతలోపల ఆడది వున్నదని తెలిసినప్పుడు ఎవరూ బొంతలాగి చూడరు. ఆడది కాకపోతే వాళ్లు చూస్తా మనవచ్చు" అంది మూన్ సెంటు బాగా ఆలోచించుకుని.

గోల్డు ఫ్లవరు ఒక నిముషం వూరుకుని "అదీ లాభంలేదు. ఆయన వాళ్ల అమ్మకు చెబుతాడు" అంది.

"చెప్పకుండా నువ్వు అడ్డుపడాలి."

"నేను ఆపలేను. ఆయన భయస్థుడు. భయట పడితే ఆయన్ని విప్లవ విరోధని చెప్పి పట్టుకుపోతారు" అంది గోల్డు ఫ్లవరు విచారంతో.

"పిచ్చిదానా! మీ ఆయనకి చాలా మంచిగా చెప్పు. కొత్త పెళ్లా నివి. అతనిచేత ఏమైనా చేయించగలవు నువ్వు" అంది మూన్ సెంటు రహస్యంగా వదినను కొంచెం తోస్తూ.

"పిచ్చిది! నేను తెలివి తక్కువ పెద్దమ్మ ననుకుంటోంది కాబోలు! నా భర్తకే నన్ను అపచారం చేయమంటోందే! ఏమన్నా ఉందా ఆయన్ని మృత్యువు నోటికి అప్పగించడమేగా! తను నన్ను ఏం చేయమంటోందో ఆమెకు సరిగా తెలుసో తెలియదో! భర్తను ప్రేమించడం ఎటువంటిదో ఆమెకు తెలియదేమో! మూన్ సెంటు ఎప్పుడూ స్వలాభం చూసుకునే కఠినురాలు" అనుకుంది గోల్డు ఫ్లవర్.

తన అన్న అయితే వదిన అడిగినట్లు అడగడు. అతను అర్థం చేసుకుంటాడు. తన అన్న తనంటే ఎంత ప్రేమగా వుండేవాడో తలుచుకుని పొంగిపోయింది గోల్డు ఫ్లవర్.

చిన్నప్పటినించీ తనకు పెళ్లి అయేదాకా ఒకరి నొకరు ఎట్లా ప్రాణ సమానంగా చూసుకున్నదీ ఒకసారి జ్ఞాపకం చేసుకుంది. తామిద్దరూ ఒకరి మీద యింకోరు ఆధారపడి వున్నట్లూ, తమకు వేరే దిక్కెవరూ లేనట్లూ అనిపించిందామెకు.

తను అన్నకు చేయగల సహాయం చేయాలి–తప్పదు. మూన్ సెంటు చేతిలోంచి తన చెయ్యి లాక్కుని "నువ్వు యిక్కడే ఉండు" అని చెప్పి వెళ్ళడానికి త్వరగా వెనక్కి తిరిగింది గోల్డు ఫ్లవర్.

మూన్ సెంటు ఆమె వెనకే ఒక అడుగు వేసి, ఆగి "గోల్డు ఫ్లవర్ వదినా!" అంది జంకుతో.

తను తప్పించుకు పారిపోతున్నదని మూన్ సెంటు అనుకుందని గ్రహించి గోల్డు ఫ్లవర్ సిగ్గుపడ్డది. వెనక్కి తిరిగి నిలుచుండానే "భయపడక! త్వరగానే వస్తాను" అంది.

"బొంత తీసుకురమ్మని నీ భర్తతో చెప్పడం మరిచిపోక. కావడి బద్ద యిక్కడే మరిచిపోయావు" అంటూ గోల్డు ఫ్లవరు వెనక త్వరగా పరిగెత్తి కావడి బద్ద అందివ్వడానికి వొంగింది మూన్ సెంటు.

"అన్నయ్య విషయమే నాకు చాలా ఆదుర్దాగా వుంది" నెమ్మదిగా అంది గోల్డు ఫ్లవరు వదిన వేపు చూడకుండానే.

గోల్డు ఫ్లవర్ వెళ్ళిపోయింది. మూన్ సెంటు కొంచెం సేపు కొంచెం దూరం వెళ్ళింది. అక్కడ పొదలు బాగా దట్టంగా అల్లుకునున్నాయి. గోల్డు ఫ్లవరు తమను సహాయం చేస్తుందని ఆమెకు అంత నమ్మకం లేదు. చెల్లెలంటే తన భర్తకు అంత ప్రాణం. చెల్లెలు ఏం చేసినా ఒప్పుకుంటాడు తెలుస్తుంది. 'పెళ్ళి చేసుకు వెళ్ళిన ఆడపడుచు ఒలకపోసిన నీళ్ళతో సమానం' అన్న పాత సామెత నిజం ఇప్పుడు తెలిసి వస్తున్నది తనకి. ఆడపడుచులు పుట్టింటికి వచ్చి, బావలు, తోడికోడళ్ళు పెట్టే బాధలు చెప్పి వాపోతారు. కాని యిటువంటి సమయాల్లో తమ భర్తలు, వాళ్ళ కుటుంబాల విషయం తప్ప యింకో విషయం పట్టించుకోరు అనుకుని బాధపడ్డది మూన్ సెంటు.

కుక్కలు అరుస్తాయని భయపడకుండా తెగించి పొరుగు పల్లెల్లోకి వెళితే బావుండేదేమో అనుకుంది ఆమె. ఒకసారి తన భర్త వాళ్ళయింట్లో ప్రవేశిస్తే చౌన్ తమమాట వినక తప్పదు. తన భర్త వాళ్ళింట్లో వుంటున్నట్టు వాళ్ళకి ప్రమాదం. ఆ విషయం నలుగురికీ తెలుస్తుందేమో నన్న భయంతో తగిన జాగ్రత్తలో వుంటారు వాళ్ళు.

జిల్లుమని వీస్తున్న చలిగాలిలో ఆమె ముడుచుకుపోయింది. నాలికల లాగున్న వెదురు చెట్ల ఆకులు గుబులు పుట్టిస్తూ గలగల శబ్దం చేస్తున్నాయి. ఆ శబ్దంకన్నా ఎక్కువ గుబులు పుట్టించే శబ్దం లోకంలో వేరొకటి వుండదు. ఆ చలిలో కదలకుండా నిలుచోడం మరీ కష్టం. నడుస్తూ వుంటే కొంచెం చలి తగ్గినట్లు వుంటుంది. కాని నడిచే ధైర్యం లేదు ఆమెకు.

పల్లెలో అక్కడక్కడ దీపాలు చుక్కల్లా వెలుగుతున్నాయి. సాయంకాలం అవడంవల్ల అవతల వేపు ఉన్న విశాల మైదానం మసక మసకగా కనపడుతోంది. ఆ నిశ్శబ్దంలో ఏవో చప్పుళ్లు వినపడ్డాయి. ఆ చప్పుళ్లు చలికి బొంతలో దూరి నిద్రపట్టక అటూ యిటూ కదులుతూ వూపిరి పీల్చేమనిషి చేసే చప్పుడులాగున్నాయి.

గోల్డుఫ్లవర్ పెళ్లి మాటలు జరుగుతున్నప్పుడు మొదటి సారి మూన్ సెంటు చౌ పల్లెకు వచ్చింది. సంవత్సరానికోసారి ఆ వూరిలో దేవుడి ఉత్సవం జరుగుతుంది. గుంపులతో కలిసి తామూ ఉత్సవం చూశారు. అప్పుడు చౌవ్ గోల్డుఫ్లవరును పరికించి పరీక్షగా చూశారు. అంతవరకూ తామెవ్వరూ పిల్లవాణ్ణి చూడనేలేదు. అతను పొలంలో పనిచేస్తుండగా అతన్ని చౌ పల్లెలో తాము చూసేటట్లు ఏర్పాటు జరిగింది. పిల్లవాడిని సరిగా చూడమని ఆమెకు తాము చెప్పారు కాని తీరా పొలందగ్గరకు రాగానే ఆమె తల తిప్పేసుకుంది. తరవాత పిల్లవాణ్ణి గురించి తమలో తాము మాట్లాడుకుంటూ చాలా బావుంటాడని ఒకరు అంటే "చెవిపోగులు పెట్టుకొని ఆడదానిలాగా వున్నాడని" గోల్డ్ ఫ్లవర్ అంది. తల తిప్పేసుకున్న మనిషి అసలు పిల్లవాణ్ణి ఎట్లా చూసిందని చెప్పుకుని తమ కుటుంబంలో వాళ్లు ఎప్పుడూ నవ్వుకుంటుంటారు. అతను బ్రతకడేమో అన్న భయంతో చిన్నప్పుడు అతని తల్లి తండ్రులు చెవులు కుట్టించారు. దేవుళ్ళ కళ్ళల్లో కారం కొడుతూ అప్పటి నించీ అతని చెవులకు పోగులు ఆడపిల్లలా వేలాడుతున్నాయి.

ఆ రోజున గొర్రెనూ, కోడిపిల్లలనూ సంతలో అమ్మాలన్న వంకతో వాళ్లు చౌ పల్లెకు వెళ్లారు. బయలుదేరేముందు ఎక్కువ బరువు తూగేందుకుగాను గొర్రెకు వాళ్లు కడుపునిండా తిండి పెట్టారు. దాని పొట్ట అమితంగా ఉబ్బి, పెద్ద రాయిలా గట్టిగా ఉంది. అది నడుస్తూ ఉంటే కిందకు దిగజారిన దాని పొట్ట అటూ యిటూ వూగింది. అయినా ఆ గొర్రె దుముకుతూ, ఎగురుతూ కులాసాగా వాళ్ళముందు నడిచింది. గోల్డ్‌గూటు మెడమీద నించు వేలాడుతున్న కావడికి వున్న ఒక బుట్టలో కోడి పిల్లలూ, బాతులూ ఉన్నాయి. రెండో బుట్టలో పెకన్ కూర్చుంది. పెకన్ మరీ చిన్న పిల్ల కావడంవల్ల యింటిదగ్గర వదిలి రావడానికి వీలులేక పోయింది. రెండు చేతులతోను బుట్ట అంచును పట్టుకుని మెరిసే కళ్ళతో నిదానంగా బయటి ప్రపంచంలోకి చూసిందా పిల్ల.

వెనకటి సంగతులన్నీ జ్ఞాపకం వచ్చి మూన్ సెంటు లోలోపల ఏడ్చింది. పల్లెలో దీపాలు ఒకటి తర్వాత ఒకటి ఆరిపోయాయి. రాత్రిళ్లు వినపడే చప్పుళ్లు ఎక్కువగా వినవచ్చాయి. రాత్రి చాలా పొద్దుపోయిందని గ్రహించింది మూన్ సెంటు. తను సందేహించినట్లే గోల్డ్ స్లేవు మోసం చేసిందా అని ఆమెకు ఆతురా కలిగింది.

కన్ను పొడుచుకున్నా కడపనంత చీకట్లు అలముకొన్నాయి. నీటి వాగుదగ్గర ఒక మనుష్యాకారం కదులుతున్నట్లు కనపడటం వల్ల ఆమెకు భయం వేసింది. అది ఆడమనిషి. జుట్టును తలవెనక గట్టిగా బిగించి ముడి వేసుకుంది. అది చూసి ఆమెకు ఎక్కువ వయస్సు వుంటుందనుకుంది మూన్ సెంటు. దీపంకూడా లేకుండా తన వేపు వస్తున్న ఆ మనిషి గోల్డ్ స్లేవు అత్తగారని తెలుసుకుని ఆమె గాభరా పడ్డది.

తన ఆడబిడ్డ కావలనో లేక పొరపాటు వల్లనో తన రహస్యం బయట పెట్టి వుంటుందనుకుంది మూన్ సెంటు.

"ఉత్త బానిస తొత్తు! జీవం లేని బానిస! ఛండాలపు మనిషి!" అని ఆడబిడ్డను మనస్సులో తిట్టుకుంది. తనా ముసలావిడను కనపడటం మంచిదా కాదా అని ఒక నిమిషం ఆలోచించుకుంది. కొండ క్రింది భాగంలో చీకట్లో ఏదో కదిలిన చప్పుడయింది. "గోల్డ్ రూట్ వదినా! గోల్డ్ రూట్ వదినా!" అని ఆ ముసలావిడ నెమ్మదిగా పిలిచింది.

"పిన్నీ! మన్నించి రక్షించు!" అని నెమ్మదిగా అంటూ ఆమె దగ్గరకు వెళ్లింది మూన్ సెంటు.

"సమయానికి నాకు తెలియడం మంచిదయింది. గోల్డ్ స్లేవు ఒట్టి పసిపిల్ల. నా కొడుకూ అంతే! ఇద్దరూ పసిపిల్లలే. సహాయానికి వాళ్లమీద ఆధారపడటం అపాయకరం" అంది ముసలావిడ.

ఆమెకు తెలియకుండా ఆమె కోడలితో లాలూచీ చేసినందుకు తనను ఆమె మందలిస్తున్నదని మూన్ సెంట్ గ్రహించింది.

"మాకు దిక్కు తోచలేదు పిన్నీ! మాకు సహాయం చేసే వాళ్లెవరూ లేరు. నువ్వు వచ్చినందుకు నాకు చాలా సంతోషంగా వుంది. నీ మనస్సు ఎంత మెత్తనిదో నాకు తెలుసు" అంది మూన్ సెంటు.

"సమయానికి నేను కనుక్కోవడం నిజంగా అదృష్టమే; లేకపోతే సర్వనాశనం జరిగేది. మా యిల్లు చిన్నది. మా కుటుంబం పెద్దది. నీసా

మాత్రైతే బిరడాతో బిగించగలం గాని లోకుల నోళ్లు కట్టివెయ్య గలమా?" అంది ముసలావిడ.

"ఎవరిమీదో పెట్టడమెందుకు! నువ్వే వెళ్లి మా సంగతి మొదట బయట పెట్టావు" అనుకుంది మూన్ సెంటు మనస్సులో.

"మా యింటికి ఎవరైనా బంధువు వచ్చి ఒక రాత్రి బసచేసినా మేము అధికారులకు తెలియచెయ్యాలి. అధికార్లు వచ్చి జాగ్రతగా ఉండమని యింతకు ముందే చెప్పి వెళ్ళారు. అటువంటప్పుడు యిది ఎంత ప్రమాదమో ఆలోచించుకో! నువ్వు దేశద్రోహివి అంటే ఎవరు భయపడరు?" అంది ముసలావిడ.

"మేము దేశద్రోహులము కామే! మేము దేశద్రోహం పనులు రేమీ చేయలేదే?" అంది మూన్ సెంటు.

"అవునవును. వాళ్ళేమన్నారో తెలుసా? వాళ్లు ఎక్కడ ఉన్నదీ తెలిసి చెప్పకపోతే వాళ్లకు మద్దతు యిచ్చిన వాళ్లవుతారు మీరు. మిమ్మల్ని వాళ్లతో కలిపి జిల్లా ఆఫీసుకు పంపుతాము. పారిపోయిన భూకామందులకు ఆశ్రయం యివ్వడం కన్నా యిది పెద్దనేరం" అన్నారు.

మూన్ సెంటు తనను సమర్థించుకుంటూ ఏదో చెప్పబోయింది కాని ఆ ముసలావిడ వినిపించుకోలేదు. ఇంతవరకు వచ్చింది కనుక యిప్పుడు తప్పించుకు బయట పడాలంటే పట్నం వెళ్లి పడవ ఎక్కడమొక్కటే మార్గం. నువ్వు యీ చుట్టుపక్కలంతా ప్రయాణం చేసినదానివి. నీకు పట్నానికి దోవ తెలిసి ఉండడం అదృష్టం!" అంటూ ముసలావిడ మూన్ సెంటు చేతిలో ఒక మూటపెట్టి "మీకు తినడానికి తిండి తెచ్చాను. ఇక నేను వెళ్తాను. నేను అట్టేసేపు యిక్కడ వుండడం మీకూ, నాకూ కూడా క్షేమం కాదు" అంది.

మూన్ సెంటు ముసలావిడ చొక్కా చేతులు గట్టిగా పట్టుకుని "నీ కాళ్ళకు మ్రొక్కుతాను" అంది. తనకు దిక్కు లేకపోవడమూ, ముసలావిడ ముందు తన దీనస్థితి తలుచుకుని ఏడుస్తూ మూన్ సెంటు ఆమె కాళ్లమీద వాలిపోయింది.

"లే! లే! వద్దు! అట్లా చేయక!" అంటూ ముసలావిడ మూన్ సెంటును లేవదీయడానికి ప్రయత్నించింది. అది సాధ్యంకాక తను కూడా

మోకరిల్లింది. అట్లా చేయడంవల్ల తన బాధ్యత తీరినట్లూ, తను నిర్దయగా ప్రవర్తించనట్లూ తృప్తిపడిందామె.

"నీకు సహాయం చేయకూడదని నే నెన్నడూ అనుకోటం లేదు. నీ మంచికోసమే చెబుతున్నాను. వీలైనంత త్వరగా యిక్కణ్ణించి బయలు దేరు. ఇక్కడ ఉండడం క్షేమం కాదు. ఈ చుట్టుపక్కల అందరికి మీ విషయం చెప్పి జాగ్రతగా వుండమని చెప్పారు వాళ్లు" అంది ముసలావిడ.

"ఆయన నడవలేడు. ఈ కొండల్లోనే కొన్నాళ్లు దాక్కుంటాము. నా వదినతో అప్పుడప్పుడు మాకు యింత తిండి పంపమని చెప్పు" అంది మూన్ సెంటు.

"పేగులు కోరికే యీ చలిలో ఆరుబైట ఎట్లా వుంటారు? అదీ గాక యిక్కడకు కట్టెలు కొట్టేందుకు మనుషులు వస్తూ ఉంటారు. వాళ్లెవరైనా మిమ్మల్ని చూడవచ్చు" అంది ముసలావిడ విసురుగా.

"ఇంకా కొండపైకి వెళ్లి దాక్కుంటాము."

"ఇంకా పైకి వెళ్లితే అక్కడ తోడేళ్లుంటాయి. వూరికే నన్ను వేధించి ప్రయోజనం లేదు. చీకటి వుండగానే త్వరగా యిప్పుడే పట్నానికి బయలుదేరు" అంటూ లేచి నిలబడి మూన్ సెంటు పట్టు విడిపించుకోడానికి ప్రయత్నించిందా ముసలావిడ.

ముసలావిడగుప్పిళ్లను విడవకుండా పట్టుకుని "నెత్తుటి ధారలు కారుతూ ఉంటే అతను పట్నానికి ఎట్లా నడవగలడు? సిపాయిలు తిరిగే పోలీసోట్లు వుండే సిపాయీలను ఎట్లా తప్పించుకోగలం!" అంది మూన్ సెంటు. ఏడుస్తూ.

"వెళ్ళడానికి వీలున్నప్పుడే బయలుదేరడం మంచిది. గో[illegible] వదినా! నా కొడుకుల్లో ఎవరో ఒకరు యీ పాటికి మీ సంగతి అధికారులకు చెప్పారేమో కూడా! ఈ సంగతి నీకు చెప్పాలనుకోలేదు గాని తప్పనిసరైంది. ఇప్పటికైనా త్వరగా బయలుదేరు" అంటూ పట్టు విడిపించుకుని ముసలావిడ వెళ్లిపోయింది.

తొందరగా తను అక్కణ్ణించి వెళ్లిపోవడానికే ముసలావిడ తనను అట్లా బెదిరించి వుండవచ్చు. అయినా చెప్పటమెట్లా! అనుకుంది మూన్ సెంటు.

మూన్ సెంటు కష్టపడి కొండ యెక్కింది. ముసలావిడ యిచ్చిన ఫలహారాల మూట గట్టిగా రొమ్ముకు అదుముకుని ఆమె నడిచింది. ముసలావిడ మంచి కబురు తేకపోయినా, తినడానికి యింత తిండన్నా తెచ్చింది కదా అని అంత నిరాశలోనూ కొంచెం వుపశమనం పొందింది మూన్ సెంటు. చీకట్లో ప్రతిదీ కొత్తగా కనపడుతోంది. తను భర్తను ఒక చెట్టుకు ఆనించి కూర్చోబెట్టి వచ్చింది. ఇప్పుడు ఆ చెట్టు ఏదో గుర్తు తెలియటం లేదు. దూరంగా ఒక పొడుగాటి చెట్టు కనపడ్డది. దానికింద కూర్చోపెట్టినట్లు ఆమెకు జ్ఞాపకం. అక్కడికి వెళ్లిచూసి తను పొరబాటు పడ్డానని గ్రహించిందామె. కొత్తచోట మార్గం తెలుసుకోడం కష్టం. అడుగడుక్కీ అపాయం వున్న శత్రుదేశంలో మార్గం మరీ కష్టం.

మూన్ సెంటు యింకా కొంత దూరం ముందుకు నడిచింది. తను భర్తను దాచి పెట్టిన చోటు దాటి వచ్చినట్లనిపించిందామెకు. భయం ఎక్కువై వెనక్కి తిరిగింది. అక్కడంతా జాగ్రతగా వెతికింది. భర్త కనపడలేదు. అతన్ని తను వదిలి వెళ్లి చాలా సేపయింది. వాళ్లు వచ్చి అతన్ని పట్టుకు పోయారా? లేకపోతే ఏదన్నా వినో, చూసో ఎక్కడైనా దాక్కున్నాడా? ఇంకెక్కడో దాక్కునే వుండాలని అనుకుంది ఆమె.

“ఎక్కడున్నావు బెకన్ తండ్రీ!” అని నెమ్మదిగా పిలుస్తూ చీకట్లో వెతికిందామె.

చీకటి వల్ల చుట్టుపక్కల ఖాళీ ప్రదేశాలన్నీ ఒకటిగా కలిసిపోయాయి. హీనస్వరంలో మాట్లాడి, మాట్లాడి గొంతు రాసుకుపోయి బాధగా వుందామెకు.

నెత్తురు వాసన పసిబట్టి తోడేళ్లు కొండమీదనించి కిందకు దిగివచ్చి ఉంటాయి. సామాన్యంగా యింత దూరం కొండ దిగువకు రావవి. కాని నెత్తురు వాసన వాటిని ఆకర్షించి వుండవచ్చు. మనుష్యులు తెచ్చిపెట్టిన యీ కరువు వల్ల మనుష్యులలాగే తోడేళ్లు కూడా డొక్కమాడి బాధపడుతున్నాయని ఆమె అనుకుంది. అట్లా అనుకోడంలో అర్థం లేదు.

తోడేళ్లు అతన్ని పీక్కుతిని వుంటే ఏ చెయ్యో కాలో అక్కడ ఎక్కడైనా పడివుండేది. ఆఖరికి కాలిజోడైనా కనిపించేది. ఈ ఆలోచన మనస్సుకు తట్టగానే ఆమె భయంతో కంపించి పోయింది. ధైర్యం తెచ్చుకుని చుట్టుపక్కలంతా వెతికింది. వాగుగట్టుమీద వున్న ఒక చెట్టు

దగ్గరకు వెళ్ళి తొంగి చూసింది. నీళ్లు తెల్లగా మెరుస్తున్నాయి. నీళ్ళదగ్గర వున్న ఓ చిన్న చెట్టు ఆమె దృష్టిని ఆకర్షించింది. ఆ చెట్టు కొమ్మల్లో పెద్ద గూడులాగా ఏదో వుంది. గూడు అనుకోడానికి వీల్లేనంత పెద్దదిగానూ, భూమికి దగ్గరగానూ ఉందది.

తడుముకుంటూ నెమ్మదిగా చెట్టుదగ్గరకు దిగిందామె. చలికి కొంకర్లు పోతున్న చేతులతో చెట్టుకు వేలాడుతున్న మూట అందుకుంది. అతని చొక్కా చేతులు ముడివేసి కట్టిన మూట అది. మూటలో ఆమె జాకెట్టు జాగ్రత్తగా మడత పెట్టివుంది. భర్త ఎదురుగా నిలబడి చెప్పినంత స్పష్టంగా ఒక నిమిషంలో ఆమెకు అంతా అర్థమయింది.

ఆమె కాళ్ళదగ్గర తెల్లగా మెరుస్తూ వాగు పారుతోంది. నెత్తురుతో తడిసి చిరిగిపోయిన పంట్లాం ఆమెకు పనికిరాదు. కనుక అతను తీసుకుపోయాడు. చొక్కా పాతదైనా చిరగలేదు కాబట్టి దాన్ని ఆమెకు వదిలి పెట్టాడు.

తప్పించుకు పారిపోయేందుకు తనకు అవకాశం ఇవ్వాలనుకున్నాడతను. తనకి తగిలిన గాయం చాలా ప్రమాదకరం కాదని అతను గ్రహించాడు. తనా విషయం గ్రహించలేదు. గ్రహించినా ఒప్పుకునే స్థితి కాదు. తనతో అతను గాయం విషయం ఏమీ అనలేదు. చెట్టుక్రింద అతన్ని వీలైనంత సుఖంగా కూర్చోబెట్టి వెళ్ళేటప్పుడు తను లేచి నిలుచున్న స్థానంలో అతను తన తలపాగాను చేత్తో గట్టిగా పట్టుకున్నాడు. అప్పుడది తనకు చిన్నపిల్లవాడి చేష్టలాగా కనిపించింది. ఇప్పుడా పాలెగాడి మనసులో తనను వెళ్ళవద్దని అతను ప్రాధేయపడ్డాడని తోచింది తనకు. ఆ నిమిషంలో ఏం చేయబోతున్నాడో అతను అంతకు ముందే నిశ్చయించుకున్నాడని ఎందుకో తోచింది. ఇంకా అతని చెయ్యి తన తలపాగామీద ఉండగా అనిపించేటంత స్పష్టంగా తనకా విషయం జ్ఞాపకం ఉంది. ఆమెకు ఏడ్పొచ్చినట్లయింది.

చాలాసేపు అక్కడే నిలబడి తర్వాత కొంచెం తేరుకుని జాకెట్టు తొడుక్కుని గుండీలు పెట్టుకుంది మాన్ సెంటు. అతని చొక్కా వదులుగా నడుంచుట్టూ చుట్టుకుని, చేతులు పొట్టమీద ముడివేసుకుంది. చీకిపోయిన ఆమె జాకెట్టు చెవులదగ్గర పుచికి వుంది. బుజాలు నొప్పి తోటి మొహం తుడుచుకుందామె. నెమ్మదిగా అడుగులు వేస్తూ బయలుదేరి త్వర త్వరగా తమ ఊరివేపు నడిచింది మాన్ సెంటు.

# పదిహేనో ప్రకరణము

ముసలి మామ యింట్లో అల్లర్లు జరిగిన ఆ రాత్రి దీపం వెలిగించ డానికి కూడా ధైర్యం లేకపోయింది. ఇంట్లో అందరూ గుసగుసల్లో మాట్లాడుకున్నారు. చీకట్లో కోడలు మీద పడి నవ్వుల పాలవుతానేమో నవే భయంతో ముసలి మామ యింట్లో దగ్గుతూ తిరిగాడు.

"నే నెప్పుడూ చెప్పటం లేదూ! ఎప్పుడో ఒక రోజు వాళ్లు పెద్ద ఆపదలో చిక్కుకుంటారని" అన్నాడు ముసలి మామ.

"మే మెవరం చూడకుండా పొద్దస్తమానం వాళ్లింటికి వెళ్లి గోల్డు రూట్ పెళ్లాం చెవిలో గుసగుస మాట్లాడావు. ఇప్పుడు బాగా అయింది. వాళ్లు నిన్ను కూడా పట్టుకుపోయినా పోవచ్చు. విప్లవవిరోధిని ఒకసారి వాళ్లు నీకు ముద్దర వేస్తే యింక నువ్వు ప్రాణాలతో ఉండగలవా! వాళ్లు తమాషాకి ఆ మాట అని ఊరుకుంటారనుకున్నావా?" అని హీన స్వరంలో కోడల్ని మందలించింది ముసలి అత్త. గోల్డువావ్‌గాట్ వదిన భయంతో ఏడ్చింది.

"సైనికులు వచ్చి యిల్లు సోదాచేశారు. అంటే వాళ్లిద్దరూ ఎక్కడో బతికే ఉన్నారన్నమాట. వాళ్లు ఎక్కడో దాక్కున్నారు. పట్నానికి తప్పించుకు పారిపోయి అక్కణ్ణించి పడవలో వెళ్లి వుంటారు" అన్నాడు ముసలి మామ అది తనకేమీ సంబంధించని విషయంలాగు.

"ఆజ్ఞాపత్రం లేనిదే వాళ్లు పడవ ఎట్లా ఎక్కగలరు? పట్నంనించి వచ్చినపుడు మూన్ సెంట్ చెప్పడం నువ్వు వినలేదూ! పడవ లంగరుదగ్గర ఎన్నో ప్రశ్నలు అడుగుతారట" అంది ముసలి అత్త.

సాయంకాలం సిపాయీలు మళ్లీ వాళ్ల యింటికి వచ్చారు. వాళ్లు లాంతర్లు పట్టుకుని యింట్లో ప్రవేశించడం ముసలి దంపతులు కిటికీలోంచి చూశారు. 'కు' సామాన్లు కావడిలో పెట్టుకుని కాసేపట్లో సిపాయీలు యింటి బయటకు వచ్చారు. బహుశా 'కు' వోంగ్ దగ్గరకు వెళ్లి వుంటాడు. ఆ రాత్రి వోంగుతో గడపడం అతనికి క్షేమం.

సిపాయీలు గోల్డురూటు నది తలుపు మూయలేదు. తెల్లార్లూ తలుపు గాలికి చప్పుడు చేస్తూ కొట్టుకుంది. ముసలి అత్తకు నిద్రపట్టక కోడల్ని వెళ్లి తలుపు గడియ పెట్టి రమ్మంది.

"మన మెవ్వరమూ ఆ తలుపు ముట్టుకో కూడదు. వాళ్లకు తెలిస్తే ఆ యింట్లోనించి మనము ఏవో తీశామని అనుమానపడతారు. వాళ్ళ వస్తువులన్నీ ప్రభుత్వం స్వాధీన పరుచుకున్నప్పుడు, వాటిల్లో ఏదన్నా కనపడకపోతే మనమీదకు వస్తుంది" అన్నాడు ముసలి మామ భయంతో.

రాత్రంతా తలుపు పెద్దగా చప్పుడు చేస్తూ కొట్టుకుంది. చప్పుడు వింటూ ముసలి అత్త చాలాసేపు మేలుకునే వుంది. "అది గాలికి రయే చప్పుడనుకోను నేను. వాళ్లిద్దరూ వచ్చినట్లున్నారు!" అన్నది ముసలి అత్త నెమ్మదిగా.

ముసలి మామకూ అట్లాగే తోచిందిగాని "పిచ్చిగా మాట్లాడక!" అని ముసలావిణ్ణి కసురుకున్నాడతను.

తన మాటలు వాళ్లిద్దరూ దెయ్యాలై యింట్లో ప్రవేశించినట్లు అర్థ మయ్యేలాగున్నాయని తెలుసుకుని ముసలి అత్త భయపడ్డది. వాళ్లు బ్రతికే ఉన్నారేమో! తను వాళ్లను దెయ్యాలనుకోవడం వాళ్ళకు కీడుతలచడమే అవుతుంది.

ఆమెకు వాళ్ళమీద ఎక్కడలేని జాలీ కలిగింది. వాళ్లి లేత వయసున్నా, వాళ్ళలో ఉన్న మంచీ ఆమెకు జ్ఞాపకం వచ్చి కంటినించి నీరు ధారలగా కురిసింది.

# పదహారో ప్రకరణము

దేవాలయంలో వోంగు నివాసస్థలం అంత వాసయోగ్యంగా ఉండదు. కాని రైతుల మధ్య వుండి వచ్చిన 'సుం'సు చదువు వచ్చినవాళ్లు కనపడగానే స్వగృహానికి వచ్చినట్లు ప్రాణం లేచివచ్చింది. గది పొడుగ్గా, విశాలంగా వుంది. పూర్వం ఆ గదిలో ఒక ఉత్సవ విగ్రహం వుండేది. విగ్రహాలు దొంగిలించుకు పోయారు కాని అక్కడ వున్న సామాన్లు, బూజూ శుభ్రం చేయలేదు. ఒక మూల కాయితాలతో నిండిన ఒక రాత బల్లా, కుర్చీలు, బల్లలూ వున్నాయి. ఆఫీసు గదీ, పడక గదీ అదే. గదిలో దీపం వెలుగుతోంది. మనుష్యులు లేకపోవడంవల్లా, దుమ్ము నిండి వుండడం వల్లా, ఒక విధమైన వాసన ఆ ప్రదేశమంతా వ్యాపించింది. పల్లెటూరివాళ్లు

ఆ వాసననే 'పెళ్లాం పోయిన ముసలివాడి వాసన' అంటారు. నరాలు కొరికే చలిలో ఆ వాసన మరింత బాధగా వుంది.

పైపెదిమమీది వెంట్రుకలు పీక్కుంటూ 'కు' భయంతో పక్క మీద కూర్చున్నాడు. తిరుగుబాటులో పట్టుబడ్డ మనుష్యులను దేవాలయం సావిట్లో సైనికులు హింసిస్తున్నారు.

"అయ్యో! అయ్యో!" అంటూ వాళ్లు మూలుగుతున్నారు. కొంచెంసేపు వాళ్ల మూలుగులు వినపడీ వినపడకుండా వున్నాయి. అంతలో ఉన్నట్లుండి మృగాలమల్లే ఆకాశం బ్రద్దలయ్యేట్లు అరవడం వినపడుతుంది.

ఇది నిజమా కలా అనుకున్నాడు 'కు'. దెయ్యాల కథలలో ఓ ప్రయాణీకుడు దేవాలయంలో ఓ రాత్రి తలదాచుకుంటాడు. చచ్చిపోయిన వాళ్ళను శిక్షిస్తూ దేవతలు అరవడం విని అతను మేల్కొంటాడు. తన స్థితి ఆ ప్రయాణీకుడి స్థితిలాగుంది. దేదీప్యమానంగా వెలుగుతున్న వెలుగులో ఆ ప్రయాణీకుడు చచ్చిపోయిన తన బంధువులు నరకబాధలకు గురికావడం చూస్తాడు. భయపడి ఒక్క అరుపు అరుస్తాడు. అంత్లా చీకటవుతుంది. దేవాలయం నిశ్శబ్దమై పోతుంది.

అరుస్తే అంతా మటుమాయ మవుతుందేమో! కమ్యూనిస్టులు హింసామార్గం అవలంభించరని పట్నాల్లో గట్టిగా వాదిస్తారు. భూకామందులనూ, గూఢచారులుగా అనుమానింపబడిన వాళ్ళనూ హింసించారని శత్రుపక్షంవాళ్లు అబద్ధాలు చెబుతారు.

'పులి పీఠం' మీద కూర్చుని బాధతో మూలుగుతున్న వాళ్లు అమాయక రైతుజనం కావడంవల్ల 'కు' వాళ్ల బాధ మాసి భరించలేక పోయాడు. గూఢచారులకు, విధ్వంసకులకు వాళ్లు సహాయపడ్డారని పల్లెప్రజకు వోంగు చెప్పాడు. కాని అందులో ఎంతమాత్రం నిజం లేదని వోంగుకి తెలుసునని 'కు'కు తెలుసు. అధికారులకు వోంగు వ్రాసే సంజాయిషీలో హింసింపబడినవాళ్లు ద్రోహులని వ్రాస్తేగాని వాళ్లు వోంగు చర్యలను అంగీకరించరు. అప్పుడే వోంగుకి మాట దక్కుతుంది. వోంగు అంత పాపభీతి లేనివాడైతే తన ప్రాణంమీదికి రాకుండా కాపాడుకు నేందుకు 'కు' జాగ్రత్తపడడం మంచిది.

"ఊరికే విషయాలు ఊహించుకో కూడదు" అనుకున్నాడు 'క'. వోంగునీ, వోంగు చేసే పనులనూ నమ్మకపోతే తనకు అపాయం కలుగుతుందని అతనికి తెలుసు. "నీ మంచికోసమే నమ్ము" అనే మాట కమ్యూనిస్టుల్లు వచ్చాక వెయ్యిసార్లు తనకు తను చెప్పుకున్నాడు. వివేకవంతుల్ని మత్తులో పడేసిందీ మంత్రమే. ఈ మంత్రం జపిస్తూ వాళ్లు ఎన్ని కష్టాలైనా సంతోషంతో భరిస్తారు. మనస్సును కల్లోలపరిచే ఆలోచనలు, అనుభూతులు యీ మంత్రం జపిస్తే మాయమైపోతాయి. అంతరాత్మను ఊరుకోబెట్టి, బతుకు భారం తగ్గిస్తుందీ మంత్రం.

"ఇది నాకు అగ్ని పరీక్ష" అనుకున్నాడు క.

మధ్య తరగతి వాళ్లకుండే సునిశితమైన ఉద్రేకాలను తను అణిచి పెట్టుకోవాలి. అకలిగొన్న రైతులు తిరుగుబాటు చేయడం ప్రమాదవశాత్తూ జరిగింది. సకృతుగా జరిగిన ఆ సంఘటనను అస్పష్ట దేశపరిస్థితులతో ఏలాటి సంబంధమూ లేదు. ప్రజల తిరుగుబాటుకు కారణమైన ఘోర దేశపరిస్థితులు ప్రభుత్వ గౌరవానికి భంగం కలిగిస్తాయి. రానురాను ప్రజల శ్రేయస్సుకు అవి ప్రతిబంధకంగా పరిణమిస్తాయి. కనుక తిరుగుబాటు శత్రువుల ప్రతినిధులచేత పురికొల్పబడ్డాదని ప్రజలకు నచ్చచెప్పడం చాలా ముఖ్యం. ఈ విషయంలో వోంగు చాలా శ్రద్ధ తీసుకోవాలి. తిరగబాటు దార్లచేత వాళ్లు ఎందుకు తిరగబాటు చేసిందీ చెప్పించాలి. వాళ్లు చెప్పే విషయాలు ఒకదానికి ఒకటి విరుద్ధంగా గాక ఒకే పద్ధతిలో ఉండేటట్లు అతను చూడాలి. తిరగబాటుదార్లను జిల్లా ఆఫీసుకు పప్ప చెప్పేటప్పుడు వాళ్ళంతా ఒక్కేవిధంగా సంజాయిషీ చెప్పేట్లు వోంగు జాగ్రతపడాలి అనుకున్నాడు 'క'.

అంతలో మూన్ సెంటు అతనికి జ్ఞాపకం వచ్చింది. తాననుకున్నట్లు జరిగితే మూన్ సెంటుకు అపాయం కలుగుతుందని అతనికి భయంవేసింది. ఆమెకు పట్టబోయే దుర్గతి తలుచుకుని అతను చాలా అదుర్దాపడ్డాడు. ఆమె పట్టుబడి, హింసింపబడుతూ వుంటే తను చూస్తూ వూరుకోలేడు.

అతని గదికి చివరవున్న తలుపు తెరిచిన చప్పుడు వినపడిందతనికి. అక్కడ చీకటిగా వుంది. కుంపటి తీసుకుని మూన్ సెంటు వస్తోందేమోనని అతను తలయెత్తి చూశాడు. ఆమె కుంపటీ తీసుకు రావడం అతనికి సంతోషంగానూ, అవమానంగానూ కూడా వుండేది.

కామ్రేడ్ వోంగుకి సిగరెట్లు తీసుకు వెళ్ళడానికి స్మాల్ ఫాంగు గదిలోకి వచ్చాడు. అతను వోంగు పక్కమీదవున్న దిండుకింద వెతికాడు.

"ఈ రాత్రి ఎవరికీ నిద్ర వుండేటట్లు లేదు. కామ్రేడ్ వోంగు చాలా కష్టపడుతున్నాడు" అని ఆవలిస్తూ నసిగాడతను.

"అవును. వోంగ్ విశ్రాంతి తీసుకోవాలి. గాయపడ్డాడు కదూ!" అన్నాడు 'కు' నవ్వుతూ.

"నిజంగా ఆయన విశ్రాంతి తీసుకోవడం అవసరం. ఈ రాత్రి వాళ్ళను తలక్రిందులా వేళ్లాడగట్టి తేసరి. రేపు పొద్దున్నకి మహా చక్కగా మాట్లాడుతారు" అన్నాడు ఫాంగు.

గోల్డురూటు, అతని భార్యా పట్టుబడ్డారా అని మామూలుగా అడిగాడు 'కు'. ఆ విషయం తనకేం తెలియదని ఫాంగు చెప్పాడు.

వోంగు పడుకోటానికి గదిలోకి వచ్చేటప్పటికి రాత్రి చాలా పొద్దు పోయింది. మంచం మీది ఒల్లలు చప్పుడవడం, అతను ఊమ్మి వేయడం సగం నిద్రలో ఉండికూడా 'కు' విన్నాడు. దీపం ఆరిపోయింది. గురక వినిపించడం వల్ల అతనికి పూర్తిగా మెలకువ వచ్చింది. వోంగు గొంతులోంచి వెలువడే శబ్దాలు అతనేదో తాగుతూ, గుటకలు వేస్తున్నట్లు వినపడ్డాయి. పెద్ద గుటకలు వేస్తూ అతనా చీకటి రాత్రిని మింగుతున్నాడా అనిపించింది. మధ్య మధ్య గురక ఆగడం, వోంగు తృప్తిగా ఆవలించడం జరిగింది.

'కు' కు తెలియకుండానే అతన్ని నిద్ర ఆవహించింది. ఉన్నట్లుండి అతను ఉలికిపడి లేచాడు. చెవ్వులు చిల్లులు పడేటట్లు కొండల దగ్గర యింకా తుపాకులు కాల్చబడుతున్నాయి. కామ్రేడ్ స్మాల్ ఫాంగ్ చేతిలో ఒక నూనె దీపం పట్టుకుని గదిలోకి రావడం చూశాడు 'కు'.

"కామ్రేడ్ వోంగ్! గిడ్డంగి తగలబడుతోంది!" అని అరిచాడు కామ్రేడ్ స్మాల్ ఫాంగ్.

వోంగు చప్పున నిద్రలేచి దుస్తులు వేసుకుంటూ "దీపం ఆర్పివెయ్యి!" అని కేక వేశాడు.

కామ్రేడ్ స్మాల్ ఫాంగ్‌కు యుద్ధ విషయాల్లో అనుభవం లేదు. వోంగు దీపం ఆర్పెయ్యమని ఎందుకంటున్నాడో అర్థం కాలేదు. తను సరిగా వినిపించుకోలేదేమోనని అతనికి అనుమానం కలిగింది.

వోంగు తలకు కట్టు కట్టబడి వుంది. నిద్ర లేకపోవడం వల్ల అతని ముఖం ఉబ్బింది. దీపం ఆరిపోతూ మిణుకు మిణుకు మంటోంది. ఆ వెలుగులో వోంగు ముఖం ఎర్రగా కనబడ్డది. వోంగు కళ్లు సంతోషంతో మెరుస్తున్నాయని గ్రహించాడు 'కు'. తిరగబాటు దారుల వెనక వుండి వారిని పురిగొల్పినది అజ్ఞాతవాసంలోకి పోయిన జాతీయ వాదులని తెలియడం వల్ల అతని మనస్సు తేలిక పడ్డదనుకున్నాడు 'కు'.

వోంగు త్వరగా దేవాలయం బయటకి వెళ్ళాడు. ఎందువల్లనో అప్పటికి కాల్పులు ఆగిపోయాయి. కుక్కలు మొరుగుతున్నాయి. అగ్ని ప్రమాదం తెలిపేందుకు సైనికులు డప్పులు వాయిస్తూ ఊళ్లో ఒక కొస నుంచి యింకో కొసకు తిరుగుతున్నారు.

"మంటలు! ఆర్పేందుకు సహాయానికి రండి!" అని అరిచేది దూరంగా వినపడ్డది.

"సోదరులారా! అందరూ సహాయపడండి! మంటలు ఆర్పేయండి! గిడ్డంగిని రక్షించండి! అందులో వున్నది ప్రజల ధాన్యం!" అంటూ గొంతు పోయేటట్లు అరుస్తూ వోంగు కట్టుకట్టిన తలతోనే అటూ యిటూ పరిగెత్తాడు.

అంతకు ముందంతా తుపాకులు ప్రేలడం వల్ల ఆ భయంతో జనం ముందుకు రాలేదు. "గిడ్డంగిలో వున్న బాణసంచా అది. బాణసంచా అంటుకుంది" అని ఎవరో వున్నట్లుండి కేక పెట్టారు.

ఆ మాట ఒకరినుంచి యింకొకరికి పాకి చివరకు దేవాలయంలో వున్న 'కు' దాకా వెళ్లింది. అప్పుడు అతనికి ధైర్యం వచ్చి మంటలు ఆర్పడంలో సహాయపడేందుకు బయటకు వెళ్లాడు.

జనం బొక్కెనలూ, చేదలూ, బిందెలూ తీసుకుని నాలుగు వేపుల నించీ వొచ్చారు. కొంతమంది చాలా మొండిగా మంటలతో పోట్లాడారు. తాము చెమటోడ్చి పండించిన ధాన్యం మీద వాళ్లకు చాలా అపేక్ష. ఆ అపేక్షలో స్వార్థం లేదు. ధాన్యపు గిడ్డంగి మంటలకు ఆహుతి అవుతూ వుంటే వాళ్ల హృదయాలు బాధతో కొట్టుకుపోయాయి. తమ బంధువులను కాల్చి చంపినందుకు తగిన శాస్తి జరిగిందని కొందరు సంతోషించారు. దాని మొత్తంమీద జనం "మంటలు ఆర్పండి" అంటూ కుండలూ, బిందెలూ తీసుకుని నీళ్లకోసం వాగు దగ్గరకు పరిగెత్తారు. నీళ్లు తీసుకుని

పరిగెత్తుకు వచ్చేటప్పుడు చాలా భాగం వొలికి పోయేవి. ఒలికి పోయిన నీరు వెంటనే గడ్డ కట్టుకుని దోవ జారుడయింది. 'కు' బొక్కెన నిండా నీళ్లు తెస్తూ జారిపడ్డాడు. చల్లగా వున్న నీళ్లు వొలికి అతని గుడ్డలు తడిసి పోయాయి. పడటంలో అతని ముఖాని కేదో గట్టిగా కొట్టుకుంది. అది విరిగిన తన కాలే నని ఓ నిమషం 'కు' కు భయం వేసింది. అంతలో అది తన కాలు కాదనీ, శవమనీ తెలుసుకుని గజ గజ వణికిపోయాడు. ముక్కు మీద ముక్కుద్దాలను సవరించుకుంటూ లేచి నిలబడ్డాడు. కొంచెంలో తప్పింది కాని అవి పగలవలసిందనుకున్నాడు. అంతటితో సహాయం చేయడం మాట దేవుడికి వొదిలి, చూస్తూ నిలబడ్డాడు 'కు'. తడిసిపోయిన అతని చొక్కా నీళ్లు కారుతోంది. చలితో వణికిపోయాడతను,

సైనికులు యింకా డప్పులు వాయిస్తూనే ఉన్నారు, వెనకటి రోజుల్లో బందిపోటు దొంగలు పల్లెటూళ్ళమీద పడి దోచుకునే టప్పుడు యిట్లాగే డప్పులు వాయించేవాళ్లు. ఎడ తెరిపి లేకుండా డప్పులు వాయిస్తూ వుంటే 'కు' కు బందిపోటు దొంగలు జ్ఞాపకం వచ్చి హడలి పోయాడు. తెల్లారుతూ వుండగా ఎర్రని లేత ఎండలో సైనికులు ఎర్ర కుచ్చు బల్లాలు తిప్పుతూ మైదానం మీదగా పరిగెత్తారు. మంటలు ప్రారంభ మైనప్పుడు ఒక స్త్రీ తప్పించుకు పారిపోతూ వుండగా చూశాననీ, ఆవిణ్ణి మంటల్లోకి తరిమాననీ ఓ సైనికుడు చెప్పాడు.

డప్పులు వింటూ. పైకి ఎగసిపోతున్న మంటలు చూస్తూ ఉంటే 'కు' కు అడివిజాతి మనుష్యుల్లో కలికే ఉత్సాహం కలిగింది.

"ఇటువంటిది ఎప్పుడు జరుగుతుందా అనే నేను కాచుకున్నాను. నేను తీయబోయే చిత్రానికి యిది ఉద్రేక పూరితమైన గొప్ప పర్యావసానంగా ఉపయోగిస్తుంది. ఇది కొన్నియేళ్ల క్రిందట జరిగినట్లు కథను చిత్రిస్తే సరిపోతుంది. వెనకటి పరిపాలన క్రింద రైతాంగం ఆకలి మంటలకు ఆగలేక దొమ్మీ చేసి, గిడ్డంగి తగల బెట్టినట్లు చిత్రిస్తాను" అనుకున్నాడు 'కు'.

విద్యాధికులకు సూచనలిస్తూ ప్రధాన పత్రికలలో వ్రాయబడిన వ్యాసాలు 'కు' కు జ్ఞాపకం వచ్చాయి. వెనకటి రోజుల్లో జరిగిన విషాద సంఘటనలను గురించి రచయితలు వ్రాయకూడదు. ప్రస్తుతం జరుగుతున్న

వృజ్వాల నిర్మాణాత్మకమైన కార్యాల గురించి వ్రాయాలి. 'చీకటిని తిట్టు కోక, వెలుగును స్తుతించు" అన్నాయా పత్రికలు.

ఆరిపోతున్న అగ్ని జ్వాలలను చూస్తూ 'కు' విచారపడ్డాడు. గిడ్డంగి పూర్తిగా ధ్వంసమయింది. మంటల వెలుగులో ఆ యింటి అస్థిపంజరం స్పష్టంగా కనిపిస్తోంది. నల్లగా కాలిపోయిన పెద్ద పెద్ద దుంగలు పక్షుల లాగా దూలాల మీద వేలాడుతున్నాయి. ఆరిపోతున్న మంటల వెలుగులో రాబందులూ, గెద్దలూ వరసగా కూర్చుని తలలు అటూ యిటూ తిప్పుతూ భయంకరమైన ఉల్లాసంతో ఊగిపోయాయి.

# పదిహేడో ప్రకరణము

హిసేన్ పట్టణంలోని పబ్లిక్ సెక్యూరిటీ బీరో ఆఫీసునుంచి బయలు దేరి వస్తూ గోల్డు ఫ్లవర్ అనే భర్త అయిన ఫ్లెంటీ ఓన్‌తో ఒక నిమిషం ఆగమని చెప్పింది. ఆమె తొడుక్కున్న కాలిజోడు పట్టీ ఊడిపోవడం వల్ల, ఆమె ఒక చేత్తో భర్త చెయ్యి పట్టుకుని ఒంటి కాలు మీద నిలబడి చెప్పుకి గుండీ పెట్టుకుంది,

నదిలో కనపడ్డ ఒక శవాన్ని గుర్తుపట్టేందుకు గాను అధికారులు గోల్డు ఫ్లవర్‌ని హిసేన్ పట్టణానికి పిలిపించారు. ఆ శవం నదిలో అక్కడికి కొట్టుకు వచ్చినట్లుంది. అది గోల్డురూటు శవమని అధికారులకు తోచింది. ఆ విషయం నిర్ధారణ చేసుకునేందుకే గోల్డు ఫ్లవరను అక్కడకు పిలిపించారు.

తన భార్యకు ఆ రోజు చాలా దుర్దిన మనుకున్నాడు ఫ్లెంటీ ఓన్. వాళ్లు చాలా దూరం నది వెంబడి నడిచి పట్నం చేరుకున్నారు. పోలీసు వాళ్ళమధ్య వాళ్లిద్దరూ నడిచి వస్తూ ఉంటే రైతు జనం వాళ్ళను రెప్ప వాల్చకుండా చూశారు. పోలీసు స్టేషనుకు వెనక వైపున వున్న పాకలో ఎలక్ట్రిక్ దీపం వెలుగుతోంది. ఆ వెలుగులో ఒక గతుకుల చెక్కమీద పడివున్న శవాన్ని వాళ్లు చూశారు. వాళ్ళలో కలిగే ఉద్రేకాలను కని పెట్టడానికి పోలీసులు తమ పక్కనే కాచుకు వున్నారని ఫ్లెంటీ ఓన్ గ్రహించాడు. బావమరిది శవం చూసినపుడు అతను పైకి ఎటువంటి

ఉద్రేకమూ కనపడనీయలేదు. అతని భార్య మాత్రం 'అన్నయ్యా!'' అని నెమ్మదిగా అనడం అతను విన్నాడు.

తుపాకీవల్ల కలిగే గాయం ప్లెంటీ ఓన్ యిది వరకు ఎప్పుడూ చూడలేదు. తొడలో తగిలిన గాయాన్ని నీళ్లు శుభ్రంగా కడిగేశాయి. గాయం చుట్టూ నెత్తురు లేదు. ప్రశ్నలు అడగడానికి పోలీసులు వాళ్ళను అవతలకు పిలుచుకు వెళ్లారు. వాళ్లు చెప్పిన జవాబులకు కార్మేడ్ తృప్తి పడ్డాడు. వాళ్లచేత కొన్ని కాయితాలమీద పోలీసులు సంతకాలు చేయించారు. చదువు రానందువల్ల ఆ కాయితాల్లో ఏం రాసిందీ వాళ్ళకు తెలియదు. ఆఖరికి శవ సంస్కారం సంగతి మాట్లాడాడు ఆ కార్మేడ్. "మీకేమైనా ఉద్దేశం ఉంటే సరే, లేక పోతే ఆ విషయం మేమే చూసుకుంటాము" అన్నాడతను. శవం తమ ఊరికి తీసుకువెళ్లడం మంచిపని కాదనుకుని పోలీసులనే ఆ పని చూడమన్నట్లు తల ఆడించాడు ప్లెంటీ ఓన్.

గోల్డు ఫ్లవర్ కాలిజోడు గుండీ పెట్టుకోడానికి భర్తమీద ఆనుకున్నప్పుడు అతను తల కొంచెం వంచి ఆమె ముఖం దగ్గర ముఖం పెట్టాడు. అతను ఆమెవైపు చూడకపోయినా భర్త తనను చూసి జాలిపడుతున్నాడని ఆమె గ్రహించింది. ఆమె ఏదో ఆలోచించుకుంటూ తదేక ధ్యానంలో వున్నట్లు ఆమె ముఖం స్పష్టపరిచింది. ఆమెలో ఏవైనా భావాలు చలరేగుతున్నా లేకపోయినా వాటని ఆ ముఖం ముసుగు పరిచింది.

అన్న శవాన్ని చూసినపుడు ఆమెకు గుండెదడ వచ్చివుంటే కొత్తచోటు కావడం వల్ల అది కొంచెం ఉపశమించింది. భర్తతో కలిసి పట్నంలో సాయంకాలంవేళ తిరగడం ఆమెకు చాలా చిత్రంగా వుంది. వాళ్లిద్దరూ కలిసి ఎప్పుడూ బయటకు వెళ్ళలేదు. పట్నానికి వస్తున్నప్పుడు దారిపొడుగునా వాళ్ళతో పోలీసులుండడం బాధగా వుంది. ఇప్పుడు వాళ్ళవెంట ఎవ్వరూ లేరు. ప్లెంటీ ఓన్‌కు లోపల చాలా ఉత్సాహంగా ఉందిగాని అది బయటకు కనపడనీయలేదు. అతని భార్యకు కూడా తనలాగే లోపల ఉత్సాహంగా ఉందని అతను గ్రహించి వుంటే చాలా ఆశ్చర్యపోయేవాడు.

వాళ్లు రేవు దగ్గరకి చేరుకున్నారు. అప్పటికి చీకటి పడ్డది. రేవులో ఉన్న పడవలలో దీపాలు వెలుగుతున్నాయి. పడవలు అటూ యిటూ ఊగుతూ వుంటే వాటితో దీపాలూ ఊగాయి. ఒక పడవలో వున్న దీపం

వెలుగులో పడవచెక్కకు మేకుతో కొట్టబడిన వెదురు గొట్టం వాళ్ళకు కనపడ్డది. ఆ గొట్టంలో ఎర్రగటి పుల్లలు వున్నాయి. మిగతా పడవల్లో ఉన్న నూనె దీపాల కాంతి నీళ్లల్లో పడుతోంది. ఒక పడవలో చీకటిగా ఉంది. చీకట్లో చుక్కాని దగ్గర నిలబడి ఒక మనిషి నదిలో మూత్ర విసర్జన చేశాడు.

కూలివాళ్లు కావిళ్లు బుజాన వేసుకుని పడవల్లోకి సామాను మోస్తున్నారు. అరిగిపోయిన వెపల్పాటి మెట్లమీద జారిపడకుండా జాగ్రత్తగా నడిచారా కూలీలు. పసుపు పచ్చని కాంతి వెదజల్లుతున్న విద్యుత్ దీపం వెలుగులో ఆ పురాతనపు మెట్లు చిత్రంగా కనపడ్డాయి. తుపాకులు పట్టుకున్న సిపాయీలు ఒడ్డుమీదనించి పడవవాళ్ళను ఏవో ప్రశ్నలడిగారు. బందిపోటు దొంగలలాగున్న పడవ కలాసులు వూగుతూ మెట్లుదిగి వచ్చారు. వాళ్లు గుండీలులేని లావుపాటి చొక్కాలు వేసుకున్నారు. మెట్లు దిగుతూవుంటే వాళ్లు కాళ్ళకు తొడుక్కున్న తోలు చెప్పులు టక టక చప్పుడు చేశాయి. రేవులో జనసంచారం లేదు. చీకటిగా వుంది. సంవత్సరాదికి దుకాణాలు అన్నీ మూసివేయబడ్డాయి. కొంచెం దూరంలో ఏదో గలాటా జరుగుతున్నట్లు వినపడింది. అక్కడ జనం గుంపుచేరారు. [illegible], ఆమె భర్త అదేమిటో చూడడానికి ఆగారు. "ఓ పడవవాడు బాగా తప్పతాగి పడవమీదనించి నీళ్ళల్లో పడ్డాడు. చావడానికి సంవత్సరాది బలేరోజు! నది వొడ్డున శవసంస్కారం జరుగుతోంది" అన్నాడు గుంపులో వున్న ఓ మనిషి.

ఏడెనిమిదిమంది ఒకరి నడుము యింకొకరు పట్టుకొని వరుసగా మోకరిల్లారు. వాళ్ళల్లో మొదటివాడు ఒక కుర్రవాడు. బహుశా అతను చచ్చిపోయిన మనిషి కొడుకై వుంటాడు. ఆచారప్రకారం [illegible] చుట్టూ ఒక తెల్లగుడ్డ కట్టారు. ముందున్న కుర్రవాడి [illegible]మీద ఆ గుడ్డ ముడివేశారు. చాలాసేపటినుంచి వాళ్లు ఏడుస్తూ ఉండి వుండాలి! మొగవాళ్ళ గొంతులు బొంగురు పోయాయి. స్త్రీలు లోలోపల సన్నగా గొణుగుతూ మూలుగుతున్నారు. వాళ్ళలో ఒకరు పెద్ద గొంతుతో [illegible]ంటూ ఏడ్చారు. ఆ ఏడుపు మిగతావాళ్ళ [illegible]మీదుగా గాలిలో కలిసిపోయింది. ఆ కుర్రవాడు పట్టలేని దుఃఖంతో వంగి వంగి నమస్కారాలు చేస్తూ ఏడ్చాడు. అతని తల ముందుకు వాలిపోయింది. అతని ముందర

ఒక కుంపట్లో కట్టెపుల్లలూ, బూడిదా వున్నాయి. కొంచెం దూరంలో ఒక నలుచదరం బల్లవుంది. దానిమీద పొడుగాటి తెల్ల కొవ్వొత్తులు రెండు వెలుగుతున్నాయి. కొవ్వొత్తుల పక్కన కట్టెపుల్లలు వున్నాయి. బల్లముందు యిద్దరు మనుష్యులు కూర్చుని వున్నారు. వాళ్లు సన్యాసులు కారు, పురోహితులూ కారు. డబ్బు తీసుకుని బౌద్ధ కీర్తనలు పాడడం వాళ్ల వృత్తి. దుకాణాల్లో పనిచేసేవాళ్ళలాగా అసహ్యమైన పొడుగాటి అంగరకాలు తొడుక్కున్నారు వాళ్లు. వాళ్లకి ముప్ఫయి ఏళ్ళ వయస్సు ఉంటుంది. పాఠాలు పెద్దగా చదివే బడిపిల్లలలాగా అటూ ఇటూ ఊగుతూ గొంతులు కలిపి కీర్తనలు పాడారు వాళ్లు. మాటకీ మాటకీ సంబంధం లేకుండా సంస్కృత భాషలోగాక చైనా భాషలో చాలా సేపు ప్రార్థించారు. గోల్డుఘవరుకు అక్కడక్కడ కొన్ని వాక్యాలు మాత్రమే అర్థమయ్యాయి. చచ్చిపోయిన వాడిపేరూ, ఊరూ, వయస్సూ, అత్తవారి యింటి పేరూ, మొగసంతాన మెంతో, ఆడసంతాన మెంతో ప్రార్థనలో చెప్పారు. ఈ విషయాలన్నీ మనస్సారా చెప్పి, అతన్ని తిరిగి మనిషిగానే పుట్టించమనీ, పురుష జన్మ అతనికి ప్రసాదించమనీ ప్రార్థించారు.

“నా అన్నకి కూడా యిట్లాగే కర్మకాండ జరిపిస్తాను. ఇప్పుడు కాకపోయినా యీ విప్లవ ద్రోహపు హడావిడి సద్దుమణిగాక అయినా చేయిస్తాను” అనుకుంది గోల్డుఘవరు. అలా కర్మకాండ జరిపిస్తే దుర్గతి కలగకుండా వుంటుందనీ, సామాన్య చావు చచ్చినవారిలోనే జమ అవుతాడనీ ఆమె అభిప్రాయం. చీకటిగా వున్న నది ఒడ్డున మిణుకు మిణుకుమంటున్న కొవ్వొత్తుల వెలుగులో ప్రార్థనలు సాగుతుండగా ఆ మృత శరీరాన్ని పెద్దలలో కలిపేశారు.

గోల్డుఘవరు అన్నకొరకు ప్రార్థనలు చేసేందుకు ఏర్పాటు చేస్తాననీ ఒక పిల్లవాడిని తెచ్చి అన్నకు వారసుడిగా దత్తత చేస్తాననీ, అతనిచేత కర్మ చేయిస్తాననీ తన అన్న ఆత్మను మనస్సులో తలుచుకుని ప్రమాణం చేసింది. పిల్లవాణ్ణి పెంచి పెద్దవాణ్ణి చేస్తుంది తను. వాడికి వివాహంచేసి అన్న వంశం నిలబెడుతుంది. అత్తవారి యింట్లో తన విధి నిర్వర్తించినట్లే పుట్టింటి విషయంలో కూడా తన విధి నిర్వర్తిస్తుంది. అన్నకి దుర్మరణం ప్రాప్తించిన తరవాత అన్నను తలుచుకుని మొదటిసారి యిప్పుడే ఆమె దుఃఖించింది.

టౌన్ వంశంలో పుట్టిన పిల్లవాడినే అన్నకు దత్తత చేయాలి. తన మనుమళ్ళలో ఒకణ్ణి దత్తత యిచ్చేందుకు ముసలి అత్తను ఒప్పించాలి. ఆమెకు చాలామంది మనమలు ఉన్నారుకదా అనుకుంది గోల్డ్‌స్లవరు.

మంచు కురుస్తోంది. ముసలి అత్త తెల్లవారిగట్టే పొలంలోకి వెళ్లింది. వెచ్చగా ఉండడానికి బూడిద అడుగున నిప్పులున్న కుంపటి ఒకటి తనతో పట్టుకు వెళ్లిందామె. ఊరి మొగసాలలో లేతవయస్సులో వున్న ఒక సిపాయిని కాపలా వుంచారు. ఊళ్ళో ఉద్రేకం యింకా చల్లారనందువల్ల ఆ సిపాయి రాత్రింబగళ్లు వూరికి కాపలా కాస్తున్నాడు. అతను ముసలి అత్త చేతిలో కుంపటిని చూసి "మళ్లా గిడ్డంగికి నిప్పు పెట్టడానికి పోతున్నావా ముసలి అత్తా?" అన్నాడు ఎక్కిరింపుగా.

"పిచ్చిమాటలు మాట్లాడకు. నా మనమడు చాలా జబ్బుగా ఉన్నాడు. ఈ సమయంలో నాతో ఎగతాళా నీకు!" అంది ముసలి అత్త చుట్టూ భయభయంగా చూస్తూ.

ఆమె చిన్న మనమడికి చాలా జబ్బుగా వుంది. ఏదో గాలి సోకిందనీ, ఏ భూతానికో కోపం తెప్పించాడనీ, నలుగురూ అన్నారు. ఆ కుర్రాళ్లో ఉంటనుండి ఒక్కసారి చచ్చిపోవడం చూస్తే వాళ్ల మాటల్లో నిజం లేదనుకునేందుకు వీల్లేదు.

ముసలి అత్తకి ఆ పిల్లాడి జబ్బుకు కారణమేమిటో తెలుసు.

అగ్ని ప్రమాదం జరిగిన మర్నాడు ఊరి ప్రజలు కాలిపోయినా బూడిద ఎత్తి పారబోస్తున్నారు. ఒకచోట రెండు గోడలు ఒకదానిమీద ఒకటి వాలడం వల్ల వాటి మధ్య సొరంగాలాగా సందు ఏర్పడింది. ఆ సొరంగంలో ఒక కళేబరం కనపడింది. కూర్చునివున్న ఆ శరీరం నున్నగా, ఎర్రగా తళతళ లాడుతోంది. నల్లగా కాలిపోయిన ఆ పరిసరాల్లో ఎర్రని ఆ దేహం కళ్ళకు కొట్టొచ్చినట్లు వుంది. దేవాలయానికి రంగు వేస్తూ భాగులు పూర్చివుండే బక్కపల్చని, బౌద్ధ సన్యాసుల విగ్రహాలలో ఒక విగ్రహంలాగా కనపడింది ముసలి అత్తకా శరీరం. ముసలి అత్తతో పాటు అక్కడ ఉన్న అందరికీ అలాగే కనిపించిందా శరీరం. ముసలి అత్తకు భయంవేసి ఒళ్లు కంపించింది. సన్యాసులు చచ్చిపోయినప్పుడు వాళ్ళ దేహాలను జాడీల్లో కూర్చోబెట్టి పాతేస్తారని ఆమెకు జ్ఞాపకం వచ్చింది. ఆ శరీరం గోల్డ్‌స్లవరు భార్యది. ఆ సంగతి ఆమెకు తెలుసు. ఆ విచిత్ర దృశ్యం మూలాన

సెంటు దేవాంశ సంభూతురాలని చెపుతున్నట్లుంది. అథమం ఆమె క్రితపటి జన్మలో పుణ్యం చేసుకున్న సన్యాసిని అయి ఉండాలి.

ఆ శరీరం మూన్ సెంటుది అని ఆమెకు తెలిసికూడా ఆ సంగతి ఆమె బయట పెట్టలేదు. తిరగ బాటులో పాల్గొనడం కంటే గిడ్డంగి తగలబెట్టడం పెద్ద నేరం. ఆ వూరి వాళ్లలో ఎవరో ఒకరు ఆ పని చేశారని అధికారులు అనుమానిస్తున్నా అది ఎవరో స్పష్టంగా తెలియక పోవడం మంచిది. దీనికి ప్రతీకారం ఏ రూపంలో ఎట్లా వస్తుందో ఎవరు చెప్పగలరు! జపాను వాళ్లు చేసినట్లు అధికారులు ఊరినంతా నాశనం చేసినా చేయవచ్చు.

రైతుసంఘం అధ్యక్షుడు కూడా ఆ శవం ఎవరిదో చెప్పలేనన్నాడు. కామ్రేడ్ వోంగు ఎక్కడినించో వూడిపడి అది మూన్ సెంటు శవమని గట్టిగా చెప్పాడు. క్రితం రాత్రి గిడ్డంగికి కాపలా వున్న సిపాయి వచ్చి అక్కడ ఒక స్త్రీ తారట్లాడుతుండడం చూసి ఆమెను మండుతున్న గిడ్డంగిలోకి తరిమానని ఆవేశంతో చెప్పాడు.

"అది గోల్డురూటు టాన్ భార్య అయివుంటే ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. ఆవిడ పట్నంలో పని చేయడానికి మూడేళ్ల క్రిందట వెళ్ళింది. గూఢచారులతోనూ, కోమింటాంగ్ ప్రతినిధులతోను ఆమెకు పరిచయమైందేమో! అయోగ్యమైన స్నేహాలు చేసిందేమో! ఎవరు చెప్పగలరు? ఒక నెల క్రిందట ఆమె తిరిగి పల్లెకు తిరిగి వచ్చింది. ఇప్పుడిది జరిగింది. ఈ పని చేయడానికి ఆమెను ప్రత్యేకంగా యిక్కడకు పంపి ఉంటారు" అని చెప్పి రైతు సంఘాధ్యక్షుడు అది మూన్ సెంటు శరీరమే అని చివరకు ఒప్పుకున్నాడు.

"నేను చచ్చిపోయిన వాళ్లను గురించి చెడ్డగా మాట్లాడే స్వభావం గలదాన్ని కాను. కాని ఆ పిల్ల జిత్తుల నక్క. ఆపదలు తెచ్చిపెట్టే తోకచుక్క. ఆమెను పట్నంలో ఒంటిగా నమ్మి ఉండనీయ కూడదని నాకు ఎప్పుడూ తెలుసు. బందిపోటు దొంగలతోనో, విప్లవ విరోధుల తోనో స్నేహం చేసి ఉంటుంది. పాపం మా గోల్డురూటుని ముక్కుకు తాడేసి నడిపించింది. వాడు ఎంత మంచివాడు! ఎంత పురోగామి! పట్నం నించి వచ్చి వాణ్ణి యిట్టే మార్చేసింది. కామ్రేడ్ వోంగుని అడగండి కావలిస్తే! ఆ కూతురు ముండని ఎట్లా చావకొట్టేది! తల్లా! సవతి తల్లా

అనిపించేది. కాత్రిమేన్ 'కు' ని అడిగండి. అతని కంతా తెలుసు. నాతో పోట్లాడినప్పుడు ఒక్క కూత కూసిందా! తరవాత బాగా నేను ఒక్కసారి కూడా మాట్లాడలేదు. ఎవరైనా అడిగండి చెబుతారు" అంటూ ముసలి అత్త వాగింది.

ఆ మాటలు వాగ్గాడి యింటికి రాగానే తన మనవడు జ్వరంతో పడుకుని ఉండడం చూసింది ముసలి అత్త. కోడల్ని భయపెట్టడం యిష్టం లేక గోల్డుహావ్ గాబుతో ఏం చెప్పలేదామె. కాని వెంటనే మూన్ సెంటుని మనస్సులో తలుచుకుని "మూన్ సెంట్! గొప్పవాడా! బ్రతికి వున్నప్పుడు నువ్వు మనిషి మాత్రులాలవే అయినా చచ్చాక దేవుడవైనావు. ఈ పసిబిడ్డను వేధించడానికి తల పడక. ఎంతైనా నీ మనవడే కదా!" అనుకుంది ముసలి అత్త.

ఆ రాత్రి పిల్లవాడికి జ్వరం ఎక్కువయింది. తెల్లవారి లేవగానే మూన్ సెంటు సమాధి దగ్గర ధూపం వేయడానికి నిశ్చయించుకుంది ముసలి అత్త. అధికారులకు పట్టుబడ్డా శిక్ష చేయకూడదనుకుందామె.

ముసలి అత్త మూన్ సెంటుని తలుచుకుని "వాడు నీ మనవడు. నేను నీకు కోపం తెప్పించానేమో కాని వాడి తల్లి నీక్షేమం కోసం తెప్పించలేదు కదా! నువ్వూ, వాడి తల్లీ ఎంతో స్నేహంగా వుండేవాళ్ళు. ఆ సంగతి జ్ఞాపకం ఉంచుకుని పిల్లవాడి జోలికి రాక. వాడు పెద్దవాడయాక నీ సమాధి దగ్గర ప్రతి సంవత్సరానికీ, ప్రతి పండగకూ ధూపనైవేద్యాలు పెట్టుతాడు. నీకు పుట్టిన కొడుకు లాగా ఉంటాడు" అని తనలో తను గొణుక్కుంది.

వీధి పొడుగుతా వున్న వెదురు చెట్లపైన మంచు దట్టంగా కురిసింది. గాలి వీచినప్పుడు ఆ చెట్లకు ఉన్న తెల్లని మందపాటి ఆకులమీది మంచు రాలిపోయి అక్కడక్కడ ఆకు పచ్చగా అవి కనపడ్డాయి. కుంపట్లో ఉన్న బూడిద గాలికి ఎగిరి ముసలి అత్త ముఖంపైన పడ్డది. కుంపట్లో ఉన్న నిప్పులతో ఆమె ధూపం వెలిగిస్తుంది. నరాలు కొట్టుకుంటున్న వళ్ళో ఆమె కళ్ళవెంటా, ముక్కువెంటా నీళ్ళు కారుతున్నాయి. మంచులో ఉన్న చొక్కాకింద పొడుగాటి వెండి కాగితం గిన్నెల వరసను పెట్టి [illegible]ందామె. చలికి ఆ చెయ్యి కొంకర పోయింది. గిన్నెలు

బయటకు కనపడకుండా ఉండేందుకు చెయ్యి పైకి ఎత్తి పెట్టుకోవలసి వచ్చింది. ఉలిపిరిగా ఉన్న వెండి కాయితాలు నలిగిపోకుండా ఉండేందుకు చెయ్యి వంటికి తగలకుండా దూరంగా పెట్టింది.

అంతా మంచుతో కప్పబడి, నిశ్శబ్దంగా ఉన్న ఆ వాతావరణంలో పక్షులు ఆకలితో కిచకిచ లాడడం పెద్దగా వినిపించింది. మాన్ సెంటు సమాధి ఎక్కడ ఉందా అని ముసలి అత్త పొలాన్నంతా కలయ చూచింది. ఆమె సమాధి కనుక్కోడం సులభం కాదని ఆమెకు తెలుసు. శవాన్ని చాపలో చుట్టి, లోతులేని ఒక గుంటలో పడేసి మన్ను పైన పోశారు. సమాధి కనిపించేటట్లు మన్ను ఎత్తుగా పొయ్యలేదు.

గతుకులుగా వున్న దారి పక్కన భూమిమీద దూరంగా పసుపు పచ్చని మాచిక ఒకటి కనపడ్డది ముసలి అత్తకు. "అదేనా సమాధి? మంచులోంచి మట్టి పచ్చగా కనపడుతోందా? కాదు. సమాధి మీద అసలు మంచే లేదు" అనుకుని భయంతో వణికిపోయిందామె.

కుక్కలు దూరాన మొరగడం ఆమెకు వినిపించింది. వాటి అరుపులు పెద్దగా వినపడలేదు గాని స్పష్టంగా ఉన్నాయి. ఆమె కళ్ళు తుడుచుకుని జాగ్రత్తగా చూసింది. పసుపు పచ్చ మాచికగా కనపడ్డది కుక్కల గుంపనీ, అవి సమాధి దగ్గర ఒక దానితో ఒకటి పోట్లాడుకుంటున్నాయనీ ముసలి అత్తకు స్పష్టమయింది. అవి ముట్టెలతోనూ, కాళ్లతోనూ మట్టిని తవ్వి సమాధిని పెళ్లగించాయి. గుంపుగా ఉన్న ఆ కుక్కల శరీరాలకింద కనపడుతున్నది ఈతచాప కొస అనుకుందామె.

"అయ్యో పాపం! అయ్యో పాపం! తన అస్థిపంజరాన్నే తను కాపాడుకోలేక పోయిందే! ఇతర్లకు ఆదేం హాని కలిగిస్తుంది" అని గొణుగుకుంటూ తేలికపడ్డ మనస్సుతో ముసలి అత్త అక్కడనించి బయలుదేరింది.

♦ ♦ ♦

కాప్రేమేడ్ వోంగుకు ఎదురుగా ప్రతిరోజూ 'కు' బల్లముందు కూర్చుంటున్నాడు. తలకు కట్టు కట్టుకునే వోంగు పై అధికారులకు చాలా సంజాయిషీలు వ్రాశాడు. అతనికి ఎదురుగా కూర్చుని 'కు' చిత్రానికి కథ వ్రాశాడు. ఆనకట్టను గురించిన కథలో తంటాలుపడి అగ్నిహోత్రుణ్ణి

కూడా ప్రవేశపెట్టాడు 'సు'. ఆనకట్ట తెగలబడటం మొట్టాగా అనే గడ్డు సమస్య అతన్ని ఎదుర్కొంది.

ఆఖరికి కథ యిలా తయారైంది—ఇంజనీర్లు, ముసలి రైతులూ కలిసి ఆలోచించి ఏటా వచ్చే వరదలను అరికట్టడానికి తరుణోపాయం నదిని ఆనకట్ట కట్టడమేనని నిశ్చయించుకున్నారు. ఆ ఊళ్ళో ఒక భూస్వామి ఉన్నాడు. ప్రభుత్వం దయాధర్మం వల్ల అతన్ని భూ సంస్కరణలు బాధించలేదు. అందరికే యిచ్చినట్టే అతనికి ఒక ఎకరం పొలం ఉంచనిచ్చారు. దొంగవిందులు సదా స్తుతిస్తూ మిగతా అందరికంటే అతను బాగా బ్రతికేవాడు. అధికారులు వచ్చినప్పుడు త్వరగా భోజనం ముగించి తను తినేది వాళ్లకు కనిపించకుండా చేసేవాడు. గుమ్మడికాయలాగు పొట్ట వున్న ఆ ముసలాయనకు ఒక నౌకర్ని పిల్లతో సంబంధం వుండేది. ఆవిడను అతను ఉంచుకుని వుంటాడు. ప్రజా రాజ్యంలో ఉంపుడుకత్తెలు ఉండకూడదు. కనుక ఆమె ఆయన భార్య అవునా కాదా అని ప్రశ్నించడం మంచిది కాదు. భూమి లాక్కోబడిన ఆ భూస్వామి రకరకాల రాజద్రోహపు పనులు చేస్తున్నప్పుడు మిణుకు మిణుకు మనే దీపపు కాంతిలో అతని బల్లదగ్గర వయ్యారంగా నిలబడటం ఆమె చేయవలసిన పనులలో ముఖ్యమైన పని. ఆమెకూ, మూన్ సెంటుకూ పోలిక వుంది. గిడ్డంగి మంటల్లో కాలిపోయిన మూన్ సెంటు దేహాన్ని చూడడానికి 'సు' వెళ్ళలేదు. అందువల్ల మూన్ సెంటు స్మృతి అతని మనస్సులో ఎప్పటిలాగే నిలచివుంది. అతను వ్రాసే కథలో అది వేసవి కాలం కావడం వల్ల ఆ పిల్ల పల్చని గీతల నూలు చొక్కా తొడుక్కుంటుంది. చొక్కా వదులుగా బురఖాలాగు వేలాడుతున్నా గీతలు వుంటాయి కనుక [illegible]గానే కనపడుతుంది.

భూస్వామి దగ్గరకు ఒక గూఢచారి వస్తాడు. జాతీయ సైన్యంలో సేనాధిపతి పదవి యిచ్చి భూస్వామిని శత్రుపక్షంలో చేరుస్తాడతను. కొత్తగా కట్టుతున్న ఆనకట్టను పేల్చివేయడానికి భూస్వామి తన ఉంపుడు [illegible] తోంబడి పెట్టుకుని దొంగతనంగా రాత్రి బయలుదేరుతాడు. ఆన[illegible] జాగ్రత్తగా కాపలి కాస్తున్న ఒక సిపాయి వాళ్లను సమయానికి

కనిపెట్టాడు గాని అనవాళ్లు తెలియకముందే వాళ్ళు తప్పించుకుని పారిపోతారు.

గూఢచారి ఏదో ఒక కార్యం సాధించి చూపమని భూస్వామిని ఒత్తిడి చేస్తాడు. భూస్వామి తెగించి ప్రభుత్వం వారి గిడ్డంగికి నిప్పు అంటిస్తాడు. ఆ పని చేస్తుండగా అతను పట్టుబడతాడు. ఒక చిన్న మూట పట్టుకుని అతని వెనకే వస్తున్న అతని ఉంపుడుకత్తె కూడా పట్టుబడుతుంది. గిడ్డంగికి నిప్పంటించి దేశం విడిచి పారిపోదామని వాళ్ళ ఆలోచనై ఉంటుంది. మూటలో కొన్ని విలువైన వస్తువులతోబాటు అతను జాతీయ సైన్యానికి సేనాధిపతిగా ఉన్నట్లు సాక్ష్యం కూడా వుంది.

కథ బాగా కుదిరిందని 'కు' కు చాలా సంతోషంగా వుంది. కష్టపడి చాలా మంచి కథ అల్లాడు తను. అగ్ని ఆట్టే పెద్దదిగా ఉండకూడదు. ఒకటి రెండు బస్తాల బియ్యం తగలబడి, పొగ రావడంతోటే కావలివాడు "మంటలు! మంటలు! విధ్వంసకులు!" అంటూ చుట్టూ పరిగెత్తుతాడు. లేకపోతే స్థానిక సైనికదళం పరువుకు భంగంగా వుంటుంది. కొన్ని పత్రికలు కోపంతో ప్రజా సంస్థలనే తారతమ్యం లేకుండా హేళన చెయ్యడమనీ, నిర్మాణాత్మకమైన విమర్శ హద్దులుదాటి మితిమీరి పోవడమనీ అంటాయి. చిత్రం నిషేధింపబడక పోవచ్చు. నిషేధిస్తే ప్రజల దృష్టి మరింతగా ఆకర్షింపబడుతుంది. కనుక చిత్రాన్ని ప్రదర్శన మధ్యలో చడీ చప్పుడూ లేకుండా ఆపివేయిస్తారు. అంతటితో తన పేరు పైకి వచ్చే అవకాశం అంతరిస్తుంది.

◆ ◆ ◆

గిడ్డంగి కాలిపోవడం వల్ల అందులో వున్న బాణసంచా అగ్నికి ఆహుతైంది. సైనికుల కుటుంబాలను సందర్శించి బాణసంచా కాల్చి వాళ్లను ఉత్సాహపరిచే అవకాశం పోయింది. తిరిగి బాణసంచా తెప్పించేందుకు వీలు లేనందువల్ల అప్పటికి ఆ పని వాయిదా పడ్డది. సంవత్సరాది వెళ్లిపోయాక బహుళపంచమినాడు దుకాణాలు తెరవబడ్డాయి. కామ్రేడ్ వోంగు రైతుల దగ్గర మళ్ళీ చందాలు పోగుచేసి బాణసంచా కొనడానికి పట్నం వెళ్ళాడు.

మర్నాడు పొద్దున్న పంచాయితీ ఆఫీసు బయట జనం పోగయ్యారు. ఊరేగింపు బయలుదేరింది. ఏరువాక పాట పాడే బృందం ముందు నిల

బడ్డది. వాళ్ళ వెనక బహుమతులు మోసుకొస్తున్న వాళ్ళు డప్పులూ, తాళాలూ వాయిస్తూ నిలబడ్డారు. పురుషులూ, స్త్రీలూ ఒకరి పక్కన ఒకరు రెండు వరసలలో నిలబడి అడుగులు వేస్తూ నాట్యం చేశారు. చలి చలిగా ఉన్న పొద్దుటి ఎండలో రంగు పూసుకున్న వాళ్ళ చెంపలు ఎర్రగా మెరిశాయి. బహుమతులు మోసుకొస్తున్న వాళ్ళ నడుములు కావిళ్ళ బరువుకు వొంగి పోయాయి. సరిగా నిలబడేందుకు వాళ్ళు ప్రయత్నించారు. నిలువుగా సగానికి కోయబడ్డ పందిమాంసం ముక్కలు ఊబిక, తెల్లబడి కావిళ్లకు రెండువేపులా వేళ్ళాడుతున్నాయి. పందుల తలలు పళ్ళాలలో ఉన్నాయి. వాటి చెవులలో ఎర్రటి కాయితం పూలు తమాషాగా గుచ్చబడ్డాయి. మిగతా పళ్లాలలో సంవత్సరాది రొట్టెలు పేర్చిపెట్టారు. తెల్లగా ఉన్న ఆ రొట్టెలు రాళ్లలాగా గట్టిగా వున్నాయి. కొంతమంది మనుష్యులు తిరగ బాటులో నశించడం వల్ల నాట్య బృందం వెలితిగా కనబడ్డది. చూస్తూ చుట్టూ నిలబడ్డ పెద్దల దగ్గరకు వెళ్ళిన కామ్రేడ్ స్మాల్ ఫాంగును యువతలకు పిలిచి వొంగు వాళ్ళతో మాట్లాడాడు. వృద్ధులైన పురుషులూ, స్త్రీలూ ఒకరి నొకరు తోసుకుంటూ, నవ్వుతూ నాట్యంచేసే వాళ్లపక్కన నిలబడ్డారు. వాళ్ళల్లో ముసలి మామా, ముసలి అత్తా కూడా ఉన్నారు. వాళ్ళ ముసలి ముఖాలలో కోపమూ, సంతోషమూ కూడా కనబడ్డాయి. వాళ్ళ చేతులు ముందుకీ, వెనక్కీ తిప్పుతూ ఏదనాక పాట పాడడానికి ప్రయత్నించారు.

కామ్రేడ్ వొంగు తల తిప్పిచూశాడు. 'ఘు' అతని పక్కనే నిలబడి ఉన్నాడు. ముసలి అత్త నాట్యం చేస్తూంటే వొంగు అవేపు తల ఆడిస్తూ "డబ్భై ఏడు సంవత్సరాలు నిండాయి. అయినా ఎంత ఉత్సాహంగా ఉందో!" అన్నాడు నవ్వుతూ.

"సంవత్సరాదికి 'అరవై ఎనిమిది'" అంటూ వొంగుని కోపంగా చూసిందామె.

"అరవై ఎనిమిదేనట!" అంటూ వొంగు గర్వంగా 'ఘు' ని చూశాడు.

ఊరేగింపు వూరి పొలిమేరదాటి పొలాల్లో ప్రవేశించింది. నాట్యం ఆగిపోయింది. పక్కన ఉన్న వూళ్ళకి వూరేగింపు వెళ్లగానే నాట్యం

ప్రారంభమవుతుంది. కావిళ్లనుండి వేళ్లాడుతున్న పందుల దేహాలు కిందికీ పైకీ వూగుతూ వుంటే కావడి మోతగాళ్ళు కూడా వాటితో బాటు వూగారు. మైదానంలో ఉన్న కాలిబాట మీదగా వూరేగింపు నెమ్మదిగా సాగి వెళ్ళింది. డప్పులూ, తాళాలూ

ఛంగ్, ఛంగ్, ఛి ఛంగ్ ఛి!
ఛంగ్, ఛంగ్, ఛి ఛంగ్ ఛి!

అంటూ పెద్దగా మోగాయి. విశాలమైన ఆకాశం క్రింద వాటి చప్పుడు గాలిలో కలిసిపోయి పన్నగా వినిపించింది.

